# శ్రీవాణి జీవిత సభ్యులు



**Sri Kotha Narasimha Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri Talluri Srinivasulu**
Bhimavaram, W.G.Dist.,



**Sri V. Kanaka Raju**
Bhimavaram, W.G.Dist.,



**Sri J. Venkateswara Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri N. V. Narasimha Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri B.V.Ramakrishnarao Gupta**
Bhimavaram, W.G.Dist.,



**Sri S.SatyanarayanaMurthy**
Bhimavaram, W.G.Dist.,



**Sri Kuriseti Bhaskara Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri Ganireddy Trinath**
Bhimavaram, W.G.Dist.,



**Sri Koti Bapi Raju**
Bhimavaram, W.G.Dist.,



**Sri I. Venkateswarlu**
Bhimavaram, W.G.Dist.,



**Sri Meragani Appa Rao**
Bhimavaram, W.G Dist.,



**Sri M. Narayana Murthy**
Bhimavaram, W.G.Dist.,



**Sri I. Venkata Subba Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri Gunuputi Yarrayya**
Bhimavaram, W.G.Dist.,



**Sri Voleti Subba Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri Karumuri Subba Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri A. G. Krishna Murthy**
Bhimavaram, W.G.Dist.,



**Sri Kuriseti Namasivayya**
Bhimavaram, W.G.Dist.,



**Sri Maredugula BapujiRao**
Bhimavaram, W.G.Dist.,



**Sri K.RamaKrishnaMurthy**
Bhimavaram, W.G.Dist.,



**Sri Ch.Venkata Subba Rao**
Bhimavaram, W.G.Dist.,



**Smt. S. Sitamahalakshmi**
Bhimavaram, W.G.Dist.,



**Sri Chavva Alavala Rao**
Bhimavaram, W.G.Dist.,

# శ్రీవాణి జీవిత సభ్యులు


**Sri Kotha Narasimha Rao**
Bhimavaram, W.G.Dist.,


**Sri Talluri Srinivasulu**
Bhimavaram, W.G.Dist.,


**Sri V. Kanaka Raju**
Bhimavaram, W.G.Dist.,


**Sri J. Venkateswara Rao**
Bhimavaram, W.G.Dist.,


**Sri N. V. Narasimha Rao**
Bhimavaram, W.G.Dist.,


**Sri B.V.Ramakrishnarao Gupta**
Bhimavaram, W.G.Dist.,


**Sri S.SatyanarayanaMurthy**
Bhimavaram, W.G.Dist.,


**Sri Kuriseti Bhaskara Rao**
Bhimavaram, W.G.Dist.,


**Sri Ganireddy Trinath**
Bhimavaram, W.G.Dist.,


**Sri Koti Bapi Raju**
Bhimavaram, W.G.Dist.,


**Sri I. Venkateswarlu**
Bhimavaram, W.G.Dist.,


**Sri Meragani Appa Rao**
Bhimavaram, W.G Dist.,



**Sri M. Narayana Murthy**
Bhimavaram, W.G.Dist.,



**Sri I. Venkata Subba Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri Gunuputi Yarrayya**
Bhimavaram, W.G.Dist.,



**Sri Voleti Subba Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri Karumuri Subba Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri A. G. Krishna Murthy**
Bhimavaram, W.G.Dist.,



**Sri Kuriseti Namasivayya**
Bhimavaram, W.G.Dist.,



**Sri Maredugula BapujiRao**
Bhimavaram, W.G.Dist.,



**Sri K.RamaKrishnaMurthy**
Bhimavaram, W.G.Dist.,



**Sri Ch.Venkata Subba Rao**
Bhimavaram, W.G.Dist.,



**Smt. S. Sitamahalakshmi**
Bhimavaram, W.G.Dist.,



**Sri Chavva Alavala Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri Sunku Venkateswarlu**
Bhimavaram, W.G.Dist.,



**Sri M. V. Subba Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri Raja Sudhakara Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri S. Trinadha Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri Padala Subba Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri Y.V. Satyanarayana Raju**
Bhimavaram, W.G.Dist.,



**Sri K. Markendeya Swamy**
Bhimavaram, W.G.Dist.,



**Smt. T. Venkata Ratnamma**
Bhimavaram, W.G.Dist.,



**Sri B. Satya Mohan Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri Kotha Subba Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri K. Sriramachandra Murthy**
Bhimavaram, W.G.Dist.,



**Sri P. Rama Brahmam**
Bhimavaram, W.G.Dist.,



**Sri P. Krishna Mohan Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri P. Naga Raju** (Auditor)
Bhimavaram, W.G.Dist.,



**Sri Bonda Krishna Murthy**
Bhimavaram, W.G.Dist.,



**Sri Viswanadha Agarwal**
Bhimavaram, W.G.Dist.,



**Sri Panduranga Vittal**
Bhimavaram, W.G.Dist.,



**Sri K. Nageswara Rao**
Bhimavaram, W.G.Dist.,



**Dr.G. Satyanarayana Raju**
Bhimavaram, W.G.Dist.,



**Sri Gundu Seshavataram**
Bhimavaram, W.G.Dist.,



**Sri Gade Radha Krishna**
Bhimavaram, W.G.Dist.,



**Dr. K.A.J. Varma**
Bhimavaram, W.G.Dist.,



**Sri P. Satyanarayana Murthy**
Bhimavaram, W.G.Dist.,



**Sri P. Subbarayudu**
Tadepalligudem, W.G.Dist.,



**Sri Sunku Venkateswarlu**
Bhimavaram, W.G.Dist.,



**Sri M. V. Subba Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri Raja Sudhakara Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri S. Trinadha Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri Padala Subba Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri Y.V. Satyanarayana Raju**
Bhimavaram, W.G.Dist.,



**Sri K. Markendeya Swamy**
Bhimavaram, W.G.Dist.,



**Smt. T. Venkata Ratnamma**
Bhimavaram, W.G.Dist.,



**Sri B. Satya Mohan Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri Kotha Subba Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri K. Sriramachandra Murthy**
Bhimavaram, W.G.Dist.,



**Sri P. Rama Brahmam**
Bhimavaram, W.G.Dist.,



**Sri P. Krishna Mohan Rao**
Bhimavaram, W.G.Dist.,



**Sri P. Naga Raju** (Auditor)
Bhimavaram, W.G.Dist.,



**Sri Bonda Krishna Murthy**
Bhimavaram, W.G.Dist.,



**Sri Viswanadha Agarwal**
Bhimavaram, W.G.Dist.,



**Sri Panduranga Vittal**
Bhimavaram, W.G.Dist.,



**Sri K. Nageswara Rao**
Bhimavaram, W.G.Dist.,



**Dr.G. Satyanarayana Raju**
Bhimavaram, W.G.Dist.,



**Sri Gundu Seshavataram**
Bhimavaram, W.G.Dist.,



**Sri Gade Radha Krishna**
Bhimavaram, W.G.Dist.,



**Dr. K.A.J. Varma**
Bhimavaram, W.G.Dist.,



**Sri P. Satyanarayana Murthy**
Bhimavaram, W.G.Dist.,



**Sri P. Subbarayudu**
Tadepalligudem, W.G.Dist.,



**Sri B. V. Ramana**
Anakapalli, Vizag Dist.,



**Sri Gudivada KrishnaMurthy**
Kothapalli, W.G.Dist.,



**Sri Sanka Mavullayya**
Sidhantam, W.G. Dist.,



**Sri A.S. Srinivasa Murthy**
Bangalore



**Sri Y.SrinivasaReddy**(Advocate)
Bagepalli, Karnataka State



**Sri Ch. Venkateswarlu**
Guntur



**Sri K. Raveendrulu**
(D.O.; LIC) Hindupur



**Dr. Y. Madhusudhana Rao**
Vijayawada



**Sri B. Vasudeva Rao**
Rajahmundry



**Sri P. Chandramouleswara Rao**
(Auditor) Vijayawada



**Sri J. Nagabasaveswara Rao**
Machilipatnam



**Acharya Bhavan**
Vizianagaram



**Dr. N. Satyanarayana**
Vijayawada



**Sri S. Chennakesava Rao**
L.I.C. Chirala



**Sri Valiveti KoteswaraRao**
Nuzivid, Krishna Dist.



**Sri N. Satyanarayana**
Hindustan Lever Ltd. Madras



Proprietor, **SYAM SILKS**
Bhimavaram, W.G. Dist.,



Prop: **Naresh Cloth Show Room**
Bhimavaram, W.G. Dist.,



**Sri T.S.S.L. Prasad**
Agent & Member, ZM's Club, LIC
Anantapur



**Sri Y. Linga Murthy**
Mancherial, Adilabad Dt.



**Sri S. R. Avadhani**
Bombay-400 077



**Smt.& Sri B. Yallamandaiah**
Madras-600 029



**Smt.& Sri T. Naga Raju**
Anantapur



**Smt.& Sri J. Nagalingeswara Rao,** Atapaka, Krishna Dt.



శ్రీ బొగ్గవరపు శ్రీధర్
ప్రొద్దుటూరు. కడపజిల్లా.



శ్రీ జె. గోపాల కిషన్‌రావు
ఎర్రుపాలెం, ఖమ్మం జిల్లా.



శ్రీమతి & శ్రీ జి. చంద్రశేఖర్
వైశ్యాబ్యాంక్. ఉప్పల్. హైద్రాబాద్



శ్రీమతి జె. భారతమ్మ, జె.మల్లయ్య
E.C.I.L, Hyderabad.



శ్రీమతి శీమకుర్తి సత్యవతి
శ్రీ శీమకుర్తి సూర్యనారాయణ
తణుకు, తూ.గో.జిల్లా



కీ.శే. కంభంపాటి మల్లయ్య
(కూనపరాజు పర్వ) గారి
జ్ఞాపకార్థం, వారి కుమారుడు
శ్రీ కె. సత్యనారాయణ, విశాఖపట్నం
వారి విరాళము రు.**1,116/-**లు

## కృతజ్ఞతలు

1995 జనవరి నుండి ప్రేమతో 'శ్రీవాణి' కి జీవిత సభ్యత్వం పంపిన వారి ఫోటోలను ఈ ప్రత్యేకసంచికలో ముద్రించుచున్నాము. జీవితసభ్యులుగా చేరి శ్రీవాణిని ప్రోత్సహించిన దాతలందరకీ కృతజ్ఞతాభివందనములు. ముఖ్యంగా భీమవరమునకు చెందిన వారందరిని జీవిత సభ్యులుగా చేర్పించడంలో ఎనలేని కృషి సలిపిన **శ్రీ గుడివాడ వెంకటేశ్వరరావు(రైస్‌మిల్లర్)** గారికి ప్రత్యేకమైన కృతజ్ఞతాభివందనములు.

శ్రీవాణి ప్రత్యేక సంచిక కవరు పేజీని సర్వాంగ సుందరంగా ముద్రించిన **విజయవాడ ఆఫ్‌సెట్ ప్రింటర్స్** వారికి, శ్రీ సత్యసాయి శతకము ను మరియు ఫోటోలను అందముగా ముద్రించిన **బృందావన్ ఆఫ్ సెట్ ప్రింటర్స్** (బందరు) వారికి, ప్రత్యేక సంచికను అందముగా ముద్రించిన **శ్రీవాణి ప్రింటర్స్**(బందరు) వారికి కృతజ్ఞతాభివందనములు.

**మేనేజర్**

# అందరికీ నమస్కరించి....

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి దివ్యాశీస్సులతో, శ్రేయోభిలాషుల సహాయ సహకారములతో, చందాదారుల అండదండలతో, ప్రకటనదారుల ప్రోత్సాహంతో, రచయితల స్ఫూర్తితో, క్రమం తప్పకుండా, ప్రతినెలా సకాలంలో పాఠకులకు అందించబడుతూ, వారి ప్రశంసలనందుకుంటున్నది' శ్రీవాణి '

'శ్రీవాణి' ఈనాడు మన రాష్ట్ర పరిధులను దాటి అన్ని ప్రధాన పట్టణములలో నున్న తెలుగు వారి వద్దకే గాక, అమెరికా మొదలగు విదేశాలలో నివసిస్తున్న తెలుగు వారి చెంతకు కూడా చేరుకొని వారి ప్రశంసల నందుకుంటున్నది. అంతేగాక రాష్ట్రస్థాయిలో రెండు పర్యాయములు ఉత్తమ ఆధ్యాత్మిక పత్రికగా విశిష్ఠ-అవార్డులను కూడా అందుకొనినది.

అర్ధనగ్న దృశ్యాలతో, సినిమా బొమ్మలతో, సెక్స్ సాహిత్యంతో, ప్రేమ కథలతో పత్రికలు మార్కెట్‌లో దర్శనమిస్తున్న ఈ తరుణంలో, వాటికి ఏ మాత్రం స్థానమివ్వకుండా కేవలం సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్యా, విజ్ఞాన వ్యాసములను మాత్రమే ప్రచురించుతూశ్రీవాణిని గత 11 సంవత్సరములుగా నడుపుతున్నాము.

1995 జనవరి నుంచి ఊహించని రీతిలో న్యూస్‌ప్రింట్ రేట్లు పెరిగిపోయి నెలకు ఐదు వేల రూపాయిలదాకా అదనంగా భారం పైన పడుతున్నప్పటికీ చందారేట్లు పెంచకుండా, పత్రికను పాఠకులకు అందిస్తున్నాము. ఈ ప్రత్యేక సంచికతో పాటు " శ్రీ సత్యసాయి శతకము " ( మూడవ భాగం) కూడా చందాదారులందరికీ ఉచితంగా అందజేయటంవలన ఈ ఒక్క నెలలోనే అదనంగా 35 వేల రూపాయిల దాకా భరించవలసివచ్చింది. భగవాన్ బాబా జన్మదిన ప్రత్యేక సంచిక కాబట్టి అడ్వర్‌టైజ్‌మెంట్సు కూడా ఎవరినీ అడుగదలచలేదు (మామూలుగా ప్రతినెలా కాంట్రాక్టు పద్ధతిన ఇచ్చే వారు తప్ప). భగవాన్ సాయి దివ్యసందేశాలను, దివ్యలీలలను పదిమందికీ అందించటమే ఈ ప్రత్యేక సంచిక లక్ష్యం కానీ, డబ్బు సంపాదన పరమావధి కాదు.

' శ్రీవాణి ' చేస్తున్న కృషిని ఎంతో మంది పెద్దలు అభినందిస్తున్నారు. ప్రశంసిస్తున్నారు. శ్రీవాణిని అభిమానించే వారందరికీ ఒక చిన్న మనవి చేయదలిచాను. ప్రతి ఒక్కరూ కనీసం ఒక క్రొత్త చందాదారుని చేర్పించి వెంటనే పంపిన యెడల ఈ ప్రత్యేక సంచికను, శ్రీ సత్యసాయి శతకము (మూడవ భాగం) ను కూడా వారికి పంపగలము. ఈ ఉత్తమ ఆధ్యాత్మిక మాసపత్రికను సాధ్యమైనంత వరకు ఎక్కువ మందికి అందించే ఈ మహాప్రయత్నంలో ప్రతి ఒక్కరూ భాగస్వాములై తమ విద్యుక్తధర్మాన్ని నిర్వర్తిస్తారని ఆశిస్తున్నాను.

**మంచిని పెంచండి ! పది మందికి పంచండి !**

ధన్యవాదములు.

సదాసాయి సేవలో....

**కొమరగిరి కృష్ణమోహనరావు**

సంపాదకులు.

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు: కొమరగిరి కృష్ణమోహనరావు

నవంబరు 1995

సంపుటి : 11

సంచిక : 11



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-52, రామానాయుడు పేట

మచిలీపట్నం - 521 001

ఫోన్ : 22818



విడి ప్రతి : రు. 15-00

సంవత్సర చందా: రు. 54-00

4 సం॥ల చందా : రు. 200-00

జీవిత సభ్యత్వం : రు. 600-00

పోషకులు : రు.1,116/-

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at SREE VANI PRINTERS MACHILIPATNAM Phone : 21137

Despatched on 15-11-1995


## విషయసూచిక



ముఖచిత్రం : భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు



# చర్మచక్షువులు కాదు- జ్ఞాననేత్రములను సంపాదించాలి

-భగవాన్ సాయి హితబోధ

" ప్రదోషే దీపకశ్చంద్రః
ప్రభాతే దీపకో రవిః
త్రైలోక్యే దీపకో ధర్మః
సుపుత్రః కులదీపకః "

ప్రేమస్వరూపులారా!

రాత్రివేళలయందు చంద్రుడే మనకు వెలుగునందిస్తున్నాడు. పగటిపూట యందు సూర్యుడు ప్రకాశించి, చీకటిని పారద్రోలి మానవులను సంరక్షిస్తున్నాడు. ముల్లోకముల యందునూ ప్రకాశింపజేయునది, వెలుగునిచ్చునది ధర్మము. కులమునకు కీర్తినిదెచ్చువాడు మంచి కుమారుడే.

మానవత్వమును ఉద్ధరింపజేయునది, దివ్యత్వానికి మార్గము చూపునది, దైవత్వాన్ని ప్రకటింపజేయునది, మానవత్వంలో ఉండినటువంటి చిత్తశుద్ధియే "యత్ దృశ్యం తత్ నశ్యం'' ఏది మనకు గోచరిస్తున్నదో, ఏది మనకు కనిపించుచున్నదో, అది అంతయునూ ఒకానొక సమయంలో కాలగర్భంలో కలసిపోవునదియే బాహ్య నేత్రములతో చూచిన సమస్త పదార్థములు కూడనూ అదృశ్యములే ఇట్టి బాహ్య నేత్రములు పశు పక్ష్యాదులకు, క్రిమికీటకములకు కూడా ఉంటున్నాయి ఇక మానవుని నేత్రములలో వుండిన విశేష మేమిటి? విశిష్ఠత ఏమిటి?

"జంతూనాం నరజన్మ దుర్లభమ్'' ఇట్టి దుర్లభమైన మానవజన్మ ఎత్తికూడనూ, కేవలం తోలుకండ్లతోనే తృప్తిపడటం ఇది సరియైనటువంటి మానవత్వం కాదు అయితే మన కన్నులు అన్నింటినీ చూస్తున్నవి గాని, తమను తాము చూచుకోలేకపోతున్నవి తనను మాత్రమే తాను చూచుకోలేని కన్నులు మనసును ఏ రీతిగా చూడగలవు? మనసునే చూడలేని ఈ నేత్రములు మాధవుని ఏ రీతిగా చూడగలవు? కనుక మాధవుని దర్శించవలెనని ఈ తోలు నేత్రములు కాదు చర్మ చక్షువులు కాదు, జ్ఞాన నేత్రములను సంపాదించాలి. నేత్రములున్నాయి కానీ, ఈ నేత్రములకు ఏమైనా రోగములు సంభవించినప్పుడు వాటికి ఏమాత్రం తెలియదు. శ్రోత్రములుంటున్నవి, వినిపించకుండా పోయినప్పుడు, నాకు వినిపించటంలేదే అని చెవులకు ఏమాత్రం తెలియదు. తమను తామే తెలుసుకోలేని ఈ ఇంద్రియములు, దైవాన్ని ఏ రీతిగా గుర్తించ గలవు? చర్మ చక్షువులు కేవలం బాహ్యమైన ప్రకృతిని మాత్రమే చూడగలవు గాని, దైవత్వాన్ని గుర్తించటం సాధ్యం కాదు ఇది కేవలం పంచభూతములయొక్క సమ్మిళిత స్వరూపములే ఈ పంచభూతములు తాత్కాలికమైనటువంటివే, క్షణికమైనటువంటివే రోగములతో కూడినటువంటివే. ఇట్టి రోగ మయమైనటువంటి ఈ ఇంద్రియములు, రాగమయమైనటువంటి దివ్యత్వాన్ని ఏ రీతిగా గుర్తించగలవు? కనుక తమను తాము చూచుకొనే శక్తి లేనటువంటివి, అజ్ఞానమయమైనవి నేత్రములే, ఇంద్రియములే

అసలు తమను తాము తెలుసుకోవటమంటే ఏమిటి? నేను ఫలానా వారి కుమారుడను, ఫలానా అధికారిని అని చెప్పుకోవటం తనను తాను తెలుసు కోవటమా? కాదు దేహము, ఇంద్రియము, మనస్సు, అంతఃకరణ— ఈ అన్నిటికీ అతీతమైన ఆత్మ తత్వమును తెలుసుకోవటం. అనగా ఇంద్రియములకు అతీతమైన తత్వమే తన తత్వము ఈనాడు లోకంలో అనేకమంది "ఓ భగవంతుడా! నాకు సాక్షాత్కరించాలి! నన్ను ఆనందపరచాలి! నా బాధలను నివారణ గావించాలి!" అని ప్రార్థిస్తున్నారు. ఇవి అజ్ఞానమయమైనటువంటి ప్రార్థనలు ఇట్టి వారికి దైవమంటే ఏమిటో తెలియదనే చెప్పాలి. అసలు భగవంతుడంటే ఎవరు? సత్ చిత్ ఆనందమే భగవత్ స్వరూపమని శాస్త్రములు, వేదములు చాటుచున్నవి. సత్ చిత్ ఆనందమయుడైన భగవంతుడిని సత్ చిత్ ఆనందమును కావాలని కోరాలి గాని, భౌతికమైన లౌకికమైన, ప్రాకృతమైన, క్షణభంగురమైన వాంఛలను కోరటం భగవత్ ప్రార్థనలు కానేరవు భగవంతుని పిలుస్తూ, దైవాన్ని కోరుతూ, దయ్యాన్ని ఆరాధిస్తున్నారు. వాంఛలు దయ్యములతో సమానమే గాని దైవముతో సమానం కాదు. వాంఛలే మన దివ్యత్వాన్ని నిర్మూలనం గావిస్తున్నది. వాంఛలు అరికట్టుకుంటే మనలో ఆనందం అభివృద్ధి అవుతుంది.

దైవాన్ని చూడాలి, దైవాన్ని అనుభవించాలి, దైవంతో మాట్లాడాలి— ఇదియే నిజమైన Religion

## కుట్టుమిషన్లు బహూకరణ

ది. 22-10-95న 'సాయికుల్వంత్' మందిరం (ప్రశాంతినిలయం)లో జరిగిన సభలో **భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారిచేత** కృష్ణాజిల్లా చెందిన గ్రామీణ పేదలకు 72 కుట్టు మిషన్లు బహూకరించబడినాయి. అందులో 63 మంది మహిళలైతే 9 మంది పురుషులు. వీటిలో రెండు కుట్టుమిషన్లు నూజివీడు సమితివారు యివ్వగా, విజయవాడ సమితికి చెందిన **శ్రీ రాయనపాటి లక్ష్మీకాంతారావు** (Roy Tyres) గారు 70 కుట్టుమిషన్లను, బహూకరించడం విశేషం. అంతేగాక 72 మందికి క్రొత్త బట్టలు కూడా యిచ్చి రానుపోను ఖర్చులు వగయిరాలుకూడా వారే భరించినారు. కుట్టుమిషన్లు బహూకరించిన తరువాత భగవాన్ బాబావారే స్వయంగా మరల అందరికి క్రొత్త బట్టలను కూడా ప్రసాదించినారు. ఆ మహోత్సవంలో రాష్ట్ర కో-ఆర్డినేటర్ **శ్రీ వి. ఎస్. కృష్ణమూర్తిగారు** వందలాదిమంది కృష్ణాజిల్లా సాయి సేవకులు మరియు **శ్రీ లక్ష్మీకాంతారావుగారి** కుటుంబ సభ్యులు పాల్గొనినారు. అదే సభలో 12 మంది వికలాంగులకు మూడుచక్రముల బండ్లు బాబాగారిచే బహూకరించబడినాయి. వాటిని అనంతపూర్ సమితి వారు బహూకరించినారు (ఆనాటి మహోత్సవంలో భగవాన్ బాబావారు జ్యోతిని ప్రజ్వలన చేయుచుండగా, వారి దివ్యసన్నిధిలో శ్రీ లక్ష్మీకాంతారావు మరియు యితరులున్న చిత్రములు పత్రిక పేజీలో ఇవ్వబడినవి, గమనించ ప్రార్థన.)

(మతము) అన్నారు. ఇట్టి దానిని సరిగా అర్థం చేసుకోలేక మతము (Religion) అంటే ప్రార్థనలు చేసుకోవటం, అభీష్టాలను కోరుకోవటం వాంఛలను నెరవేర్చుకోవటమే మనయొక్క 'రెలిజియన్'గా మనం భావిస్తున్నాం. Relize is the Religion అనగా నిత్యసత్యమైన తత్వాన్ని గుర్తించడమే నిజమైన 'రెలిజియన్'. తానే నిత్యసత్య స్వరూపుడైనప్పటికీనీ, తానే సచ్చిదానంద స్వరూపుడైనప్పటికినీ, కానీ తన సచ్చిదానంద స్వరూపాన్ని తానే చూడలేకపోతున్నాడు. కారణం? అభిమాన మమకారములు, అహంకార ఆడంబరములు ఈ సచ్చిదానందమును కప్పివేయటంచేత, ఇవి మనకు కనిపించటం లేదు. రాగద్వేషములను దూరంచేసి, అభిమాన మమకారములను హతంచేసినప్పుడే ఈ సత్ చిత్ ఆనందస్వరూపం మనకు గోచరిస్తుంది. భగవంతుడు నివురుకప్పిన నిప్పువలె మనలో ఉంటాడు. కనుక ఈ నివురును ఊదివేసినప్పుడు నిప్పు మనకు సాక్షాత్కరిస్తుంది. సచ్చిదానందమే మనకు నిజమైన ధనం. ఇదే మన ఆస్తి. ఇదే మన సర్వ సంపద. దీనిని మనం కాపాడుకోవాలి. అయితే అహంకారమనే సర్పము సత్ చిత్ ఆనందమనే సంపదను కాపలాకాస్తున్నది. ఆ అహంకారమనే సర్పమును మనం చంపినప్పుడే నిత్యసత్యమైన ఈ సంపద మనకు లభ్యమవుతుంది. సత్ చిత్ ఆనంద స్వరూపమే భగవంతుడు. అట్టి భగవంతునిని మనం ఈనాడు విస్మరించి, భౌతికమయిన, లౌకికమయిన వాంఛలనే భగవంతుడిగా భావించి, వాటిని మనం ఆశిస్తున్నాం. ఆరాధించేది దైవాన్ని, ఆశించేది లౌకికం. ఒకటి కోరటం, ఒకటి ఆశించటం, ఒకటి అనుభవించడం ఈ విధంగా చేస్తే మానవత్వమనేదానిని ఏ రీతిగా గుర్తించగలం? తలంపులు, మాటలు, చేష్టలు- ఈ మూడింటి యొక్క ఏకత్వమే నిజమైన మానవత్వం.

మోక్షమనగా ఏమిటి? మోక్ష మనగా విడుదల. దేనిని విడవాలి? ఆలుబిడ్డలనా? ఆస్తిపాస్తులనా? సిరిసంపదలనా? కాదు... కాదు... ఇవి కాదు మనం వదలవలసింది. దేహమే 'నేను' అనేటటువంటి అభిమానాన్ని మనం వదలాలి. దేహము నాయొక్క పనిముట్టు గాని, నేను దేహము కాను. దేహమనేది కేవలం భగవంతుడిచ్చిన Gift. ఇది కూడా నీది కాదు. నీది కానటువంటి ఈ దేహమును నీదిగా నీవు విశ్వసించి, దానిని పోషించుటకు తగిన కృషిని సలుపుతున్నావు. ఈ జగత్ప్రపంచం ఎవ్వరిది, ఏ ఒక్క పదార్థమునూ కాదు) అంతా భగవంతుని సొత్తే. దానికి నిన్ను Guardian (రక్షకుడు)గా పెట్టాడు. నిన్నొక Trustee (ధర్మకర్త) నియమించాడు. దీనిని భద్రంగా చూచుకోవలసిన బాధ్యతే గాని, నాది అని అనుభవించడానికి వీలులేదు. కనుక ఈ దేహమును ఇంద్రియములను సక్రమమైన మార్గంలో ప్రవేశపెట్టి, సరియైనరీతిలో అనుభవించడమే నీ కర్తవ్యము.

భగవంతుని లీలలు, సంకల్పములు చాలా చిత్రవిచిత్రమైనటువంటివి. మానవునికి కావల్సిన సమస్తమునూ సృష్టించి ఇచ్చాడు. అన్నింటిపైన అధికారమును కూడా నీకే యిచ్చాడు. అన్నీ అందిస్తూ ఒక్క చిన్న కండిషన్‌ను మాత్రం పెట్టాడు. ఏమిటది? "ఏమి చేస్తావో దాని ఫలితమును మాత్రం అనుభవించాలి" అనేదే భగవంతుని షరతు, అంతే, ఇంకా ఏ కండిషనూలేదు. చాలదా! ఈ కండీషను. అయితే ఇది అంతా మన సొత్తేనని ఇష్టం వచ్చినట్లుగా అంతా దుర్వినియోగం చేస్తున్నాం. దుర్వినియోగం చేసినప్పుడు దుర్వినియోగం యొక్క దుఃఖమును నీవు అనుభవించవలసిందే. సద్వినియోగం చేసినప్పుడు, సద్వినియోగ ఫలమైన సుఖమును కూడనూ నీవు అనుభవించవలసిందే. భగవంతుడు అన్నీ నీకే ఇచ్చాడు. అయితే ఏ వస్తువును, ఏ ఇంద్రియమును ఏ విధంగా వినియోగించాలో— ఆ సక్రమాన్ని నీవు అవలంబించాలి. దీనిలో ఏదైనా పొరపాటు జరిగితే దుఃఖములకు గురి అవుతావు.

(తరువాయి 78 వ పేజీలో)



భగవాన్ శ్రీ శ్రీ శ్రీ సత్యసాయిబాబా వారి 70వ జన్మదినోత్సవ వేడుకలు
కృష్ణాజిల్లాలోని 70 మంది గ్రామవాసులకు ఉపాధికల్పన.

# భగవాన్ సాయి చమత్కారవాణి

-కొమరగిరి కృష్ణమోహనరావు

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు తమ ప్రసంగాలలో మధ్యమధ్య చమత్కారాలు విసురుతూ ఉంటారు. అయితే అవి పైకి చమత్కారాలుగానే కనిపిస్తాయి, వినిపిస్తాయిగాని ఆ మాటల వెనుక ఎంతో నిగూఢమైన అర్థం, అంతరార్థం యిమిడి ఉంటుంది. లోతుకుపోయి ఆ మాటలను సునిశితంగా పరిశీలించి, పరిశోధిస్తేగాని వాటి అంతరార్థం బోధపడదు. బాహ్యార్థమును పట్టుకొని వ్రేలాడుతే అంతరార్థం అర్థం కాదు. వాటిల్లో నేర్చుకోవలసింది, ఆచరించవలసింది ఎంతో ఉంటుంది. ఇటువంటి చమత్కారాలను కొన్నింటిని నవంబర్ '94 ప్రత్యేక సంచికలోను, మరికొన్నింటిని శ్రీవాణి దశాబ్ది ప్రత్యేక సంచిక (జనవరి '95) లోను పాఠకులకు అందించబడినాయి. ఈ ప్రత్యేక సంచికలో మరికొన్ని చమత్కారాలను అందిస్తున్నాను. చదవండి! అవగాహన చేసుకోండి! అంతరార్థములను అర్థం చేసుకోండి! ఆనందించండి! ఆచరణలో పెట్టండి! తరించండి!

## అదుపు - పొదుపు

**ఆశలపై అదుపు, ఆహార** పదార్థములను పొదుపు చేయాలంటారు బాబా. ధనాన్ని, ఆహారపదార్థములను, కాలమును వ్యర్థం చేయవద్దన్నారు బాబా. శక్తిని, మేధస్సును వృధా చేయవద్దని సలహా యిచ్చారు. కోరికలపై అదుపు (Ceiling on Desires) అనగా ఆశలను అరికట్టుకోవటం. మానవుడు ఆశాజీవిగదా! "ఆశ" అనేదే లేకపోతే మానవుడు తన మనుగడనే కొనసాగించలేడు. అయితే ఆశకు హద్దువుండాలి, అదుపు వుండాలి, ఆ హద్దు మీరుతే "పేరాశ" గా మారి పోతుంది. పేరాశ ప్రమాదమును తెచ్చిపెడుతుంది. తదుపరి పేరాశ దురాశకు దారితీస్తుంది. దురాశ దుఃఖమునకు చేటుగదా! తరువాత దురాశ నిరాశను తెచ్చిపెడుతుంది. అప్పుడు మానవుడు నిరాశతో నిస్పృహచెంది జీవితంమీదనే విరక్తిపొందుతాడు. పండంటి జీవితం పతనమైపోతుంది. కనుక ఆశలపై అదుపు ఎంతైనా అవసరం. అయితే ఈనాడు ఆశలను అరికట్టుకోవటానికి ప్రయత్నించటుండా, కేవలం కోరికల అదుపు పేర కొంత ధనమును మాత్రం బ్యాంకులో దాచిపెడుతున్నారు. బాబా కోరేది ఇదికాదు 'మీ ఆశలను అరికట్టుకొని, వైరాగ్యమార్గంలో దివ్యానందాన్ని అనుభవించాలనేదే నా ఆశ' అని అంటారు బాబా. అంతేకాదు, బాబా కాలానికి అతి ప్రాముఖ్యతనిచ్చారు. కాలాన్ని సద్వినియోగపరచాలంటూ 'Don't Waste Time, Time waste is Life Waste' అంటారు బాబా. మనం ప్రతిరోజూ కాలాన్ని, ధనాన్ని, ఆహారపదార్థములను, మనశక్తిని వృధాచేస్తుంటాం. ఈ నాల్గింటిని పొదుపు చేస్తే దేశం సస్యశ్యామలమవుతుంది. అసలు పొదుపు చేయటం కూడా ఒకరకమైన అధ్యాత్మిక సాధనే. చివరకు పరమేశ్వరుడు సృష్టించిన పంచభూతాలను కూడా పొదుపుగా వాడకపోతే, అది పరమేశ్వరుని తృణీకరించినట్లే అవుతుందంటారు బాబా. కనుక ప్రతివారు విద్యుచ్ఛక్తి, నీరు, వంటచెరకు (Fire wood), గ్యాస్

పెట్రోలు, డీజిలు మొదలైన వాటిని పొదుపుగా వాడటం నేర్చుకోవాలి. దేశ సంపదను ఏమాత్రం దుర్వినియోగం చేయరాదు. "పొదుపు" అంటే పిసినారితనమని భావించరాదు. అవసరానికి మించి వాడుకోవటం మహాపాపం దేశసంపదను దుర్వినియోగపరిస్తే, నిత్యజీవితావసర వస్తువుల ధరలు తారాస్థాయినందుకుంటాయి దేశంలో కరువు కాటకాలు సంభవించి సామాన్య మధ్యతరగతి ప్రజలు నానా యిక్కట్లకు గురిఅవుతారు. కనుక బాబావారు ఆశించేది "ఆశ పై అదుపు, ఆహార పదార్థముల పొదుపు" దీనిని ప్రతి ఒక్కరూ విజ్ఞతతో ఆచరించాలి.

## పరిశీలన-పరిశోధన

"ప్రతి విషయంలోను మానవుడుఅనుభవించుటకు ముందు చక్కగా విచారణ ( Enquiry ) సలిపి, పరిశీలన (Investigation) చేయాలి. పరిశీలన జరిపినప్పుడే పరిశోధన (Research) కూడా లభ్యమవుతుంది. ఈనాడు విజ్ఞానశాస్త్ర రంగంలో వివేకాన్ని విస్మరిస్తున్నారు. విషయ పరిశోధనకు విజ్ఞానమెంతఅవసరమో, పరిశోధనా ఫలితాన్ని వినియోగించుకోనికి వివేకము కూడా అంత అవసరమే. పరిశోధన, పరిశీలనలయందు సమత్వముండాలి, ఈనాడు పరిశోధన అధికముగానే సాగుతున్నదిగాని పరిశీలన ఏమాత్రం సలపడం లేదు." అని బాబా ఒక పర్యాయంచెప్పారు. ఈనాడు శాస్త్రజ్ఞులు నిరంతరం విషయాన్ని పరిశోధించడంలోనే కాలం గడుపుతున్నారు. నిరంతరం పరిశోధనే అయితే పరిశోధించిన విషయాన్ని పరిశీలించేదెప్పుడు ? పరిశోధించిన దానిని జగత్తు అభివృద్ధికి వినియోగించేదెప్పుడు ? పరిశోధనల ఫలితాలను వినియోగించుకోవటానికి వివేకము కూడా ఉండాలి అయితే ఈనాడు వివేకం బొత్తిగా లేకుండా పోయిందంటూ బాబా ఒక చక్కటి ఉదాహరణ పేర్కొన్నారు 1993 సం లో బాబా బొంబాయి వెళ్ళినప్పుడు "విజ్ఞానశాస్త్రము - ఆధ్యాత్మికత" అనే విషయముపై చర్చాగోష్ఠినిఏర్పాటు చేశారట. అందులో ఒక సైంటిస్టు ప్రసంగిస్తూ ఈనాడు అమెరికాలో అణుశాస్త్ర విజ్ఞానం అన్ని దేశాలకంటే మించిపోయిందని, ప్రపంచాన్ని పదిసార్లు భస్మంచేసే బాంబులు కనిపెట్టారని చెప్పాడుట "వీరి విజ్ఞానం గొప్పదే గాని, వివేకం చాలా చిన్నది. ఒకసారి బాంబువేస్తే ప్రపంచమంతా భస్మమవుతుందట. పదిసార్లు బాంబులువేస్తే పది పర్యాయములు ప్రపంచం భస్మమవుతుందట. ఎంత అవివేకం? ఒకసారి బాంబువేస్తే ప్రపంచమంతా భస్మమైపోతుందిగదా! మరి పది బాంబులెక్కడ పడుతాయి. ప్రపంచమెక్కడ ఉంటుంది ?" అని బాబా తన ఆశ్చర్యమును వెలిబుచ్చారు ఈనాడు వివేకం లోపించింది వివేకం లేని విజ్ఞానం వలన దేశానికి ప్రమాదం ప్రతి విషయాన్ని శ్రద్ధగా పరిశీలన చేసి, పరిశోధన చేయాలి పరిశోధనల ద్వారా లభ్యమైన విజ్ఞానాన్ని వివేకంతో ప్రపంచాభివృద్ధికి వినియోగించాలి.

మన ప్రాచీన మహర్షులు పరిశీలించి, పరిశోధించి మానవుని మనుగడకు అవసరమైన కొన్ని సత్ సంప్రదాయాలను నెలకొల్పారు తరువాత వచ్చినవారికి పరిశీలన, పరిశోధనా శక్తి అసలే పోయినప్పటికి, పెద్దలు అనుభవజ్ఞులు ఏర్పర్చిన సంప్రదాయాలను తూచా తప్పకుండా పాటిస్తూ వచ్చారు. అయితే ఈనాటి తరంవారు అధునాతులమని విర్రవీగేవారు. సనాతనమంతా ఛాందసంగా భావించే నేటి యువతరమునకు పరిశీలించి, పరిశోధించే శక్తిలేదు పెద్దలు పెట్టిన సంప్రదాయాలను అనుసరించాలనే భక్తి లేదు ఈనాటివారు రెంటికీ చెడ్డ రేవడి వలె తయారైనారు. కనుక ప్రతిఒక్కరిలో 'పరిశీలనా దృక్పథం' (Investigation out Look ) పెరగాలి. 'పరిశోధనా దృష్టి' (Research outlook)

అభివృద్ధి కావాలి 'వివేకమే విజ్ఞానము' ( Discrimination knowledge) ను పెంపొందించుకోవాలి.

## విజ్ఞానం-అజ్ఞానం

"ఈనాడు చదువులు పెరుగుతున్నాయి గాని మనసులు కుంచించుకుపోతున్నాయి. మనుష్యులు మరీ సంకుచితులుగా తయారవుతున్నారు. విశాల భావాల్ని పెంచుకోవాలి. ఇదే నిజమైన విద్యకు సారం, లక్ష్యం. ఈ లక్ష్యమును చేరితీరాలనే పట్టుదల మనలో ఉండాలి. దేశ క్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని, భారతదేశ విశిష్టతను పెంచుకోవాలి. విజ్ఞానానికి, ఆధ్యాత్మిక ప్రజ్ఞానాన్ని జోడించాలి. ఈ రెండూ చేరినప్పుడు ఆనందం లభిస్తుంది. సైన్సు వేరు ఆధ్యాత్మికత వేరు అని విభజించరాదు, రెండింటిని సమన్వయపరచాలి. ఈనాడు విజ్ఞానం పెరిగిపోయిందని విఱ్ఱవీగుతున్నాము కాని, విజ్ఞానంతోపాటు అజ్ఞానం అంతకంటే పెరిగిపోతున్నది " అని బాబా తన ఆవేదనను ఒక పర్యాయం వెలిబుచ్చారు

ఈనాటి విజ్ఞానం కేవలం స్వార్థ స్వప్రయోజనాలతో మాత్రమే అభివృద్ధి చెందుతున్నదేగాని, జగత్కల్యాణం కోసంకాదు విజ్ఞానం ఎంత పెరిగినా, దురాలోచనలు, దురలవాట్లు, దుర్బుద్ధులు దుర్భావనలు మాత్రం పోవటం లేదు; సద్భావనలు, సదాలోచనలు రావటంలేదు. ఈనాడు ఒక దేశంవారు, మరొక దేశాన్ని భస్మం చేయాలని కక్షవహిస్తున్నారు. ఇదేనా సైన్సు సాధించిన అభివృద్ధి ? ఇది విజ్ఞానం కాదు, పరిపూర్ణమైన అజ్ఞానం. ఈ స్థితికి కారణమేమిటి ? సైన్సుకు జీవిత సామర్థ్యాన్ని పెంచే స్తోమత, అధికారంలేదు జీవిత సమగ్రతను పోషించే అధికారం ఒక్క ఆధ్యాత్మికతకు మాత్రమే ఉన్నది. మానవతా విలువలు అధ్యాత్మికత్వంతో జోడించినప్పుడే అభివృద్ధికాగలవు కేవలం సైన్సుతో ముడిపెడితే ఏమాత్రం అభివృద్ధికావంటారు బాబా. విత్తనాన్ని భూమిలో పెట్టినప్పుడే మొక్క మొలుస్తుంది డబ్బాలో పెట్టి నీళ్లుపోస్తే కుళ్ళిపోతుంది. మానవతా విలువలు పెరగడానికి ఆధ్యాత్మికత్వమనే సైన్సు చాలాఅవసరం కనుక మొట్టమొదట ఆధ్యాత్మిక భావాలను అభివృద్ధిగావించుకోవాలంటారు బాబా. కనుక మనం సంపాదించిన విజ్ఞానం, అజ్ఞానంతో విధ్వంసానికి ఉపయోగపడకుండా జాగ్రత్త పడాలి.

"కేవలం శాస్త్ర పరిజ్ఞానం మాత్రమే ప్రధానంకాదు. నేటి పుస్తక పరిజ్ఞానం రేపు విజ్ఞానం, మరునాడు అజ్ఞానం. పుస్తకాన్ని మస్తకాన్ని ఏకంచేయరాదు. మస్తకంలో పెట్టుకున్న పవిత్రభావాలను ఆచరణలో పెట్టాలి" అంటారు బాబా అయితే ఈనాడు చాలామంది కంఠస్తం చేయటమే పండితలక్షణమని భావిస్తున్నారు అర్థంలేని చదువు వ్యర్థం. ఆచరణలో పెట్టని విజ్ఞానం ఉన్నా ప్రయోజనంలేదు పుస్తకాలలోనున్న విషయాలను కేవలం గ్రుడ్డిగా కంఠస్తం చేయక, మొదట చక్కగా అర్థంచేసుకోవటానికి ప్రయత్నం చేయాలి. అర్థం చేసుకున్న దానిని కొంతవరకైనా అనుభవానికి తెచ్చుకోవాలి. అదే సరియైన చదువు.

"నదులకు ఆనకట్టలు కట్టి నిలువచేసిన నీరును కాలువల ద్వారా ప్రవహింపజేసి పంటలు పండిస్తున్నట్లే, గ్రంథాలలోనున్న విజ్ఞానాన్ని అవగాహన చేసుకొని చేతలద్వారా సమాజానికి పంచటం నేర్చుకోవాలి" అంటారు బాబా. ప్రవహించకుండా నిలచిన నీరు ఏ విధంగా దుర్గంధ భూయిష్టమవుతుందో అదే విధంగా మనం సంపాదించిన విజ్ఞానాన్ని పదిమందికి పంచకపోతే అది అజ్ఞానమే అవుతుంది.

# కర్మ-అకర్మ-వికర్మ

"కర్మలు మూడు విధములు. కర్మ (Action), అకర్మ (Unaction), వికర్మ (Inaction) ఇందులో వికర్మ సూక్ష్మమైనది. సూక్ష్మమై, సాత్వికమై, ఆత్మ సందర్శన నిమిత్తమై, సర్వసంగ పరిత్యాగము చేయునది ఇది. ఏది చూచినా, ఏది పలికినా, ఏది అనుభవించినా ఈశ్వరత్వముగానే అనుభవించుము" అంటారు బాబా. 'అకర్మ' అనునది దీనికి పూర్తిగా విరుద్ధమైనది. అంతర్ కర్మలను గాని, బహిర్ కర్మలను గాని ఏమాత్రం చేయక తమో గుణములతో స్తంభించి వుంటుంది ఇది. ఇది తన స్వార్థము తప్ప అన్యము ఏమాత్రం ఆశించదంటారు బాబా 'కర్మ' అనేది రజో గుణ సంబంధమైనది ఇది స్థూలమై, స్వార్థమును తరింపచేసుకొనే నిమిత్తమై కర్మలను ఆచరిస్తుంటుంది. ఈ కర్మను చేసేవారు తమ మనోవృత్తుల నిమిత్తమై కర్మల నాచరిస్తుంటారు. ఈ కర్మ క్రమేణా ఉన్నత స్థాయిలోనికి పోయి వికర్మలోనికి చేర్చుటకు వీలుగా వుంటుందని బాబా చెప్పారు.

కర్మ, అకర్మ, వికర్మల నాధారంగా చేసికొని మానవత్వమును మూడు విధములుగా విభజించారని బాబా చెబుతూ పశుమానవత్వం, మానవ మానవత్వము, దైవ మానవత్వములని పేర్కొనినారు

మన సమస్తకర్మలకు మూలకారణం మనసే కనుక నీ మనసును భగవదర్పితం చేసినప్పుడు సర్వము అందులో లీనమైపోతుంది. భగవంతుని చింతనలో మనస్సును యిమిడ్చినప్పుడు సర్వము నిష్కామ కర్మగా మారిపోతుందంటారు బాబా కర్మ కంటె నిష్కామ కర్మ ఉత్తమమైనది నిష్కామ కర్మ కంటె అనాసక్తి కర్మ మరింత ఉత్తమమైనదన్నారు బాబా. కనుక అనాసక్తి భావమును అలవరచుకోవాలి అనాసక్తితో ఆచరించే కర్మలయందు అనంతమైన శక్తి యిమిడి వుంటుంది. అనాసక్తి భావముచేత యెంతటి ఘనకార్యములనైనా సాధించవచ్చు నంటారు బాబా.

భగవాన్ బాబావారు కర్మ, వికర్మ, అకర్మలను గురించి వివరిస్తూ ఒక చక్కటి ఉదాహరణను కూడా చెప్పారు. సారమైనది చమురు, సత్యమైనది వత్తి ఈ రెండు చేరినప్పుడు వెలుగువస్తుంది వెలుగు తీరిపోయేటప్పుడు వెంట ఎవ్వరూ రారు, చమురు రాదు, వత్తి రాదు అంటూ ఈ రెండింటికి ఒక ప్రమిద ఉండాలంటూ అదియే మన దేహము అని చెప్పారు మన కోరికలు చమురు, మన జ్ఞానమే వత్తి, ఆనందమే వెలుతురు వత్తి ఒక్కటి మాత్రమే అంటిస్తే బుగ్గున కాలిపోతుంది కేవలం చమురును అంటిస్తే అంటుకోదు చమురులో తడిపిన వత్తిని వెలిగిస్తే వెలుగుతుంది. కర్మ అనేది చమురు మనస్సనే వత్తి బుద్ధితో చేరి వుంటుంది ఈ రెండూ చేరేటప్పటికి 'అకర్మ'గా మారిపోయి, ప్రకాశం వస్తుందంటారు బాబా జ్యోతికి అనేక గుణములుంటున్నాయి కాని ప్రకాశమునకు ఒకే గుణం గాలి వీస్తే జ్యోతి అటూయిటూ ఆడుతుంది. నీళ్ళు పడితే చిటపటమంటుంది, పొగ వస్తుంది, వేలు పెడితే కాలుతుంది. అందరికీ సమానంగా వెలుతురునిస్తుంది. అదే ఆత్మ జ్యోతి, అదే జీవన జ్యోతి. అది అందరియందు సమానంగానే ఉంటుంది స్టడీగా, నిలకడగా వుండే జ్యోతి 'కర్మ' అటు-ఇటూ ఆడే జ్యోతి 'వికర్మ' వెలుతురే 'అకర్మ' అన్నారు బాబా అకర్మ అంటే కర్మను ఆచరించకుండా వుండటముకాదు కర్మను ఆచరించి ఫలితమును కోరకుండా అందరికీ సమత్వంగా అందించే స్వభావమే నిజమైన అకర్మ అకర్మ అనగా కర్మ చేసియు కర్మ చేయనివాడుగా తయారవుతాడు ఇది ఆధ్యాత్మికమునకు మాత్రమే సంబంధమవుతుంది గాని లౌకికమైన దానికి పోల్చుకోరాదంటారు బాబా

" సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ " 'సమస్త కర్మలను విడిచి నన్నే శరణు పొందుము. అని గీతాచార్యుడు చెప్పాడుగదా ! అంటూ

( తరువాయి 65 వ పేజీలో )

ఉపనయన మహోత్సవ సందేశం

# సర్వ దుఃఖ పరిహారిణి 'గాయత్రి'

-భగవాన్ బాబా దివ్యబోధ

'దైవం మానుషరూపేణ' ప్రతి మానవుడు దైవస్వరూపుడే. కాని దేహాభిమానము చేత మానవుడు భ్రమిస్తున్నాడు. దేహమనేటటువంటిదానిని కదిలించేటటువంటి ప్రాణశక్తి ఎక్కడిది? ఈ ప్రాణశక్తిని ఎవరు ప్రసాదించారు. అదియే ఆత్మశక్తి. కనుకనే ఆత్మశక్తిని ఆధారం చేసుకొని, ప్రాణశక్తి, ఈ దేహశక్తితో అన్నిరకముల పనులు చేయిస్తున్నది.

"గాయత్రి" అనగా ఎవరు? గాయత్రి ... గాయత్రి అనుకుంటున్నారు ఇది ఒక దేవత కాదు వేదముల యొక్క రసస్వరూపమే గాయత్రి. గాయత్రి అనేటటువంటిది నాలుగు వేదముల సారము ఎక్కడ ఉంటున్నది ఎక్కడ నీవు స్మరిస్తే అక్కడ వుంటుంది. అయితే ఈ గాయత్రికి మూడు పేర్లున్నాయి గాయత్రి, సావిత్రి, సరస్వతి అనేవి మూడు పేర్లు గాయత్రి అనగా ఇంద్రియముల శక్తి గాయత్రి మన ఇంద్రియములకు మాస్టర్, సావిత్రి ప్రాణమునకు మాస్టర్. సావిత్రి తన పాతివ్రత్య మహిమచేత తన భర్త అయిన సత్యవంతుణ్ణి బ్రతికించుకున్నదని మన భారతీయులకు తెలుసు అనగా సావిత్రి సత్యమునకు ఉపాధిగా వుంటుండాలి. సరస్వతి అనగా వాగ్‌దేవతా స్వరూపము. కనుక గాయత్రి, సావిత్రి, సరస్వతి అనగా ఏమిటి? త్రికరణశుద్ధియే గాయత్రి. మన మనస్సులోనున్న భావము, మాటలోని పలుకు, చేతిలోని చేష్టలు-ఈ మూడూ ఏకం కావాలి గాయత్రికి మూడు పేర్లు ఉన్నాయంటే, ప్రత్యేకించినటువంటివి కావు అవి మనయందే ఉంటున్నాయి మన ఇంద్రియములే గాయత్రి, మన ప్రాణమే సావిత్రి, మన వాక్కే సరస్వతి. ఈమెకు ఐదు ముఖములుంటున్నాయి అందువలననే ఈమెకు 'పంచముఖి' అని పేరు ప్రపంచములో ఎవరికైనా ఐదు ముఖములుంటాయా? అదేవిధముగ రావణాసురునికి పది తలలున్నాయంటారు. పది తలలుంటే ఎట్లా నడవగలడు? ఎట్లా నిద్రపోగలడు? ఇది కాదు దీని అంతరార్థం నాలుగు వేదములు, ఆరు శాస్త్రములు తెలిసినటువంటివాడు కనుకనే రావణాసురునికి "దశకంఠుడు అనే పేరు వచ్చింది. అదే విధముగనే గాయత్రికి "ఓం" ఒక ముఖము, భూర్భువః - స్వహ రెండవముఖం. తత్సవితుర్వరేణ్యం-మూడవ ముఖం. భర్గో దేవస్యధీమహి - నాల్గవ ముఖం ధియోయోనః ప్రచోదయాత్ - ఐదవ ముఖం ఈ అంతరార్థమును గుర్తించుతే పంచముఖములు మనయందే ఉంటున్నాయి.

భగవంతుడు సచ్చిదానంద స్వరూపుడని, కరుణామయుడని, దయామయుడని అనేక రకములుగా భగవంతుని వర్ణిస్తాంటాం అన్నింటి సారం ఒక్కటే. "ఓం, భూర్, భువః, స్వః, తత్, సవితుర్, వరేణ్యం, భర్గో దేవస్య" - ఈ తొమ్మిది భగవంతుని వర్ణన. "ధీమహి" అనగా ధ్యానం "ధియోయోనః ప్రచోదయాత్" ప్రార్థన. మా బుద్ధికి సరియైనటువంటి శక్తి సామర్థ్యములు అందించ

మని ప్రార్థన. కాబట్టి గాయత్రి మంత్రమునందు వర్ణన, గానము, ప్రార్థన – ఈ మూడు కూడనూ ఏకమై ఉంటుండాలి సర్వరోగ నివారిణి గాయత్రి, సర్వ దుఃఖ పరిహారిణి గాయత్రి, సర్వవాంఛ ఫలసిద్ధి గాయత్రి. కనుక అన్నింటికినీ గాయత్రియే మూల కారణము.

పూర్తి గాయత్రి తత్త్వాన్ని ఒక్క పర్యాయం మనం స్మరిస్తే మనయందు అనేకరకములైన శక్తులు ఆవిర్భవిస్తుంటాయి. మన ఉచ్ఛ్వాస నిశ్వాసములయందుకూడనూ గాయత్రీ శబ్దం యిమిడి ఉంటున్నది. ఆ శబ్దమే మన స్వస్వరూపాన్ని జ్ఞాపకం చేస్తున్నది. 'ఓం ....' ఆ 'ఓం' తత్త్వమనే దానిలో ఎంతో ప్రణవశబ్దం ఉంటుండాలి దీనినే మన నిత్య జీవితంలోపల, గాలిని తీసుకుంటున్నాం, వదులుతున్నాం దీనినే పూరకం, రేచకంఅన్నారు "పూరకం" అనగా గాలి తీసుకోవటం పూరించుకోవటం. వదలటం "రేచకం" అంటారు, నిలపటమును "కుంభకం" అంటారు, గాలి పీల్చటం, వదలటం చేసేటప్పుడు వచ్చే శబ్దం "సోఽహ .... సోఽహం." అనగా నేనే దైవము .... నేనే దైవము. దీనినే వేదము తత్, త్వం, అసి; అహం బ్రహ్మాస్మి; ప్రజ్ఞానం బ్రహ్మ; అయం ఆత్మ బ్రహ్మ అనేటటువంటి శబ్దము నేను నుంచే ఆరంభం అవుతుండాలి దైవము తనయందే ఉంటున్నాడు, తానే దైవమై ఉంటున్నాడు దైవాన్ని ఎట్లా దర్శించాలా ? అని యోచిస్తున్నాం "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" సత్యమే భగవత్ స్వరూపము జ్ఞానమే భగవత్ స్వరూపము. ఈ రెండూ సర్వత్రా ఉండినటువంటివే ఇది దేశకాల పాత్రలకు అతీతమైనటువంటివి సర్వ కాలముల యందు ఉండేటటువంటివే "త్రికాల భాగ్యం సత్యం" ఆ సత్య స్వరూపమే గాయత్రి. హృదయ వాసియె గాయత్రి హృత్ + దయ = హృదయ అనగా " దయగల హృదయమే దైవము. దయ మన యందే ఉంటున్నది. కాని ఆ దయను మనం ఎంత వరకు ఉపయోగపెడుతున్నాం ? ఉపయోగపెట్టటంలేదు. ఎప్పుడు చూచినా "క్రోధం, ద్వేషం, అసూయ, అహంకారం" దేహమునకు విరుద్ధమైన ఇలాంటి గుణములను మనం ఉపయోగ పెడుతున్నాం, ఇవన్నీ మానవుని సహజాలు కాదు. మానవునికి విరుద్ధమైనటువంటి గుణములు. ప్రత్యేకంగా విచారణ చేస్తే, దేహమును ఆధారముచేసుకొని, దేహమే నేను అనుకునేటటువంటివాడు 'పశువు' అన్నారు మనసును ఆధారంచేసుకొనేటటువంటివానిని కేవలం "దానవుడు" అన్నారు. ఆత్మను ఆధారం చేసుకొని బ్రతికేటటువంటివాడు "దైవ సంపత్తి" అన్నారు. "దేహము, మనసు, ఆత్మ – ఈ మూడింటిని ఆధారం చేసుకొన్నవాడు 'మానవుడు' అన్నారు ఈ మూడింటియొక్క ఏకత్వమే నిజమైనటువంటి "మానవత్వం". కాని ఈ మానవత్వము స్థాయి నుండిదైవత్వానికిఎదగాలి కాని పశుత్వానికో, రాక్షసత్వానికో దిగజారకూడదు.

ఈనాడు ప్రపంచం అనేక అల్లకల్లోలాలతో కనిపిస్తున్నది. ఎక్కడ చూచినా దుఃఖం, ఎక్కడ చూచినా అశాంతి, ఎక్కడ చూచినా విచారం శాంతి భద్రతలు ఎక్కడా కనిపించటంలేదు ఎక్కడ ఉంది ఈ శాంతి ; హృదయంలో ఉంటున్నది. ఈ భద్రత ఎక్కడ ఉంటున్నది ? మనయందే ఉంటున్నాది భద్రత భద్రతకు మూలకారణం ఏమిటి ? వాంఛలు వదలుకోవటమే భద్రత. దీనినే "వైరాగ్యము" అన్నారు. వైరాగ్యమనగా ఆలుబిడ్డలను వదలి అరణ్యాలకు వెళ్లటం కాదు కోరికలు తగ్గించుకోవటమే "వైరాగ్యము" నీవు గృహస్థునివిగా ఉంటున్నావు. గృహస్థధర్మమును నిర్వర్తించు ఉద్యోగిగా ఉన్నావు నీ ఉద్యోగం నీవు చేసుకో. విద్యార్థిగా వున్నావు విద్య నభ్యసించుకో నీ కర్తవ్యాన్ని నీవు నిర్వర్తించుకో దీనికి ఎట్టి అభ్యంతరంలేదు. కాని మితిమీరిన దానిలో మాత్రం ప్రవేశించకూడదు. "మితిమీరిపోయినప్పుడు మతి చెడిపోతుంది" ప్రతి దానికి ఒక పరిమితం

ఉంటుండాలి గాయత్రీ తత్త్వమందు ఒక పరిమితమైన భావంచేతనే, దివ్యమార్గాలలో మనం ప్రవేశించి, సర్వమూ తనయందే ఉన్నవనే ఆత్మవిశ్వాసమును పెంచుకోవాలి ఆత్మవిశ్వాసం కోల్పోవటం చేతనే అనేక చిక్కులు వెంటాడుతున్నాయి. ఆత్మవిశ్వాస ముండినంతవరకు ఏ బాధలూ మనలను అంటవు

ఆధ్యాత్మిక మార్గంలో ప్రవేశించే ప్రతి మానవుని మీదకు అరిషడ్వర్గములు దండెత్తి వస్తుంటాయి, వీటన్నింటికి తట్టుకొని, ముందుకు సాగినవాడే నిజమైన మానవుడు వస్తుంటాయి కాని వాటిని లెక్కచేయ కూడదు. దట్టమైన మేఘములు కమ్మినప్పుడు మనకు సూర్యుడు కనిపించడు కొంతసేపటికి మేఘములు పోతాయి, సూర్యుడు కనిపిస్తాడు. మన హృదయమే ఒక ఆకాశము, మన భావములే మేఘములు, మన బుద్ధే సూర్యుడు. మనసే చంద్రుడు మేఘములు దట్టంగా వచ్చినపుడు ఈబుద్ధి, మనసుగోచరంకాదు. నీ హృదయాకాశములోపల బుద్ధిఅనేసూర్యుడు, మనసుఅనేచంద్రుడు ప్రకాశిస్తున్నారు దీనినే వేదమునందు "చంద్రమా మనసో జాతః చక్షో సూర్యో అజాయత" అన్నది. కనుక మన యందు బుద్ధి, మనసులు ప్రకాశిస్తునే ఉన్నాయి కాని మన దుర్గుణములు, దురాలోచనలు, దుర్భావముల చేత దీనిని మనము మరచిపోతున్నాం.

ప్రేమస్వరూపులారా !

మీ దేశమునకు ఆదర్శవంతమైనజీవులుగా జీవించాలి ధైర్యసాహసములచేత, దైవవిశ్వాసముచేత మీ దేహాన్ని అభివృద్ధి పరచుకోవాలి దేహమే లేకుండిన మనో బుద్ధులుగోచరించవు కనుక మన ఆదర్శము సాధించేందుకు దేహం ఒక పనిముట్టు, పనిముట్టు కూడా సరియైన రీతిలో ఉండాలి డాక్టర్ వచ్చి కత్తిని తీసుకొని ఆపరేషన్ చేస్తాడు కత్తి ఆపరేషన్ చేస్తున్నదా ? లేక డాక్టర్ ఆపరేషన్ చేస్తున్నాడా? కత్తి ఒక పనిముట్టే కాని

# మంచి మనసు

సాయి బోధామృత సారంబు కన్నను
మధుకామృతం బింక మహినిలేదు
సాయిదేవుని తోడి సంభాషణముకన్న
సత్కథా శ్రవణంబు జగతి లేదు
సాయిరాముని నామసంకీర్తనము కన్న
ఆర్తి బాపెడు పాట అవనిలేదు
సాయిక్రిష్ణుని రూపసౌందర్యమును మించు
సుందరరూపంబు చూడలేదు

సత్యసాయి కన్న సత్యంబు గల స్వామి
లేరు లేరు లేరు లేరటంచు
భక్తి ప్రేమ వినయ భావంబుతో గొల్చు
మనసులేని మనసు మనసె మనస

— ఏకా రామచంద్రరావు
గణపవరం

చేసేది డాక్టర్ అదే విధముగ దేహము ఒక పనిముట్టే గాని, దీనిని నడిపించేవాడు ఆత్మస్వరూపుడు భగవంతుడే. ఆత్మద్వారానే ఇంద్రియములు ప్రకటితమవుతున్నాయి. సర్వేంద్రియములపని ఆత్మద్వారానే జరుగుతున్నది. ఈ సత్యమును గుర్తించాలి ప్రతి దానికిని ఆత్మసాక్షి. అదియే నిజమైనటువంటి సాక్షి. దీనినే 'కాన్షన్స్' అన్నారు. దీని తత్త్వము ఎక్కడ నుంచి వచ్చింది ? దివ్యత్వమునుంచి వచ్చిన కిరణములే, అదియే అంశము ప్రతి మానవుడూ దైవాంశమే, అంశమునకును ఆకారమునకు భేదములేదు. రెండూఒక్కటే నీభిన్న దృష్టిచేతనే భిన్నంగా కనిపిస్తుండాలి మనం ఏమంత్రం ఉచ్చరించక పోయినప్పటికీ, ఒక్క గాయత్రీ మంత్రం ఉచ్చరిస్తే చాలు ఏబాధలూమనల్నిబాధించవు ముఖ్యంగా విద్యార్థుల

గాయత్రి అత్యవసరం ఎందుకంటే, వారి భవిష్యత్తు, ఎంతో మంగళకరంగా అభివృద్ధి కావల్సినటువంటిది, దేశమునకు నాయకులు వారే భావి భారతోద్ధారకులువారే, కనుకనే నేటి విద్యార్థులు పవిత్రమైన భావములను పెంచుకోవాలి, తల్లిదండ్రులు కూడనూ తగిన విధంగా ప్రోత్సాహములనందించాలి.

ఈవేళ ఉపనయనములు అయిపోయినాయి మంత్రోప దేశం జరిగింది ఏమి ప్రయోజనం? ఉపనయనం లోపల మూడు పోగులు (దారము) వేశారు ఏమిటి ఈ మూడు దారముల ఏకత్వం? మూడు దారములే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు. ఈ మూడు దారములే భూత భవిష్యత్తు వర్తమాన కాలములు. ఈ మూడు దారములే త్రికాలములు, త్రినేత్రములు ఈ త్రినేత్రములనేవి ఏమిటి? ఈశ్వరునికి త్రినేత్రం ఉంటుందని అంటుంటారు. అది ప్రత్యేకంగా ఒక నేత్రం కాదు అది. ప్రతి వ్యక్తి గతాన్ని చూస్తాడు, వర్తమానాన్ని చూస్తాడు, భవిష్యత్తును మాత్రం చూడ లేడు కాని భగవంతుడు భవిష్యత్తును కూడా చూడ గలిగేటటువంటివాడు గనుకనే ఇతనికి 'త్రినేత్రుడు' అని పేరు వచ్చింది ప్రత్యేకంగా మూడవ నేత్రం లేదు. భగవంతుడు త్రికాలస్వరూపుడన్నారు. భగవదర్పితం గావించుకొనే నిమిత్తమై ఈ మూడు పోగులు వేస్తున్నారు. దీనికి మరొక పేరు కూడా ఉన్నది. దానినే ఉపనయనం అంటారు ఉపనయనం అంటే సమీపదృష్టి ఎవరికి సమీపం? భగవంతునికి సమీపం నయనం అంటే నేత్రం అనగా భగవంతునికి సమీపదృష్టి కలిగినటువంటి నేత్రం కావాలి. అదే ఈనాడు ఆ నేత్రమును మీరు అందుకున్నారు. ఈ నేత్రం ప్రకృతికి సమీపం కాదు, భగవంతునికి సమీపంగా ఉండాలి ఇదే ఉపనయనం భగవంతునికి సమీపమైనప్పుడు మనం ఏమి ఫలితాలను పొందగలం? ఎయిర్‌కండీషన్‌కు దగ్గరగా కూర్చుంటే బయటనున్న వేడిపోతుంది, చల్లని గాలి అందిస్తుంది. అగ్నిముందర కూర్చుంటే చలిపోతుంది, వేడి వస్తుంది ఆదేరీతిగా భగవంతుని సమీపంలో ఉంటుంటే దుర్గుణాలు దూర మవుతాయి, సద్గుణాలు సమీపిస్తాయి (వాటిని అలవరచు కుంటాం) మనం కనుక భగవంతునికి సమీపంగా పోయి, మన ప్రాకృతమైనటువంటి దుర్గుణాలను దురాలోచన లను దూరం చేసుకోవాలి

విద్యార్థులారా!

వేదములలో మొట్టమొదట ప్రబోధించినవి మూడు అవే "మాతృదేవోభవ! పితృదేవోభవ! ఆచార్యదేవోభవ!". "పిల్లలు దీనిని చక్కగా అర్థం చేసుకోవాలి, దైవమంటే ఎవరు? నా తల్లి తండ్రే దైవము పుట్టిన తక్షణమే నీవు చూచేది తల్లిని. నిన్ను పోషించేది తండ్రి. ప్రత్యక్షస్వరూపు లైన తల్లిదండ్రులను విస్మరించి, దేవుడు ఎక్కడో వున్నాడని దేవులాడితే మనకు లభించేటటువంటివాడు కాదు. మన కష్టములకు, నష్టములకు, దుఃఖములకు ఆదుకొని సమీపంగా వుండి అర్థం చేసుకొని మనలను పోషించేవారు తల్లిదండ్రులు కనుక నీ బ్రెడ్, నీఫుడ్, నీ హెడ్, నీ దుడ్డు నీ తల్లిదండ్రుల యొక్క సొత్తే, కనుక మొట్టమొదట మీ తల్లిదండ్రులకు కృతజ్ఞత నందించాలి, తల్లిదండ్రులను గౌరవించాలి దీనికి ఆదర్శము శ్రీరామచంద్రుడు తండ్రి ఆజ్ఞను శిరసా వహించాడు, రాజ్యాన్ని కూడా వదలి కానలకేగాడు. ఈనాడు ఎట్టి అర్హత లేనివారు కూడా అధికారం కావాలని ఆశిస్తున్నారు. రాముడు అట్లా కాదు సత్య వాక్య పరిపాలన చేత తండ్రిని గౌరవించి, ఆతని యొక్క అభీష్టాన్ని నెరవేర్చాడు కనుక మొట్టమొదట మీ తల్లిదండ్రులను గౌరవించండి వారి ఆజ్ఞలను శిరసావహించండి. వారి అడుగుజాడలలో నడవండి. అప్పుడు ఆదర్శవంతమైన జీవులు కాగలరు. అటువంటి వారే నిజమైన భక్తులవుతారు ఒక చంప తల్లిదండ్రులకు కంటినీరు తెప్పించి, భగవంతుని ప్రార్థిస్తే

ప్రయోజనం ఏమిటి ? కాదు ... కాదు .... జీవులను ప్రేమించాలి. దేవుణ్ణి స్మరించాలి. ఇంతకంటె మించిన భక్తి మరొకటిలేదు మొట్టమొదట మీ తల్లిదండ్రులను ప్రేమించండి తల్లిదండ్రులను ప్రేమించలేని ప్రేమ నిజమైన ప్రేమ కాదు తల్లిదండ్రులు నీవు పుట్టక పూర్వమే వున్నారు కనుక నీకు పూర్వమే నున్న తల్లిదండ్రులను ప్రేమించకుండా మధ్యలో వచ్చిన భార్యను మాత్రమే ప్రేమించేవారిని ఏమనాలి? ఈ భార్యా, పిల్లలూ అందరూ మధ్యలో కలిసిపోయే మేఘములవంటివారే కనుక మొట్టమొదట తల్లిదండ్రులను ప్రేమించాలి, గౌరవించాలి, వారిని ప్రసన్నులను గావించాలి, వారిని ఆనందపరచినప్పుడే, నీ జీవితమంతా ఆనందమయంగా వుంటుంది.

విద్యార్థులారా !

భగవత్ భక్తిని అభివృద్ధిపరచుకొని తల్లిదండ్రుల ప్రేమకు పాత్రులు కావాలని నేను ఆశిస్తున్నాను. గాయత్రి మంత్రమును మానకండి మూడు పూటలా చేసుకోవటానికి వీలుకాకపోయినా, సర్వకాల సర్వావస్థల యందు కూడనూ మీ మనస్సులో స్మరించుకోవచ్చును. నేను లేచేది ఉదయం 8 గంటలకు కదా ! నాకు ఎట్లా స్మరించటానికి వీలవుతుంది? అని అనుకోవచ్చును ఇది కేవలం సోమరితనం తెల్లవారి లేచి పండ్లుతోముకోవటం లేదా ? దొడ్డికి పోవటం లేదా ? స్నానం చేయటంలేదా? ఈ కాలకృత్యాలు తీర్చుకోవటంలేదా ? అదే రీతిగా గాయత్రి మంత్రంను స్మరించటం కూడా ఒక ప్రధానమైన కృత్యంగా నీవు భావించాలి స్నానంచేసేటప్పుడు గాయత్రీమంత్రం చదువుతూ స్నానం చేస్తే, గాయత్రీ దేవికి అభిషేకం చేసినట్లుగా ఉంటుంది అన్నం తినే ముందు గాయత్రీ మంత్రం చదివి అన్నం తింటే ఆ దేవికి నైవేద్యం పెట్టినట్లవుతుంది మనకు ఎన్నో మార్గములున్నప్పటికీ వాటిని అనుసరించలేకపోతున్నాం. అసలు మనలో శ్రద్ధాశక్తులు లేకపోవటం చేతనే మనం ఎన్నో యిక్కట్లకు గురిఅవుతున్నాం. "శ్రద్ధావాన్ లభతేజ్ఞానం" శ్రద్ధ వుంటే మనం ఏమైనా చేయవచ్చును అన్నిటికన్నా ముఖ్యం భగవత్ భక్తి, విశ్వాసములను పెంచుకోండి నిత్యమూ అమ్మా నాన్నలతో కూడి ఆనందంగా భగవత్ నామం చేయండి. ఎలాంటి కఠినమైన బాధలైనా క్షణంలో తొలగిపోతాయి. కనుక హృదయపూర్వకంగా భగవద్భక్తి అభివృద్ధి కావాలి లోకంలో ఈనాడు భక్తి అంతా నశించిపోతున్నది.

భక్తి అంటే బాహ్యమైన ఆచారాలుకాదు హృదయపూర్వకమైన పవిత్ర ప్రేమయే భక్తి అన్నదమ్ములను ప్రేమించండి, బంధువులను ప్రేమించండి. స్నేహితులను ప్రేమించండి, అందరిని ప్రేమించండి. ఇదియే భక్తి "దేవుళ్ళను పూజించడం, జీవులను బాధించడం - ఇది భక్తి అవుతుందా ? జీవుడే దేవుడు, దేవుడే జీవుడు" ఈ రెండింటి యొక్క ఏకత్వాన్ని మనం చక్కగా గుర్తించాలి.

( ది 23-8-95 న ప్రశాంతి నిలయంలో జరిగిన ఉపనయన మహోత్సవాల సందర్భమున భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగం నుండి )

# మహోన్నతుడైన స్వర్ణాభరణ శిల్పి

-డా॥ యం. యన్. రావు

ఒక ఆభరణాన్ని చేయటం అంత సులభమైన పని కాదు. దానికి సుదీర్ఘమైన శ్రమ అవసరం. బంగారాన్ని లోతైన గనుల్లోంచి రాతిముక్కల రూపంతో బయటకు లాగాలి. దానిని కొలిమిలో కాల్చి శుద్ధి చేయాలి. అలా వచ్చిన 24 కారెట్ల పరిశుద్ధమైన బంగారాన్ని మన స్వర్ణకారులు ఉపయోగిస్తూ ఉంటారు. అయితే ఆ శుద్ధమైన బంగారాన్ని కావలసిన రూపం లోనికి మలిచేందుకు కొద్దిపాటి రాగిని కూడా దానికి చేర్చుతూ ఉంటారు. ఒక శిల్పిగా ఆ బంగారానికి, అనేక రంగులు కల్గిన వజ్రవైఢూర్యాలను చేర్చి అందంగా మలుచుతారు. అది ఒక ఆభరణమౌతుంది. ధనికులైన స్త్రీలను ఆకర్షింపచేస్తుంది.

బ్రిటిష్‌రాణి ధరించే ప్రత్యేకమైన ఎంతో విలువైన ఆభరణాల్ని లండన్ టవర్ ఖజానాలో భద్రపరచి ముఖ్యావసరములకు వెలికిదీసి వాడుతూ ఉంటారు. భారతదేశంలో ఎంతో ధనం కలిగిన దేవుడు తిరుపతి వేంకటేశ్వరుడు ప్రత్యేక ఉత్సవ సందర్భాలలో స్వామివారిని ఈ విలువైన ఆభరణాలచే అలంకరింప చేస్తారు. ఈ ఆభరణాలు అన్నీ ఎన్నో శతాబ్దముల నుండి సేకరింపగా వచ్చిన ఆభరణాలు ఎందరో మహనీయులైన ప్రాచీన శిల్పులు చేసిన మహోన్నత కళాసృష్టి సంపదయే ఇది.

కాని భగవాన్ బాబా నాడూ నేడూ, ఎవరితోనూ పోల్చబడలేని విధమైన మహోన్నతుడైన స్వర్ణాభరణ శిల్పి. ఆయన తన సంకల్పమాత్రముననే అరుదైన, విలువైన ఆభరణం మరుక్షణంలో తన చేతిలోనికివచ్చి చేరుతుంది ప్రతి దినము ఇటువంటి సంఘటనలు అనేకం ప్రత్యక్షంగా జరుగుతూనే ఉంటాయి

స్వామివారిని ఒక భారతీయ యువ దంపతులు కాలిఫోర్నియా నుండి వచ్చి సందర్శించేవారు ఆ దినము ఆ భారతీయ యువ దంపతుల వివాహ వార్షికోత్సవము స్వామి వారిని ఇంటర్వ్యూకు రమ్మని ఆహ్వానించారు వారికి ధగధగ మెరిసే ముత్యాల హారాన్ని సృష్టించి ఇచ్చారు. అటువంటి ముత్యాల హారం ప్రపంచంలో నేనెక్కడా చూడలేదు ఒక పెద్దావిడ నేను నివసించుచున్న నిలయానికి సంబంధించిన ఆశ్రమంలో ఉండేది. ఆమె అనుదినం ఉదయం సాయంత్రం స్వామివారి దర్శనం చేసికొని వస్తూ ఉండేది. పాద నమస్కారానికి తోసుకుని ముందుకు వెళ్ళటానికి, మరీ పెద్దది కాబట్టి వెళ్ళలేకపోయేది. ఒక రోజు స్వామి భక్తుల బారులగుండా వెళ్ళేటప్పుడు, ఒక ఉంగరం దానిపైన బంగారు పాదాలు చెక్కబడి ధగధగ మెరిసే చిన్నిచిన్ని వజ్రములు పొదిగిన దానిని ఎంతో ఆశ్చర్యజనకంగా సృష్టించి ఇచ్చారు. ఆమె చేసిన ప్రార్థనల ఫలితమే ఆమెకు భగవాన్ పాదములు కల్గిన ఉంగరం లభింపచేసి ఉంటుంది. ఆమె అనతికాలంలోనే ఆ ఉంగరంతోనే కన్నుమూసింది ఎన్నో ఏళ్ళతరబడి స్వామి భక్తురాలుగాఉంటున్న అమెరికా మహిళ దయనే. క్రిస్మసు సందర్భమున స్వామి ఆమెను పిలిచి విదేశ భక్తుల బృందానికి భజనలో నాయకత్వం వహించమని

కోరేవారు. ఆమెకు ఈమధ్య ఒక విలువైన రంగు కల్గిన రాయితో పొదగబడిన ఉంగరాన్ని సృష్టించి ఇచ్చారు. ఆమె సంతోషించింది కాని ఇంకా పూర్తి సంతోషం రాలేదేమో అనిపించింది, స్వామి ప్రశ్నించారు అయితే ఆమె చెప్పేలోపుగనే "అదా, తెలుపురంగు నిర్మలత్వాన్ని సూచిస్తుందికదూ!" అని స్వామి అంటూ ఆ రంగు ఉంగరాన్ని తిరిగి తీసికొని, అదే సమయంలో మరల ఆ ఉంగరాన్ని తిరిగి ఆమెకుఇచ్చారు. కాని, చూడండి, ఆశ్చర్యం ఆ ఉంగరం రాయి తెల్లగా మారింది .... బహుశః ఇంతకంటే విడ్డూరమైన విషయం ప్రఖ్యాత దక్షిణాత్య వయొలిన్ విద్వాంసుడు చౌడయ్య సందర్భంలో జరిగింది. ఒక పర్యాయం స్వామి చౌడయ్యగార్ని ప్రశంసిస్తూ ఒక మంచి, పెద్దదిగా ఉన్న ఒక బంగారు మెడలు సృష్టించిఇచ్చారు. చౌడయ్యగారి ముఖం చూచి, వారి భావాలను గ్రహించి ఆ మెడలును స్వామి తిరిగి తీసికొని తన గుప్పెటలో పెట్టుకొని ఒక క్షణంలో తిరిగి ఆయనకు ఇచ్చేశారు. అదే మెడలు మీద స్వామి పేరు గ్రహించిన చౌడయ్యా నామం, తేది, స్థలం చెక్కబడి ఉండటం ఎంతో విశేషం. అంతా సెకండ్లలో జరిగింది.

అవును. స్వామి సంకల్పిస్తారు అలా జరుగుతుంది.

అవును స్వామి మానవుల విషయంలో కూడా ఎలా సంకల్పిస్తె అలా జరుగుతూఉంటుంది.

అది స్వామివారి అద్భుత విశేషం.

ఒక ఉదాహరణ :

కల్పగిరి ఒక ఘోరమైన హత్య చేసి న్యాయ చట్టపు బారినుండి పోలీసులనుండి తప్పించుకొని హిమాలయాలకు పారిపోతాడు ఆతని పరోక్షంలో ఆతనికి శిక్ష విధింపబడింది. కొంతకాలం పిదప కాషాయాంబరాలు ధరించి ఒక యతీంద్రునిగా చలామణి అవుతూ భారత దేశంలో గల పుణ్యస్థలాల్ని సందర్శించాడు ఆతని స్వగ్రామం కూడా సందర్శించాడు అచటనే ఆతడు ఘోర హత్య చేసిన స్థలం ఉంది హాయిగా పుణ్యక్షేత్ర సందర్శనంలో భాగముగ పుట్టపర్తిచేరుకున్నాడు. బాబా ఈయనను బారులనుండి పిలిచి ఇంటర్వ్యూకు రమ్మన్నారు. చెప్పలేని అద్భుతం జరిగింది.

ఒక గంట అయిందో ఏమో ఆ సన్యాసి స్వామివారు ఇచ్చిన మామూలు దుస్తులు ధరించి బయటకు వచ్చాడు. ఆతనిలో గొప్ప మానసిక పరివర్తన వచ్చింది. స్వామి అతనికి హితబోధచేసి ఒప్పించారు. 'వెళ్ళు. ఒప్పేసుకో, నీకు మరణదండన విధించరు. నేను మాటఇస్తున్నాను. శిక్షను చిరునవ్వుతో అనుభవించు. మరల నీవు తిరిగి ఇచ్చటకు వచ్చినప్పుడు నీకొక బహుమతిని ఇస్తాను' అని పంపించారు కల్పగిరి స్వామి మాటలు సంపూర్ణంగా అంగీకరించి వెళ్ళాడు. స్వామివారు తన సిద్ధాంతాన్ని కల్పగిరికి ఇలా తెల్పారు 'వారు నీ శరీరాన్ని మాత్రమే బాధిస్తారు దానివలన నీ మనస్సు మెరుగులు దిద్దుకుంటుంది'

ఆయన పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళి లొంగిపోయాడు. ఆతనికి మరణదండన విధింపబడింది. కాని బాబావాగ్దానం చేసిన రీతిని భారత దేశాధ్యక్షుడు కనికరించి శిక్షను యావజ్జీవకారాగారశిక్షకు తగ్గిస్తాడు. ఇంకా అవలేదు.

కల్పగిరి చాలా మారిపోయి, తన యావజ్జీవ కారాగార శిక్షను ఒక వరముగా భావించి; తాను బాబా సందేశాన్ని తన తోటి ఖైదీలకు అందజేస్తూ, భజనలు, సత్సంగము; సర్వమత ప్రేమ మొదలైనవి ఆచరిస్తూ తాను ఎచట ఉన్నా అది బాబా మందిరముగా మార్చి జైలు జీవితం కొనసాగిస్తున్నాడు.

మానవులను బాబా తన కార్యకర్తలుగ రూపొందించుటకు ఎన్నెన్ని ఆశ్చర్యజనకములగు పనులు చేస్తారు! ఇది అంతా మానవాళి శ్రేయస్సునకేకదా! మరి స్వామి ఆ స్వర్ణకళాకారుడు తన ప్రవచనాల్లో ప్రజలనుద్దేశించి 'దివ్యాత్మస్వరూపులారా' అని సంబోధిస్తు ఉంటారు. భగవత్స్వరూపులైన మానవులారా! నా ఆధ్యాత్మిక ఆభరణములారా!' అంటారు. ○

# శ్రీ సత్యసాయిబాబాయే తల్లి, తండ్రి, దైవము

—డా॥ సోమనాథ్ షరాఫ్

( అనువాదము : ఎన్. బి. ఎస్. రామారావు )

( శ్రీ సత్యసాయి విశ్వవిద్యాలయంలో వైస్ ఛాన్సలరుగ పనిచేసి రిటైరైన డా॥ సోమనాథ్ షరాఫ్‌గారి ఆంగ్ల వ్యాసమునకు ఇది అనువాదము. )

ఈయన ప్లానింగ్ కమీషన్ సెంట్రల్ గవర్నమెంటులో ఇంతకుముందు విద్యాశాఖ సలహాదారునిగ పనిచేసారు. 'UNESCO' అను అంతర్జాతీయ సంస్థలో ఆఫ్ఘనిస్థాన్, ప్యారిస్, భూటాన్ దేశాల్లో అనేక ముఖ్య పాత్రలు నిర్వహించారు. సత్యసాయి సంస్థలో మానవతా విలువలపై అనేక వ్యాసములు వ్రాసి, విశ్వవిద్యాలయమునకు వైస్ చైర్మన్ అగుటకు ముందునుండీ కూడా సత్యసాయి సంస్థకు సేవచేసిరి.

ఈయనకు స్వామి జన్మజన్మలనుండీ, మరియూ తన చిన్నతనమునుండీ అవతార కార్యక్రమములో సేవ చేయుటకు ఎట్లు తీసుకొనివచ్చారో తన అనుభవాలను వారి మాటలలో ఇలా వివరించారు...

" నేను ఐదవ క్లాసు చదువుచుండగా 10 ఏళ్ళ వయసులో, నన్నూ నా చిన్న తమ్ముళ్ళను విడచి మా అమ్మ అసువులుబాసింది. మా ముగ్గురినీ చూసేవారెవరూ లేరు. ఏమీ తెలియని లేతమనసులతో మా తల్లికి అంత్యక్రియలు చేసాము. మా తల్లి చనిపోయిన రోజునే మా స్కూలులో 'మురటాజ్ ఖాన్‌సాహెబ్' అనే అధ్యాపకుడు క్రొత్తగా చేరారు మేమపుడు 'మలాపుర' అని శ్రీనగర్ దగ్గర కాశ్మీరులో ఒక గ్రామంలో ఉండేవాళ్ళం మా స్కూలు పేరు 'బాబా పోరా మిడిలు స్కూలు' దీనిని అనువదిస్తే ' బాబావారిచోటు ' అని అర్థం ఆ స్కూలు ఈ నాటికీ ఉన్నది. 13 రోజులు మా తల్లికి అంత్య క్రియలు చేసాక, తిరిగి స్కూలు నుంచి ఇంటికి వస్తే మమ్మి చూసేవారెవరూ లేరని తెలిసే, నిరాశతో. నేను స్కూలుకు వెళ్ళాను తిరిగి వచ్చాక అన్నం ఎవరు వండుతారు? మా బట్టలు ఎవరు ఉతుకుతారు ? అనాథులమయ్యాముకదా ? అని బాధపడుతూ స్కూలుకి వెళ్ళాను ఆ రోజుననే మా స్కూలులో క్రొత్తగా చేరిన 'మురటాజ్ ఖాన్ బాబా'ను మా క్లాసు టీచరుగా చూచాను నన్ను చూడగానే ఆయన దగ్గరకు పిలిచి, నన్ను ప్రేమతో కౌగలించుకొని, ' ఎందుకలా విచారంగా ఉన్నావు ? ' అని అడుగగానే, నేను భోరున ఏడ్చాను 'మా అమ్మ చనిపోయిందని' ఏడుస్తూ చెప్పాను. ఆయన నన్ను తన ఒడిలోకి తీసికున్న విధం చూస్తే మా అమ్మ తిరిగి వచ్చినట్లనిపించింది

ఆయన నన్ను ఓదారుస్తూ, మీ అమ్మ చనిపోలేదు, 'నేను మీ అమ్మని, నీ క్షేమం అంతా నేను చూస్తాను' అని అభయం ఇచ్చారు. ఆయన నిత్యం నా క్షేమ సమాచారం తెలిసికొంటూ మాకు గాంధీగారి గురించి, అనేక మహర్షుల గురించి, కథలు, చరిత్రలు చెబుతూ,

సత్యధర్మముల గురించి మానవతా విలువలు బోధించారు ఆ రోజులలో కాశ్మీరులో బ్రాహ్మణ పిల్లలను గుర్తించడానికి వీలుగా బ్రాహ్మణ పిల్లల చెవులకు బంగారు రింగులుండేవి. ఈయన క్లాసులోకి వచ్చిన మొదటి వారంలోనే 'మానవులంతా ఒకే జాతి, విద్యార్థులందరూ సమానమే, కుల మత బేధములుండరాదని - సర్వమత సమన్వయము బోధిస్తూ బ్రాహ్మణ పిల్లల చెవుల రింగులను తీయించివేశారు. సత్యహరిశ్చంద్ర కథలను, గాంధీగారి ఆత్మకథను వారెక్కువగా బోధించేవారు.

నా ఎనిమిదవ క్లాసు "బాబా పౌరామిడిలు స్కూలులో" పూర్తయిన వెంటనే, నేను, ప్రతాప్‌సింగ్ హైస్కూలునకు మారితిని. మరి రెండు రోజుల తరువాత నేను గురువుగారైన "మురటాజ్ ఖాన్ సాహెబ్" గారిని తిరిగి దర్శిద్దామని బాబా పౌరామిడిలు స్కూలుకి వస్తే, ఆ ముందురోజే ఆయన స్కూలు విడచి ఎచటికో వెళ్లిపోయారని హెడ్‌మాష్టారు చెప్పారు. ఇది నాకు చాలా 'షాకు' తగిలినట్లయింది. ఆయన ఎక్కడికి వెళ్ళి వుంటారు? నేను ఈ రోజుకీ ఆయన ముఖం మరచిపోలేదు. 1972 సం॥లో తొలిసారిగా నేను శ్రీ సత్యసాయిబాబావారి ఫోటో చూడటం తటస్థించింది. అదే ముఖం నా మురటాజ్ బాబావారిది కూడా. నా గురువు, తల్లి, తండ్రి నాకు సర్వస్వం అయిన మురటాజ్ బాబాగారిని సత్యసాయిబాబావారి ఫోటోలో తిరిగి 34 సం॥ తరువాత మళ్ళీ చూడగల్గాను. భౌతికంగా నేను తొలిసారి శ్రీ సత్యసాయిబాబావారిని ఆగష్టు 30, 1973వ సం॥ గురువారంనాడు కలిసికొని దర్శించాను. ఆనాడు స్వామి నన్ను ఇంటర్వ్యూ గదిలోకి పిలుస్తూ 'బావుంది, గురువారంనాడు వచ్చావు' అని హిందీలో అన్నారు. నా మురటాజ్ బాబావారని, వీరిని ఒకే కళ్ళు. నా తల్లి, నా గురువుల రూపమే శ్రీ సత్యసాయిబాబా.

1974వ సం॥ నేను కాబూల్‌లో వుండగా, నాకు తెలిసిన ఒకామెకు కడుపులో వుండు పగిలి రక్తవమనం చేసికొని చాలా ప్రమాదస్థితిలో నున్నది. నేను అది చూసి చాలా దుఃఖించి, ఆ దగ్గరలోగల ఒక సాయి భక్తుని ఇంటికి వెళ్ళి, వారింట్లో దరహాస వదనంతోగల సాయి ఫోటో ముందు సాష్టాంగపడి, ఆమెను ఈ ప్రమాదంనుండి కాపాడమని మనసారా సాయిని ప్రార్థించాను. నేను ప్రార్థన ముగించి లేచేసరికి, ఆ ఫోటోనుంచి గులాబీల సువాసనలతో 'విభూతి' ఉద్భవించింది. ఆహా, ప్రశాంతినిలయంలో ఉన్న సాయికృష్ణా! 'కాబూలు నుండి ఈ మీరా పిలుపు విన్నావా?' స్వామీ! అంటూ ఆనందంతో నేను ఆ

## దేవతలు - రాక్షసులు

సద్గుణాలు, సచ్చింతనలే దేవతలు, దుర్గుణాలు, దురాలోచనలే రాక్షసులు. ఇలాంటి దేవతలను లోనికి ఆహ్వానించేవారు. రాక్షసులను బయటికి పంపేవారు. అట్లే మనం మంచిని స్వీకరించి చెడ్డను వదలిపెట్టాలి. ఈనాడు శారీరక మానసిక ఆధ్యాత్మిక బలములు కోల్పోవటానికి దుర్గుణములు, దురాలోచనలే మూలకారణము. కనుక నీలో ఎలాంటి దుర్భావం ప్రవేశించినా తక్షణమే దానిని తరమాలి. ఫలమును భుజించి మలమును విసర్జిస్తున్నాము గదా! అట్లే మంచిని స్వీకరించి చెడ్డను విసర్జించాలి. కాని ఈనాడు మలమును భుజిస్తున్నారు, ఫలమును విసర్జిస్తున్నారు. అనగా చెడ్డను మాత్రమే లోపలకు తీసుకుంటున్నారు, మంచిని వదలుతున్నారు. దేనిని చేర్చుకోవాలో దానిని చేర్చుకోవటం లేదు. దేనిని వదలాలో దానిని వదలటంలేదు. కనుకనే దుఃఖమునకు, అశాంతికి గురి అవుతున్నారు.

- బాబా

విభూతి తీసికొని హాస్పిటల్లో బాధపడుతున్న రోగి దగ్గరకి పరుగెత్తుకొని వెళ్ళి ఆ విభూతి ఆమె నోటిలో వేసాను ఆమెకు రక్తవమనాలు కట్టి, పూర్తి ఆరోగ్యం చేకూరింది. స్వామి ఎంత కరుణామయుడు. ఆయన సర్వవ్యాపి. ఆయన లీలలు చిత్ర విచిత్రాలు.

నేను UNESCO (United Nations Economical, Social and Cultural Organisation) తరఫున నవంబరు 20 వ తారీకు, 1975 సం॥ లో ప్యారిస్ వెళ్ళాను అపుడు నేను ప్యారిస్‌లో వున్న నా చిన్న తమ్ముడుతో కలిసి, ప్యారిస్ సాయి భక్తులు జరుపుతున్న సత్యసాయి బాబావారి 50 వ జన్మదిన వేడుకలలో పాల్గొన్నాను అచట వివిధ మతస్తులు, వివిధ భాషలు మాట్లాడేవారు కలిసి జరుపుకొంటున్న స్వామి 50 వ జన్మదిన వేడుకలు చూస్తే నాకు ఒళ్ళు పులకరించింది. లండన్‌లో చాల పెద్ద విశాలమైన హాలులో ఈ వేడుకలు వైభవోపేతంగా జరిగాయి

ఆ మరునాడు నేను విమానంలో బ్రిటిషు ఛానలుపై ఎగిరి, ప్యారిస్ రావలసియున్నది. అది నవంబరు 27, 1975 ఆ రోజు నాకు తెల్లవారుఝామున సత్యసాయి బాబావారు కలలో కన్పించి ఇలా చెప్పారు. 'షరాఫ్! నీవీరోజు ప్రయాణం చేయడం మంచిదికాదు. ప్రయాణ సమయంలో 'నీవూరిహోస్' వున్నాయి (వర్జములు / దుర్ముహూర్తములు) షరాఫ్! బాధపడకు నీవు నా దగ్గరకు 9 సం॥ల తరువాత వస్తావు. ఈలోగా నీ జీవితములో చాలా కష్టములు, సుఖదుఃఖములు చూస్తావు కానీ నా దయవలన నీవు వాటినన్నింటినీ అధిగమించగలవు. 9 సం॥ తరువాత నీతోనూ, గోకక్‌గారితోనూ, కలిసి మన ముగ్గురి సమావేశం జరుగుతుంది.

ఆ రోజు స్వామి ఇలా కలలో చెప్పిన మీదట, Confirm అయిన నా విమాన టిక్కెట్టును రద్దు చేసికొన్నాను ఆ రోజు బ్రిటిషు ఛానలుపై పెద్ద తుఫాను సంభవించి, నేను పయనించవలసి ఉన్న విమానం ఇంజను పాడై పెద్ద చిక్కులలో పడినదట.

ఆ తరువాత 1982వ సం॥ పూనాలో యూనివర్సిటీల ఛాన్సలర్స్ సదస్సు జరిగినపుడు నేనూ, నా భార్య పూనా వెడుతూ, ముందు రెండు రోజులు బొంబాయిలో ఆగాము. ఆనాడు శ్రీ సత్యసాయిబాబావారు 'ధర్మక్షేత్ర' (బొంబాయి) లో వున్నారు. జనవరి 27, 1982 రాత్రి స్వామి భక్తులందరికీ డిన్నరిచ్చారు. నాకు భార్యతోసహా ఆ డిన్నరులో పాల్గొనే అవకాశం చిక్కింది స్వామి ఒక్క నిముషంలోనే తన భోజనం ముగించి లేచి, అందరిలోనూ తిరుగుతూ వెయ్యి తల్లుల ప్రేమతో ఆహార పదార్థములు అందరికీ వడ్డింప జేస్తున్నారు. అపుడు నేను సాయిబాబావారిని ఒక చిన్న విషయం అడిగాను అప్పటికి కొద్దిరోజుల తరువాత నేను UNESCO సంస్థ తరఫున సలహాదారునిగా 'భూటాన్' రాయల్ గవర్నమెంటులో పనిచేయుటకు వెళ్ళే వుద్దేశ్యంలో వుండుటచే బాబాను చూసి, "బాబా నేను భూటాన్ వెళ్ళుచున్నాను". "వెళ్ళి నీ పని శ్రద్ధగా చేసికొనిరా" అన్నారు బాబా. కొంచెంసేపాగి స్వామి, "ఎప్పుడు వెడుతున్నావు? నీ ప్రోగ్రాం ఏమిటి?" అన్నారు. అపుడు నేను, "స్వామీ రేపు పూనాలో జరగబోయే పడమర కనుమలలో ఉన్న యూనివర్సిటీల ఛాన్సలర్ల సమావేశానికి హాజరగుచున్నాను అందులో మేము "సముద్రములో కలియు కాలుష్య నివారణకు (Sea Pollution) యూనివర్సిటీలు ఎట్లు సహాయపడగలవు? అన్న అంశం చర్చిస్తాము" అన్నాను

వెంటనే స్వామి, "ఏ నివారణ జరుగదు, మనుష్యుల మనస్సులలో కాలుష్యం ఉన్నన్నాళ్ళు, వాతావరణం, సముద్రం, అన్నీ కాలుష్యం చేయబడుతూనే వుంటాయి. నీ పని నీవు శ్రద్ధగా చేసికో" అన్నారు

స్వామిచేత ఆశీర్వదింపబడిన నేను ఫిబ్రవరి 3, 1982 సం॥ భూటాన్ UNESCO-UNDP ప్రాజెక్టులో చేరాను. అచట నా వుద్యోగం 3 నెలలే ఐనా, స్వామి

ఆశీర్వాదం వలన ఏడాది పొడిగింపబడింది. 1982 ఏప్రిల్ 8వ తేదీన స్వామి ఢిల్లీ వచ్చారని తెలిసి, నేనూ, నా భార్యా కలిసి ఢిల్లీ వెళ్లాం స్వామి నన్ను చూసి ఎప్పుడు వచ్చావు? అని అడిగారు కొద్ది దూరంలో ఉన్న నా భార్యను చూసి 'Where is your life?' అని అడిగారు. నేను స్వామినే చూపిస్తూ, "Baba, my life is standing before me!" అన్నాను స్వామి నవ్వుతూ "I am asking for your wife" అన్నారు. ఆమె ఎదరకు వచ్చింది స్వామి వెంటనే విభూతి సృష్టించి ఇచ్చి ఆమెతో, "ఇది నీకు ముందుముందు అవసరమౌతుంది, జాగ్రత్తగా దాచుకో" అన్నారు. "నేను అపుడు నీ ఇంటికొస్తాను" అనికూడా అన్నారు. కానీ స్వామి మాటలకు అర్థం తెలియక నిజంగా స్వామి మాతో ఢిల్లీలో మేమున్న ఇంటికి వస్తారా? లేక భూటాన్ వస్తారా! అని పరిపరి విధాల తలపోసాము.

1982 జూన్ 8వ తేది నా భార్య తన తండ్రి చనిపోయారన్న వార్త విని చాలా కంగారుపడి, హార్టు కంప్లెయింట్ తెచ్చుకున్నది కుడి కన్ను దృష్టి కూడా పోయింది కుడిపైపు పక్షవాతము వచ్చినది ఆమె ఆరోగ్యము హఠాత్తుగ సన్నగిల్లినది వెంటనే నేను ఆమెను ఓదార్చి ఢిల్లీలో స్వామి దాచుకోమని ఇచ్చిన విభూతి తీసి ఆమె శరీరంపై వ్రాసితిని. అచట మిలటరీ హాస్పిటలులో పెద్ద డాక్టరుగా వున్న డా॥ 'షాహి' గారిని పిలుచుకొని వచ్చితిని ఆయన వెంటనే వచ్చి పరీక్ష చేసి ఆమెకు చాలా తీవ్రంగా గుండె వ్యాధి వచ్చినదని, అంత పెద్దగా వచ్చి హార్టుఎటాక్‌లో ఆమె ఎలా బ్రతికి బయటపడిందోకదా అని ఆశ్చర్యం వెలిబుచ్చారు ఆయన రోజూ వచ్చి చూసి వైద్యం చేసారు కొంత కాలానికి మేమీ విషయమే మరచిపోయాము అలాగ 5 సం॥ లు కాలం గడిచింది.

1987 జూన్ 8వ తే॥న (నేను ప్రశాంతినిలయంలో సత్యసాయివిశ్వవిద్యాలయంలో వైస్‌ఛాన్సలర్‌గా ఉన్న రోజులలో) తెల్లవారుఝామున 4 గం॥ లకు స్వామి నాకు కలలో కన్పించి ఇలా అన్నారు

"షరాఫ్! నీకు జ్ఞాపకం వుందా? నేను సరిగా 5 సం॥ల క్రితం సరిగా ఇదే రోజున నీ భార్య హార్ట్ ఎటాక్‌తో చాలా సీరియస్‌గా వున్నపుడు భూటాన్‌లో నేను నీ యింటికి వచ్చాను నీవు విభూతి ఆమె శరీరంపై అలిమితివి. అపుడు డా॥ 'షాహి' రూపంలో వచ్చినది నేనే. ఆమెను అలా రక్షించాను ఆమె కోలుకొన్నది' అన్నారు స్వామి యొక్క ఆ మధుర స్వరం అలా వింటూండగానే నాకు మెలకువ వచ్చింది వెంటనే నేను నా భార్యను లేపాను ఆమెకు హార్టుఎటాక్ వచ్చిన తేదీ జ్ఞాపకం వున్నదా అని అడిగాను. ఆమె మెడికల్ ఫైలు తీసి చూస్తే 1982 జూన్ 8వ తా॥ డా॥ షాహి గారు వ్రాసిన మందుల వివరాలు దొరికాయి తనబిడ్డలపై సాయికి ఎంత ప్రేమయోకదా!

ఇక్కడ షరాఫ్‌గారంటారు: నా భార్య భూటాన్‌లో హార్టుఎటాక్ వచ్చినపుడు - డా॥ షాహి వచ్చి వైద్యం చేసిన సంగతి మేము స్వామికి ఎన్నడూ వ్రాయలేదు. స్వామికి భౌతికంగా మనం దూరంగా నివసించినప్పుడు తప్పనిసరిగా మన సమస్యలను వారికి ఉత్తరాల ద్వారా వ్రాసికోవాలని తెలియదు ఇపుడు నాలో నేను చర్చించుకోగా, మనం వారికి వ్రాసినా, వ్రాయకపోయినా, ప్రపంచంలో మనం స్వామికి ఎంత దూరంగా వున్నా, స్వామి ఎప్పుడూ తన భక్తులతో దగ్గర సంబంధం కలిగే వుంటాడు మనం బహూశా ఆయనను చేరుకోలేక పోయినా, ఆయనమటుకు మనల్ని తప్పక చేరుకుంటాడు స్వామిని చేరుకోవడం కష్టతరమైన విషయం అన్న అంశమును నేను అంగీకరించను మనం ఉత్తరం వ్రాయాలనుకున్నపుడే మనం వ్రాయబోయేది ఏమిటో ఆయనకు తెలుసు మనం ఆయనకు అందించే పత్రాలలో ఉన్న విషయం ఏమిటో కూడా ఆయనకు తెలుసు.

అదే రోజు ఉదయం - అనగా జూన్ 8, 1987 ప్రశాంతి నిలయంలో వరండాలో స్వామి అక్కడ

వున్న వారందరినీ వరి వారి వయస్సు ఎంత ? అని అడిగి తెలుసుకున్నారు. వారిలో నేనూ ఉన్నాను నా వంతు కూడా వచ్చింది నేను మనసులో తెల్లవారు ఝామున వచ్చిన కల విషయం గుర్తొచ్చి 'ఆ కలకూ స్వామి అడిగిన ప్రశ్నకూ ఏదో సంబంధం వుంటుందని మనసులో వూహించి, కావాలనే స్వామికో, స్వామి నా వయసు అడిగినప్పుడు 10 సం॥ అని చెప్పాను

అక్కడున్న వారితో స్వామి "వైస్ ఛాన్సలర్ చెప్పిన దాంట్లో చాలా విశేషం ఉన్నది ఈతడు సరిగా 10 సం॥ వయసులో శ్రీనగర్ కాశ్మీరులో 'మలాపోరా' గ్రామంలో ఉన్నపుడు నా దగ్గర కొచ్చాడు" అన్నారు. మురతాజా సాహెబ్‌గా నన్ను చేరదీసినది ఈ బాబాయే నని నాకు దృఢమైనది. షరాఫ్‌గారు ఇంకా ఇలా అంటున్నారు :

నేను నవంబరు 27, 1976 సం॥ లండన్‌లో వున్నప్పుడు స్వామి కలలో నేను సరిగా 8 సం॥ల తరువాత ఆయన దగ్గరకు వస్తానని చెప్పారు కదా ! అది ఎలా నిజమైందో చూద్దాము.

1984 సం॥ నవంబరు రెండవ వారంలో నేనూ నా భార్య కలిసి బాబావారి 59వ జన్మదినం సందర్భంలో ప్రశాంతి నిలయానికి వచ్చాము. అక్కడ నిర్మల ప్రశాంత వాతావరణంలో కొన్నాళ్ళున్నాము నవంబరు 27 న స్వామి మమ్మల్ని ఇంటర్వ్యూ గదిలోకి పిలిచారు. మా పిల్లలు, ఆరోగ్యం మొ॥ విషయాలు అడిగాక, స్వామి. "షరాఫ్ నీవు ఎప్పుడు రిటైరు అవుతున్నావు? అని నన్ను ప్రశ్నించారు స్వామీ నేను ఇప్పటికే రిటైరు అయి వున్నాను : కానీ ఢిల్లీలో National institut of Educational Planning and Administration సంస్థలో ఒక ముఖ్యమైన రీసెర్చి విభాగంలో పనిచేయుచున్నానని చెప్పాను ఆ పని ఎపుడు పూర్తి అవుతుందని స్వామి అడిగారు "స్వామీ ! ఒక ఏడాదిపాటు బహుశా ఆ పని సాగవచ్చు. కానీ నేనా పనిలో ఖాళీ ఉన్నప్పుడల్లా నా సమయంలో నూటికి 99 పాళ్ళు E H V వ్యాసములు తయారుచేసి సత్యసాయి సంస్థ వారికందించుచునే యున్నాను" అని చెప్పాను

అంత స్వామి 'ఆ ఒక పాలు ఏమి చేయుచున్నావు?' అన్నారు అని స్వామి, 'ఒకటి అనగానే I 'అహం' అందుచే షరాఫ్ ! అట్టి I పాలు I ని, అహాన్ని స్వామికిచ్చెయ్యి.' అన్నారు నేను అర్థంకాక స్వామిని వివరించమని కోరాను. స్వామి, "పూర్తిగా స్వామి సేవయే చెయ్యి ! వచ్చే సంవత్సరం, నీ రీసెర్చి ప్రాజెక్టు పని పూర్తి అవగానే నీవిచట వైస్ - ఛాన్సలరు కావాలి" అన్నారు అపుడు నీ అహంభావమును, I ని మిగిలిన I పాలు కూడా స్వామికి సమర్పించినవాడవవుతావు" అన్నారు ఈ ఇంటర్వ్యూ నవంబరు 27, 1984లో జరిగింది సరిగ్గా ఏడాదికి నవంబరు 27, 1985న ప్రశాంతినిలయం చేరాము స్వామి సంకల్పానుసారమే అంతా జరిగింది గోకక్ గారు రిటైరైన మరుసటి దినంనుంచీ స్వామి నన్ను వారి సేవలో నియోగించారు

'భక్తి అగ్నివంటిది అగ్ని ఇనుమును కూడా కరిగించగల శక్తిగలది భగవంతుడు భక్తునికి వశమౌతాడు' మనకు అటువంటి భక్తిని ప్రసాదించమని బాబాను ప్రార్థించుదాము అంటూ షరాఫ్‌గారు తన వ్యాసాన్ని ముగించారు

స్వామి సర్వజ్ఞుడు సర్వవ్యాపకుడు సర్వశక్తి వంతుడు అన్న విషయం, భక్తులు స్వామికి వ్రాసి ఇచ్చే ఉత్తరాలలో ఉన్న విషయాలు ముందే స్వామికి తెలుసు నన్న సంగతి, కలలో స్వామి కనిపించడంలో సందేశాలు ఎలా స్వామి భక్తులకు అందిస్తారో, షాహిగారి రూపంలో స్వామి వారింటికివచ్చానని తెలియజేయడంలో స్వామి 'సర్వభూతాంతరాత్మ' అన్న విషయం, స్వామి ప్రేమమూర్తి అని షరాఫ్‌గారిని 10 సం॥ నుంచి తల్లీ తండ్రి, దైవంగా చేరదీయడంలో మనకు గోచరిస్తున్నాయికదూ !



# డాక్టర్ ఆఫ్ డ్రీమ్స్ భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

-మాదిరాజు రామచంద్రరావు

ఈనాడు నేల నాలుగు చెరగులా 135 పైగా దేశాలలోని శతాధిక మిలియన్ల ప్రజానీకం శ్రీ సత్యసాయిబాబాను సాక్షాత్ భగవత్ అవతారమూర్తిగా, శివశక్తుల సమిష్టి స్వరూపంగా విశ్వసించి, ఆరాధించి ఆనందిస్తున్నారు, పూజించి పునీతులౌతున్నారు. అచ్యుతుడు, అనంతుడు, అవ్యయుడు, అక్షరుడు, ఆదిమధ్యాంతరహితుడు అయిన నిరాకార అఖండ సచ్చిదానంద పరబ్రహ్మ మానవాళిపైగల అవ్యాజమైన ప్రేమతో మానవాకారంలో భూమిపై అవతరించారు గనుక, భక్త జనోద్ధరణ- భక్తసంరక్షణ- భక్తసంస్కరణ అవతార లక్ష్యాలలో ఒక భాగం కనుక భక్తకోటిని వేయి తల్లుల విమల ప్రేమతో కంటికిరెప్పలా స్వామి అనుక్షణం కాపాడుతున్నారు. భక్తుల బాధలను, గాథలను తనవిగా స్వీకరించి పరిష్కరిస్తున్నారు.

స్వామి సశరీరంగా అనంతజనవాహిని మధ్య నడయాడుతున్నా భౌతిక తలం (Physical Plane) లో వైయుక్తికంగా అందరినీ పలకరించటం, కష్టసుఖాలను విచారించటం - ఆనందపరవశులను చేయటం సాధ్యం గాదు - అట్లని ఏ భక్తునీ ఉపేక్షించటం భగవత్తత్త్వం గాదు - కనుక కోట్లాది భక్తులను ఆనందపరచటానికి భౌతిక ప్రకృతి నియమాలకు అతీతమైన ఆయన స్వాంత మార్గాలు (Hot lines) ఆయనకు వున్నాయి - అందులో ఒకటి భక్తులకు స్వప్నంలో దర్శనాలు ప్రసాదించడం పాదనమస్కారాలు యివ్వటం, వ్యాధులను నివారించటం మొదలైనవి. కలలకు సాధారణంగా అర్థం వుండదంటారు అందుకే కలలను 'కల్లలు' (నిజంగానివి) అంటారు కాని స్వామికి సంబంధించినంతవరకు కలలు కల్లలుగావు ఈ అంశం స్వామే అనేకమార్లు స్పష్టీకరించారు తన సంకల్పం మేరకే భక్తులకు కలలో దర్శనాలు యిస్తుంటానని, ఆశీస్సులు అందిస్తుంటానని, వ్యాధుల నివారణ జరుగుతుందని, సందేశాలు అందుతాయని వివరిస్తుంటారు - ఇందుకు కోట్లాది భక్తుల స్వానుభవాలే ప్రత్యక్ష నిదర్శనాలు - అంతేగాదు - ఏ నామంతో భగవంతుని పిలిచినా నేను పలుకుతాను, ఏ భగవత్ రూపాన్ని ఆరాధించినా నాకు ప్రియమే - ఆర్తితో ఏ భక్తుడు తన యిష్టదైవాన్ని ఎలుగెత్తి సహాయం అర్థించినా నేనా బాధ్యతను స్వీకరించి సంరక్షణ చేస్తాను అంటారు బాబా. అనటమేగాదు - ఆచరణలో ఆ విషయాన్ని మనకు శతధా సుస్పష్టంచేస్తున్నారు - ఆ కోవకు చెందినదే ఈ క్రింది సంఘటన

ఖమ్మంజిల్లాలో చారిత్రక ప్రాధాన్యం గల నేలకొండపల్లి గ్రామం ఒక రెవిన్యూ మండల కేంద్రం - ఆ గ్రామంలోని సాయి భక్తులకు ప్రేమమూర్తి బాబా ఎన్నో మధురానుభూతులను, ఆనందదాయకమైన అనుభవాలను అనుగ్రహిస్తుంటారు అదే గ్రామంలో సాయి భక్తులుగాని ఒక పేద కుటుంబాన్ని స్వామి స్వప్నమార్గంలో అనుగ్రహించిన వాస్తవిక దివ్య గాథ యిది. సాయి అనంత దివ్య లీలాంబుధిలోని ఒక చిరుకెరటం ఇది ఆ గ్రామంలో ఒక పేద రైతు కుటుంబానికి చెందిన 80 సంవత్సరాల వృద్ధుడు ఎర్రా వెంకయ్య. ఆంజనేయస్వామి ఆయన అభిమాన దైవం. తోచినపుడు ఆలయానికి వెళ్ళి ప్రదక్షిణాలుచేసి వస్తుంటాడు. సహజ సిద్ధమైన వయోభారంవల్ల ప్రత్యేకించి ఏ అనారోగ్యం లేకున్నా శారీరక పటుత్వం, శక్తి క్రమంగా క్షీణించి

పోతున్న స్థితిలో వున్నాడు గ్రామంలోని సాయి భక్తులు శ్రీ వంగపేటి నర్సయ్యగారు, యితరులు సాయి భజనలలో పాల్గొనవలసిందిగా ఈయన్ను అనేకసార్లు కోరారుగాని తను ఎన్నడు పట్టించుకోలేదు. స్వామి ఫోటో చూశాడుగాని ఎటువంటి స్పందన కలుగలేదు. ఆయనకు 1994 వ సంవత్సరం డిశంబరు 15, 16 తేదీల్లో అకస్మాత్తుగా తీవ్రమైన కడుపునొప్పి ఆరంభించింది. స్థానిక వైద్యులు ఖమ్మం పట్టణంలోగల వైద్య ప్రముఖులు డా॥ జె. అర్. ప్రసాద్, M D గారిని కలవమని సలహా యిచ్చారు డా॥ ప్రసాద్ పరీక్షించి, Investigations చేయించి మూత్రపిండాలకు సంబంధించిన వ్యాధిగా నిర్ధారించారు. వైద్యులను సంప్రదిస్తున్న ఆ 4, 5 రోజుల్లోనే వ్యాధి కడు తీవ్రరూపం దాల్చి జటిలం అయ్యింది. కడుపు బాగా ఉబ్బింది. మూత్రవిసర్జన స్తంభించింది, ఎప్పుడైన విసర్జన జరిగినా రక్తస్రావం అయ్యేది, ఏమాత్రం ఆహారం తీసుకోలేని స్థితి వచ్చింది. తుదకు ముక్కులగుండా, నోటిగుండా రక్తస్రావం కాసాగింది. పరిస్థితి విషమిస్తున్నదని గమనించిన డా॥ ప్రసాద్, వీరిని హైద్రాబాదులోని ఏదైన సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్‌కు తక్షణం వెళ్ళవలసిందిగా తొందరపెట్టారు. ఆర్థికంగా అంత వెసులుబాటులేని కుటుంబం గనుక తమ గ్రామం వెళ్ళి వైద్య ఖర్చుల నిమిత్తం హడావుడిగా సొమ్ము సమకూర్చుకుంటున్నారు. ఆ విషమ పరిస్థితుల్లో వీరి కుటుంబానికి బాగా పరిచయస్థురాలైన ఒకావిడ ఈయన్ను హైద్రాబాద్ తీసికొనివెళ్ళటం కన్నా పుట్టపర్తి స్వామి హాస్పిటల్‌కు తీసికొనివెళ్ళటం మంచిదని సలహా యిచ్చారు. అక్కడ డబ్బు ఖర్చు అసలు వుండదని, వైద్యం చాలా బాగుంటుందని చెప్పారు. ఆమె సలహా మేరకు డిసెంబరు 25వ తేదీన పుట్టపర్తి ప్రయాణమై వెళ్ళారు పుట్టపర్తి సూపర్ స్పెషాలిటీస్ ఆసుపత్రి వైద్య నిపుణులు ఈయన్ను పరీక్షించి మూత్రపిండాలు పూర్తిగా చెడిపోయాయని ఆపరేషన్‌వల్ల ప్రయోజనం వుంటుందేమో కాని, రోగి వృద్ధాప్యం, శారీరకస్థితి దృష్ట్యా ఆపరేషన్ మరింత ప్రమాదకరం కావచ్చని అభిప్రాయపడ్డారు. మందులు వాడటం, భగవత్ కృపను అర్థించటం తప్ప ఎవరు చేయగలిగింది ఏమీలేదని తేల్చి చెప్పారు. భగవాన్ బాబాను దర్శించుకొని యింటికివెళ్ళి తాము సూచించిన ఔషధాలతోపాటు స్వామి విభూతి ప్రసాదం క్రమం తప్పకుండా సేవించమని సలహా యిచ్చారు. చేసేదిలేక బాధాతప్త హృదయంతో, విషణ్ణవదనంతో డిసెంబరు 30వ తేదీన పర్తినుంచి యింటికి వచ్చారు. మందులు వాడుతున్నా వ్యాధి నెమ్మదించలేదు. భగవంతుని (సాయినిగాదు) ప్రార్థిస్తూ భారంగా నిమిషాలు, గంటలు గడుపుతున్నారు.

పర్తినుంచి యింటికి వచ్చిన మూడవనాడు రాత్రి వెంకయ్యకు స్వప్నంలో స్వామి దర్శనం యిచ్చారు. మెడలో సెతస్కోప్, చేతిలో కొన్ని వైద్య పరికరాలు వున్నాయి. ఆయన వెంట తెల్లని యూనిఫాం ధరించిన యిద్దరు సిస్టర్స్ వున్నారు. ఒక సిస్టర్ చేతిలో స్టవ్, మరొకరి చేతిలో కొన్ని కత్తులు, కత్తెర్లు వంటి పరికరాలు వున్నాయి నేను నీకు ఆపరేషన్ చేయటానికి వచ్చాను అన్నారు బాబా. ఈయనేమిటి? ఆపరేషన్ ఏమిటి? ఈయన డాక్టరు కాదుగదా అనుకుంటూ నిశ్చేష్టంగా వున్నాడు బాబా ముడిచిన తన గుప్పిటను రోగి ముక్కువద్ద వుంచారు ఎటువంటి వాసనో జ్ఞాపకం లేదుగాని, ఆ వాసన చూపిన వెంటనే స్పృహ తప్పినట్లయింది ఆ స్థితిలో కూడ తన శరీరంపై ఆపరేషన్ వంటి ప్రక్రియ ఏదో జరుగుతున్నట్లు ఈయనకు తెలుస్తూనే వుంది. క్రమంగా నిద్రలోకి జారుకున్నాడు మరునాడు కుటుంబ సభ్యులకు తన కల గురించి చెప్పాడుగాని స్వామికి సంబంధించిన స్వప్న ప్రాధాన్యత వారికి తెలియనందున ఆ కలను, ఒక మామూలు కలలాగానే భావించారు. కాని ఆశ్చర్యకరంగా వ్యాధి తీవ్రత కొంత ఉపశమించింది ఈ తగ్గుదల స్వామి అనుగ్రహంవల్లనని వారు ఊహించలేకపోయారు. మూడు రోజుల తర్వాత స్వామి

మరల ఆయనకు స్వప్నంలో కన్పించారు. ఆపరేషన్ అయ్యింది గదా! యింకా నొప్పి తగ్గలేదా అంటూ పలకరించారు. ఈయన ఏ సమాధానం చెప్పకముందే వెల్లికిలా పడుకొనివున్న ఈయన్ను స్వామి బోర్లగా తిప్పారు, బోర్లగా వున్నాయన్ను వెల్లికిలా తిప్పారు ఇట్లా 2, 3 సార్లు అటూఇటూ జోర్లించి వ్యాధి పూర్తిగా తగ్గింది, బాధపడకు అంటూ అదృశ్యం అయ్యారు. మరునాటినుంచి నెప్పి తగ్గింది, రక్తస్రావం ఆగిపోయింది. మూత్రవిసర్జన మామూలుగా జరగసాగింది. కడుపు ఉబ్బరం తగ్గింది, తనంతట తానుగా కడుపునిండా ఆహారం తినగల స్థితి వచ్చింది - క్రమంగా సంపూర్ణ ఆరోగ్యవంతుడైనాడు.

అంత్యకాలం ఆసన్నమైనదని తీవ్రంగా మనోవేదన చెందుతున్న అభాగ్యునకు కలలో ఆపరేషన్ చేసి సంపూర్ణ ఆరోగ్యవంతునిగా చేయటమేగాక, తమాషాగా కలలోనే డాక్టరు ఫీజు వసూలు చేసికొని వెళ్ళారట స్వామి - డిశంబరు 7 వ తేదీ రాత్రి నలుగురు డాక్టర్లు వెంకయ్యకు కలలో కన్పించారు - ఆపరేషన్ చేయించుకున్నావుగదా! ఫీజు డబ్బులు యివ్వవా? అని అడిగారు నాకు మీరెప్పుడు ఆపరేషన్ చేశారు? సాయిబాబాగదా నాకు ఆపరేషన్ చేసింది అని సమాధానం చెప్పాడు - బాబా మేము అంతా ఒకటే - ఆయనే ఫీజు తెమ్మనమని మమ్ములను పంపించాడు మాటిమాటికి నీ దగ్గరకు రావటానికి మాకు టయిములేదు - ఇంకా చూడవలసిన పేషెంట్లు చాలామంది వున్నారు అన్నారట - ఎంతఫీజు యివ్వమంటాడు అని అడిగితే నల్గురం వున్నాంగదా. తలా 250/- మొత్తం నల్గురకు కల్సి రూ. 1000/- యివ్వు అన్నారట - వారు కోరిన విధంగా వెయ్యి రూపాయలు కలలోనే చెల్లించాడు - అనాధనాధుడు, ఆర్తజనరక్షకుడు అని భక్తులు కీర్తిస్తున్న విధంగా అవధులెరుగని తమ ప్రేమపూర్వక దివ్యలీలా వైభవాన్ని, వినోదాన్ని నేలకొండపల్లి సాయిభక్తులకు అందించి ఆనందపరవశులను చేశారు బాబా. ఈ విధమైన స్వప్న వృత్తాంతాలు ఒక్క ఈ ఎర్రా వెంకయ్యకే



పరిమితంగాదు - వేలాదిమంది సాయిభక్తులు కలల్లోనే స్వామికి పాదనమస్కారాలు చేసుకుంటున్నారు - విభూతి ప్రసాదాలు అందుకుంటున్నారు - ఆపరేషన్లు చేయించుకుంటున్నారు - ఆరోగ్యవంతులౌతున్నారు - మృత్యుముఖంనుండి బయటపడుతున్నారు. అందుకే అనుభవజ్ఞులైన సాయిభక్తులు ఆయన్ను 'డాక్టర్ ఆఫ్ డ్రీమ్స్' అంటుంటారు - సార్ధక బిరుదాంకితుడు బాబా.

1995 జూన్ 26వ తేదీన నేలకొండపల్లి సత్యసాయి సేవా సమితి కార్యక్రమంలో పాల్గొనటానికి నేను వెళ్ళినపుడు శ్రీ ఎర్రా వెంకయ్యగారిని తొలిసారిగా చూడటం, మాట్లాడటం, ఆయన అనుభవాన్ని తెల్సికొనటం జరిగింది. ఆయన ముఖతా నేను ఆస్వాదించిన ఈ సాయి దివ్యలీలా మధురిమను అందరికీ పంచాలనే తపనతో స్వామి ప్రేరణతో ఈ వాస్తవిక గాథకు అక్షరరూపం యివ్వ సంకల్పించాను

)-O-(



# సేవకు మించిన సాధన లేదు

-భగవాన్ సాయి దివ్యసందేశం

" చక్కెరకంటె తీపి
దధిసారముకంటె రుచ్యమౌను
పెంపెక్కిన తేనెకన్న అతిరుచ్యము
నోటను పల్కపల్కగ "

ప్రేమస్వరూపులారా !

విషముతో నింపిన బంగారుపాత్ర కంటె, అమృత ముతో నింపిన మట్టిపాత్రే చాలా విలువైనది ధన కనక వస్తు వాహనాదులతో తులతూగుతున్నట్టి ఈ దేహమునందు, దుష్ట దుర్మార్గభావములనే విషమును నింపినటువంటి ఈ బంగారుపాత్ర కంటె, మానవ శరీరము మట్టి శరీరము. ఈ మట్టి శరీరమునందు దివ్యమైన, నవ్యమైన, భవ్యమైనటువంటి సద్గుణ సదాచారములనే అమృతాన్ని నింపినటువంటి ఈ మానవ దేహము అత్యంత ఉన్నతమైనటువంటిది, ఉత్కృష్ట మయినటువంటిది.

" జంతూనాం నరజన్మ దుర్లభమ్ " మానవ జన్మ విలువైనటువంటిది, అతి పవిత్రమైనటువంటిది. కనుకనే హనుమాన్ తన హృదయమును విప్పి రామునితో చెప్పుకొనిన సందేశం ఒకటున్నది ఓ రామా ! ...

" దేహ బుద్ధ్యాత్ దాసోహం
జీవ బుద్ధ్యాత్ త్వమంతకః
ఆత్మ బుద్ధ్యాత్ త్వమేవాఽహం
ఇతిమే నిర్గుణా స్థితిః "

ఓ రామా ! నా దేహభావముచేత నీకు నేను దాసుడను జీవభావముచేత నేను నీకు ప్రతిబింబమును ఆత్మబుద్ధితో నేను నీవే, నీవు నేనే దీనినే బైబిల్‌నందు కూడా దేహభావముచేత I am the messenger of God అన్నాడు జీవభావముచేత I am the son of God. ఆత్మభావంచేత You and I are one అన్నాడు. అన్ని మతములయందు, అన్ని జాతుల యందు, అన్ని దేశములందు సత్యము ఒక్కటే, గమ్యము ఒక్కటే రూపనామములు భిన్నములై నప్పటికినీ, దివ్యత్వమైనటువంటి ఆత్మతత్త్వము, సర్వులయందునూ ఏకత్వముగా యిమిడి ఉన్నది. కనుక సర్వుల హృదయములను భ్రమింపజేసేటటు వంటిది రామతత్త్వమే

ఒకానొక సమయమునందు హనుమంతుడు, విభీష ణుని కలుసుకున్నాడు విభీషణుడు తన ఆవేదనను హనుమంతునికి విప్పి జెప్పాడు " హనుమంతా ! నీవెంత అదృష్టవంతుడవోయి ! నేను నిరంతరం రామ చింతనను చేస్తున్నాను కాని, రామ దర్శనం చేసుకోలేక పోతున్నాను రామనామం స్మరిస్తున్నాను కాని రామ దర్శనం మాత్రం నాకింకనూ లభ్యం కాలేదు" అన్నాడు విభీషణుడు. అప్పుడు హనుమంతుడు " విభీషణా ! నీవు రామనామమును మాత్రమే స్మరిస్తున్నావుగాని, రామ సేవలో పాల్గొంటున్నావా ? నామమును స్మరించి నంతమాత్రమున చాలదు, సేవలో పాల్గొనాలి. పది నెలలు అయింది, సీత ఈ లంకను చేరి, ఓ ప్రియపాత్రు డైన రామపత్నిని బంధనంనుండి విమోచనం చేసే ప్రయత్నమును ఏనాడైనా చేశావా ? రామ సేవలో ఏనాడైనా పాల్గొన్నావా ? కేవలం రామనామం అనేటటు వంటి కరెంటు వంటిది సేవ బల్బు వంటిది బల్బు కరెంటుతో చేరినప్పుడే ప్రకాశం ప్రాప్తిస్తుంది కేవలం

కరెంటు ఉండినంతమాత్రమున ప్రకాశం మనకు లభ్యం కాదు ఆ కరెంటుతో మన హృదయమనే బల్బును చేర్చాలి కనుక నామము కరెంటు, సేవ బల్బు కాబట్టి నామసహితమైన సేవకూడా చేసినప్పుడే, ఆ దివ్యత్వమైన ప్రాప్తిని నీవు పొందగలవు '' అని హనుమంతుడు బోధించాడు

హనుమంతుడు మరొక ఉపంతమునుకూడా విభీషణునికి చెప్పాడు ''విభీషణా! కబంధుడనే వ్యక్తి ఒకడుండేవాడు. సామాన్య మానవులకు తల మెడపైన ఉంటుంది కాని ఈ కబంధునకు తల పొట్టపై ఉన్నది అతని హస్తములు చాలా పొడుగైనవి ఎంతో దూరంలోనున్న పదార్థములనుకూడా అందుకొని భుజించేవాడు. ఈనాడు ప్రతి మానవుడు కబంధుడు లాగానే రూపొందుతున్నాడు. తన తెలివితేటలు, తన మేధాశక్తి తన విద్య, సర్వశక్తులూ కేవలం తన పొట్ట నింపుకొనే నిమిత్తమే ఉపయోగపడుతున్నాయి. కాని తోటి మానవులకు సేవచేసి, వారి బాధలను నివారించడానికి మాత్రం ఉపయోగపడటంలేదు. ఎన్ని జపాలు చేసినా, ఎన్ని తపములు ఆచరించినా, ఎన్ని తీర్థయాత్రలు సేవించినా ప్రయోజనంలేదు. ఈ సంసారమనే సాగరమును దాటవలెననిన సజ్జన సేవ చేయాలి సేవకు మించిన సాధన మరొకటి లేదు. కనుక తన తోటి మానవుల బాధలను పైదొలిగించే నిమిత్తం వారికి సేవలు చేయాలి" అని బోధించాడు హనుమంతుడు

Love all, Serve all అందరినీ మనం ప్రేమించాలి, అందరినీ మనం సేవించాలి సేవించడానికి వీలు కానప్పుడు మంచి మాటలనయినా పలికి వారిని సంతృప్తి పరచాలి గర్వమును విసర్జించాలి వినయ విధేయతలను పెంచుకోవాలి పెద్దలను గౌరవించాలి. విద్యయొక్క విశిష్టతను చక్కగా గుర్తించాలి ఆలోచనలు, మాటలు, చేతలు— ఈ మూడింటి యొక్క ఏకత్వం కావాలి అదియే ఈ నామజపము యొక్క అంతరార్థము కేవలం రాం.... రాం.... అంటూ వ్రాస్తూపోతే చాలదు ఆ రామనామమును హృదయములో చింతించాలి. నోటితో పలకాలి. చేతితో వ్రాయాలి- ఇదియే నిజమైనటువంటి 'త్రికరణశుద్ధి' ఊరికే వ్రాస్తూపోకూడదు 'రామా!' అని హృదయంతో చింతించాలి, 'రామా!' అని పెదవులతో పలకాలి. 'రామా!' అని హస్తముతో వ్రాయాలి. ఇదియే త్రికరణశుద్ధి యొక్క 'లిఖిత జపము' అన్నారు ఈ త్రికరణశుద్ధితో చేసిన ఏ కార్యమైనా సఫలీకృతమవుతుంది. మనసులో ఒకటి, మాటలో ఒకటి, మాటలో వేరొకటి, చేతలో ఇంకొకటి అయినప్పుడు, ఇది కేవలం దుష్టత్వంగా మారిపోతుంది

" పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్ '' ఇదే 18 పురాణముల సారాంశమని చెప్పాడు వ్యాసుడు. Help ever, Hurt never (ఎల్లపుడు సహాయం చేయి, ఎవరినీ బాధించకు) ఈ రెండింటి యొక్క సత్యమును మనం గుర్తించుకుంటే, 18 పురాణములు చదివిన సారం మన హృదయంలో లీనమవుతుంది దానమే హస్తమునకు భూషణం సత్యమే కంఠమునకు భూషణం సత్యము చెప్పని కంఠం, కంఠమే కాదు. చెవులకు ఇంపైన భాష మాట్లాడాలి మన దేహములోని అన్ని అంగములకంటే జిహ్వ (నాలుక) చాలా ప్రధానమైన అంగం దీనిని గురించి అనేకవిధములుగ వర్ణిస్తూ వచ్చారు. జయదేవుడు కూడా చక్కగా వర్ణించాడు నాలుక ఎన్నియో మాటలు మాట్లాడుతుంటూ వుంటుంది కాని తన గృహమును వదిలి బయటకు రాదు తన స్వస్థానమును వదలి బయటకుపోదు ఎవరైనా నాలుకను బయటకుపెట్టి మాట్లాడుతారా? లోపలనే ఉంచి మాట్లాడుతారు ఇది తన యొక్క గౌరవాన్ని కాపాడుకొనేటటువంటి ప్రధానమైన లక్షణము. త్యాగముతో చూస్తే ఎవరైనా మధురమైన పదార్థములు అందించినప్పుడు, తానే తినక, భుజించి హరించుకొని సర్వాంగములకు పంపగల శక్తి ఉన్న జఠరాగ్ని", ఆ మధురమైన పదార్థములను పంపుతుంది.

తినరాని విషపదార్థమైతే వెంటనే బయటకు నెట్టివేస్తుంది నాలుక. శాంతమనేది నాలుకకు పుట్టిన ఇల్లు పెట్టిన పేరు. కత్తులవలె వుండెడి 36 దంతముల మధ్య మెత్తని నాలుక ఎంత జాగ్రత్తగా మెలగుతున్నాది? ఏ కొంచం అటూఇటూ మెదిలినా ఈ దంతములు నాలుకను కత్తిరిస్తాయి ఇంతమంది దుష్టుల మధ్యలో ఉండివప్పటికినీ ప్రశాంతంగా మెదలుతూ ఉంటుంది. దీనినే విభీషణుడు కూడనూ హనుమంతునికి బోధిస్తూ వచ్చాడు

విభీషణుడు కంటిధారలు కార్చుకుంటూ "హనుమా! నేను మహారాక్షసుల మధ్య జీవిస్తున్నాను. ఇలాంటి స్థితిలో నేను రామచింతన చేస్తూ, నేను రామసేవలో పాల్గొంటుంటే, నన్ను ఈ లంకలో ఉండనిస్తారా? రాక్షసులు మహాదుర్మార్గులు, అలాంటివారి మధ్య నాలాంటి సభ్యత గల వ్యక్తి బ్రతకటం కష్టం కాదా! పండ్ల మధ్య నాలుక ఏ విధంగా మసలుకుంటువున్నదో, నేను ఆ విధంగా ఈ రాక్షస మూకలమధ్య జీవిస్తున్నాను హనుమా!' అన్నాడు విభీషణుడు హనుమంతుడు ఫక్కున నవ్వి 'విభీషణా! ఎంత పొరబడుతున్నావు. పండ్లమధ్యనున్న నాలుకవలె నీవు పోల్చుకుంటున్నావు మానవుని జీవితంలో మొట్టమొదట క్రింద పడిపోయేది (ఊడిపోయేది) పళ్ళు మాత్రమే, నాలుక కాదు. ఈ సత్యమును చక్కగా గుర్తించుకో' అన్నాడు హనుమంతుడు. ఇలాంటి పళ్ళు (రాక్షసులు) నీకు ఎంత ప్రమాదం చేయటానికి పూనుకున్నప్పటికినీ, ఆ పళ్ళ మధ్య ఏదైనా ఇరుక్కుంటే నీవే వాటికి సహాయం చేస్తున్నావు ఆ పళ్ళ మధ్య ఇరుక్కున్నదానిని నాలుకే తీసివేస్తుంది గదా! కనుక నాలుక ఎంత సహాయమైనటువంటిది? ఇంతటి పవిత్రమైన జిహ్వను ఈనాడు మనం అపవిత్రమైన కర్మలలో ఉపయోగపెడుతున్నాం You cannot always oblize, but you can speak always oblizingly. ఈ నాలుకతో మనం సత్యమును పలకాలి ప్రీతికరమైన వాక్యములను ఉచ్చరించాలి. "అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియ హితం చ యత్" అని భగవద్గీత బోధిస్తున్నది మనం ఉద్వేగకరమైన సత్యమును చెప్పగూడదు. సత్యం అతనికి ఇష్టము గదా యని, కష్టపెట్టేటటువంటి సత్యమును చెప్పకూడదు. అతనికి అసత్యం చాలా మధురము కదా యని, నీవు అతనికి మధురమైన అసత్యమును చెప్పకూడదు. ప్రీతిగాను, హితముగాను వుండే సత్యమును పలకాలి ఒక్కొక్కసమయం లోపల సత్యము ఇతరులను బాధపెట్టే అవకాశం వుండవచ్చును. అలాంటప్పుడు సత్యమును చెప్పవద్దు, అసత్యమునూ చెప్పవద్దు. కనుక నీవు సరియైన గౌరవమును ఈ నాలుకకు అందించాలి.

"సత్యం జన విరోధాయ, అసత్యం జన రంజనం" ఈనాటి మానవుడు సత్యమును ఇష్టపడటం లేదు. ఇంటింటికి వచ్చి అమ్మా పాలు! అమ్మా పెరుగు! అంటే మాకు అక్కరలేదు. వెళ్ళిపోండి అంటారు. ఇల్లు వదలి పరుగెత్తుకొనివెళ్ళి మద్యపానం చేసివస్తారు. అసత్యమునకు ఈనాడు అధికమైన బలమును యిస్తున్నారు. దుర్మార్గమునకు భయపడుతున్నారు అక్రమ అనాచారములకు ముందంజ వేస్తున్నారు, కాని సత్యమునకు ముందంజ వేయటంలేదు ప్రాణం పోయినాసరేగాని, సత్యమునుమాత్రం విడువరాదు

మూడు దినములు బ్రతికినా హంసవలె జీవించాలి. కాకి వలె నూరు సంవత్సరములు బ్రతికి ప్రయోజనమేమిటి? మంచి పేరును సంపాదించు, మంచి స్థానమును పొందు. మనం జీవించేటటువంటిది జీవితం కోసం కాదు, గౌరవంకోసం జీవించాలి మనం భుజించేది దేహం కోసం కాదు, దేహం చేసేటటువంటి సత్కర్మల కోసం దేహమును కాపాడుకోవాలి పరోపకార నిమిత్తమై ఈ దేహమును రక్షించుకోవాలి. మన జీవితమంతా రోగములమయమే ఆకలి ఒక రోగము, అన్నం ఒక ఔషధం దాహం ఒక రోగం, దానికి నీరు ఒక ఔషధం. వాంఛలు ఒక రోగం, ఆ వాంఛలు తీరితే మనకు రోగ

నివారణ అవుతుంది. కాబట్టి మన జీవితమంతా "రోగముల మ్రగ్గడి సేవక కొంప".

'దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః' దేహమును దేవాలయముగా భావించుకోవాలి. ఈ దేహమనేటటువంటి దేవాలయం లోపల, జీవత్వమనేటటువంటి దైవత్వం ఉంటుండాలి. ఈ దైవత్వం ఎక్కడ ఉంటున్నాది ? ఎక్కడికి దేహం వెళ్లతే అక్కడంతా ఉంటుండాలి. కనుక ఈ దేహమనేటటువంటి దేవాలయం కదిలే దేవాలయం, ఇలాంటి దానిని మనం ఎంతో పవిత్రంగా ఉపయోగపెట్టుకోవాలి. మన నడక, మాట, పాట, తిండి, తీర్థం– సర్వమూ పవిత్రమైనదిగా ఉండాలి. ఇలాంటి పవిత్రమైన దేహమును, పవిత్రంగా ఉపయోగం చేయాలి. అప్పుడు "జీవ బుద్ధ్యాత్ తమంతకః" దేహబుద్ధిలో నీ అంశమునే నేను. ఈ రెండింటి యొక్క ఏకత్వం కూడిందా, 'ఆత్మబుద్ధ్యాత్ త్వమేవాఽహం' ఆత్మబుద్ధిలో రామా ! నీవే నేను, నేనే నీవు. కనుకనే దైవభక్తియందు ఆదర్శవంతమైన మూర్తి హనుమంతుడు. అతనికి నిరంతరం రామచింతన తప్ప మరో చింతన లేదు. కేవలం చింతనచేస్తూ సోమరి మాదిరి ఒకచోట కూర్చోటంలేదు. ఎప్పుడూ రామకార్యంలో పాల్గొనేవాడు. కనుక అతని హృదయం రామ చింత. దేహం రామసేవ. ఈ రెండింటి చేతనే ఏకత్వం జగత్తుకు హనుమంతుడు ఆరాధన దేవతగా మారిపోయాడు.

ప్రాచీనకాలంలో జంతువులు కూడా దైవముగా మారిపోతూవచ్చాయి. నంది (ఎద్దు), ఇది పశువు కాదు అది నిరంతరం శివుని వైపు శిరస్సు నుంచి చూడటంచేతనే, ఇది ఆరాధన దేవతగా మారిపోయింది శివుని మాత్రమే చూస్తుందిగాని ఆ నంది జగత్తును చూడదు. శివాలయంలో ఎక్కడైనాసరే శివుని వైపే చూస్తుంటుంది ఆ నంది. తన దృష్టి ఈశ్వరుని వైపునే మరలిస్తుంది. కనుకనే అట్టి నంది పూజార్హతను పొందింది ఇంకా హనుమంతుడు కోతి దైవచింతన చేత, దైవకార్యముచేత, అతను ఆరాధనా దైవముగా మారిపోయాడు. రోమరోమమూ రామనామంతో నింపుకున్నాడు. ఎక్కడ నామం చెబితే అక్కడ అంతా రూపం ఉంటుందని విశ్వసించాడు. నామరూపములు రెండూ ఒక్కటేనని విశ్వసించాడు కనుకనే అతను కూడా ఒక జంతువే అయినప్పటికినీ, అది కూడా ఆరాధనా దేవతగా మారిపోయింది సింహం, అది మృగరాజు కాని దాని పేరు చెబితే అన్ని జంతువులూ కదిలిపోతాయి, అదిరిపోతాయి. అట్టి సింహముకూడనూ దేవీ వాహనంగా మారిపోయింది. ఇంకా ఎలుక. చీకటిలో సర్వత్రా ఉంటుంది. వాసన పట్టటంలో ప్రథమురాలు. చీకటికి అది చాలా రుచి అట్టి ఎలుక వినాయకుని ఆశ్రయించడంచేత దానికి కూడా ప్రజలు వందనం చేస్తున్నారు విషసర్పములు వీటిని చూస్తే ప్రజ ట్టి కొట్టి చంపుతారు. అదే సర్పము ఈశ్వరుని

## ఆనందదాయి సాయి

నా యింటనే యుండి నా చింతలను బాపి
దయ జూపు ఆనందదాయి సాయి
నా వెంటనే యుండి నను తప్పుద్రోవలో
పడకుండ కరుణించి నడుపు సాయి
నా జంటనే యుండి నను ధర్మమార్గాన
తడబడకుండ నడుపుమయ్య
నా కంటనే యుండి నవ్య జ్ఞానజ్యోతి
ప్రేమతో నాకు చూపించు సాయి!

ఇంట వెంటనే జంటనే కంటియందు
నన్ను విడనాడకుండగా ఎన్నటికిని
సర్వ వేళల నను బ్రోచు సత్యసాయి
అందుకొమ్మిదె సాష్టాంగ వందనమ్ము

– వై. వెం. రామబ్రహ్మశాస్త్రి

# సాయి సప్తతి

ఈ ప్రపంచము నుద్ధరింపగా వచ్చిన
సాయి సప్తతి దివ్య జన్మదినము
తన చరిత్రమ్మె నా దర్శమ్మె జూపిన
సాయి సప్తతి దివ్య జన్మదినము
ధర్మ సంస్థాపనార్థము భూమికి దిగిన
సాయి సప్తతి దివ్యజన్మదినము
ధనవంతులకు దీనజనసేవ నేర్పిన
సాయి సప్తతి దివ్య జన్మదినము

జనుల జన్మమ్మె చరితార్థ మొనర సేయ
సర్వదేవతారూపుడు సదయుడైన
సత్యసాయీశ సప్తతి జన్మదినము
అర్చనము సేయ రండు పుణ్యాత్ములార !

- శాంతిశ్రీ

---

కంఠంలో ఆభరణంగా చేరినప్పుడు, వాటిని కూడా నమస్కరిస్తున్నారు. ఆ శరీరమును వదలి ప్రక్కకు పోతే తక్షణమే చంపుతారు. వినాయకుని ప్రక్కన ఉన్నప్పుడు ఎలుకకు గౌరవము. వినాయకుని వదలి కొంచం దూరం పోతే చాలు, బోనులో పట్టి చంపుతారు. అనగా ఏమిటి? దైవసమీపంలో ఉండినంతవరకు ఎవరికైనా గౌరవమే, పూజార్హత పొందుతుంది. దూరమైపోతే ఎవరూ వాటిని లెక్కచేయరు. జంతువులే దైవాన్ని పూజిస్తూ దైవసన్నిధిని పొందితే, విజ్ఞానం, సుజ్ఞానం, ప్రజ్ఞానం ఉండిన మనుషులు ఎందుకు దైవత్వాన్ని అనుభవించలేకపోతున్నారు? వాటిల్లో ఒక నియమం ఉంటుండాలి. కాని మానవుని యందు ఆ నియమం లేదు. ప్రకృతిని మాత్రమే అనుసరిస్తున్నారు. వీరు ప్రకృతికి విరుద్ధంగా మారటంచేతనే ప్రకృతి వీరిపైన విజృంభిస్తున్నది. ఎక్కడ ఏమి చిక్కితే అవే తింటాయి జంతువులు. కాని మానవుని యందు విచక్షణాశక్తి ఉంటున్నది. పిల్లికి ఎంత పాలు పోసి, పెరుగు పెట్టి పెంచినప్పటికినీ, ఎలుకను చూస్తే పరుగెత్తుకొనిపోతుంది. పులిని తెచ్చి పూరీలు, కుర్మాలు పెట్టినా అది భుజించదు. అది చచ్చిపోయిన మాంసమునే భుజిస్తుంది. అలాంటివికూడా ఒకవిధమైన నియమములను పాటిస్తున్నాయి. వాటికి రెండు ప్రధానంగా ఉంటున్నాయి. Reason and Season ఈ రెంటినీ అవి దాటవు. కాని ఈనాటి మానవునకు Reason లేదు Season లేదు. తన ఇష్టప్రకారం ప్రవర్తిస్తున్నాడు మానవుడు. ఆ నియమము తప్పటం చేతనే మానవుడు అన్ని కష్టములకు గురి అవుతున్నాడు.

"న శ్రేయో నియమం వినా" మన దేహమే మనకు సరియైనటువంటి సాక్షి. మన దేహం లోపల టెంపరేచర్ 98.4° ఉండాలి. ఆ నియమాన్ని దాటి 99° వచ్చిందా, జ్వరం వచ్చినట్లే. రక్తపుపోటుకూడా 120/80 ఉండాలి, రెండూ కరెక్టుగా ఉండాలి. నియమం తప్పిపోతే అన్నీ రోగంగానే మారిపోతాయి. ఆ రోగమునకు గురికాకుండా ఉండే నిమిత్తమై, దైవ యోగాన్ని మనం సాధించాలి. కనుక యోగమే రోగ నివారణకు సరియైన ఔషధం. దైవముతో కూడి ఉండటమే యోగము. భగవద్గీతలో అన్నీ యోగములే- (కర్మయోగము, జ్ఞానయోగం, భక్తియోగం మొదలైనవి) అన్నారు. త్యాగము కూడా ఒక యోగమే. అందువలననే అది గీతగా మారిపోయింది. ఈనాడు మనం ఒకర్ని బాధించే నిమిత్తమై యోగం చేస్తున్నాం. అర్జునుడు అటుల కాదు. ధర్మంకోసం, దైవం కోసం యోగం చేశాడు. 'ఇంతమంది ప్రజలను చంపిన తరువాత ఈ రాజ్యం నాకెందుకు? ఇది ధర్మం కాదు' అని ధర్మాన్ని, దైవాన్ని దృష్టియందుంచుకొని బాధ పడాడు గనుకనే అతనిది విషాదయోగంగా మారి

పోయింది. కనుక మనం ధర్మాన్ని దైవాన్ని ఒకే దృష్టిలో పెట్టుకొని జీవితాన్ని గడపాలి. రెండు కన్నుల మధ్య ముక్కు వుండినా, రెండు కన్నులూ ఏకదృష్టితో ఉండాలి దైవచింతన యందు 'రామనామం' అత్యంత మధురమైనటువంటిదని పవిత్రమైన చరిత్రలు ప్రబోధిస్తూ వచ్చాయి. దైవనామములన్నీ మధురమే "నయనం మధురం, శ్రోత్రం మధురం, హృదయం మధురం, వచనం మధురం మధురాధిపతే సర్వం మధురం మధురం" భగవంతుని సర్వ చేష్టలూ మధురమే. కనుక మనం ఏం చేసినా, దైవార్పితమైన భావంతో కర్మలనాచరించాలి మీ ఉద్యోగాలను మానుకోనవసరంలేదు, చదువుసంధ్యలు మాననవసరంలేదు, వ్యాపారాలు మానుకోనవసరంలేదు "ఏది చేసినా, ఇది భగవదర్పితంగా చేస్తున్నాను ఈ దేహం ఒక జడమైనటువంటిది, జడము ద్వారానే భగవంతుడు చేస్తున్నాడు" అనేటటువంటి భావంతో నిష్కామకర్మ భగవత్ప్రీత్యర్థం అని చేయండి. అదియే నిజమైన జపం, అదియే నిజమైన ధ్యానం

రామతత్త్వమనేది తప్ప మరొకటి ఈ జగత్తులో లేనేలేదు. ఎందుకంటే ఆత్మకే 'రామా' అని పేరు. కేవలం దశరథుని కుమారుడైన రామునకు కాదు ఆ పేరు దశరథ కుమారునికి పేరు పెట్టాలంటే, దానికి పూర్వం ఏదో ఒక పేరు ఉండాలి గదా! ఉన్న పేర్లే దేహాలకు పెడుతున్నారుగాని లేని పేర్లు పెట్టడానికి వీలు కాదు. కనుక ఆత్మకే 'రామా' అని పేరు కనుకనే నా ఆత్మారామునికే తెల్పునంటారుగాని, నా ఆత్మాకృష్ణునకు, ఆత్మాశివునకు అని ఎవరూ చెప్పరు. అనగా రమించేటటువంటిది 'రామా' ప్రపంచాన్ని చూచినప్పుడంతా రమిస్తుండాలి ఈ హృదయం కాబట్టి హృదయమునకే 'రామా' అని పేరు ఆ హృదయ చింతన చేత మనం ఎంతైనా సాధించవచ్చును అది ప్రేమ

## ఆర్ద్రిత (దర్శనకాంక్ష)

చూడాలని ఉందీ - సాయిని చూడాలని ఉందీ
సత్యసాయిని చూడాలనిపిస్తుందీ
ఒకసారి చూచిన వేనవేలసార్లు చూడాలని ఉందీ
తనివితీర చూడాలనిపిస్తుందీ ॥చూ॥

పుట్టపర్తి వెళ్ళే సమయము రాక
తికమక పడుతూ ఉన్నాను
చేతిలో పైకం తారాడకనే !
మదిలో స్మరణ చేయుచున్నాను ॥చూ॥

దూరాన నీవు నెలిశావు
నా దరికి సాయి రావేల
భక్తులు పిలిచిన పలికే దేవా !
నా మొరలాలించ - జాగేల ॥చూ॥

దర్శనభాగ్యం కలిగించి
పాదస్పర్శలను అందించి
సద్వాక్యములను బోధించి
సన్మార్గము మము నడిపించి
దివ్య విభూతిని మాపై జల్లి
సంభాషించే — పరంధాముని ॥చూ॥

— విద్వాన్ కోట శ్రీరామచంద్రమూర్తి

చేత సాధించాలి ప్రేమ లేకపోతే మనం దేనినీ సాధించలేం కనుక ప్రేమనే దీనికి ప్రధానం.

( ది 31-8-95 న ప్రశాంతినిలయంలో హనుమాన్ విగ్రహ ప్రతిష్ఠాపన సందర్భమున భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగం నుండి )

# భగవాన్ శ్రీ సత్యసాయి ప్రబోధాలూ, ఆర్థిక విలువలూ

—పాతూరి ప్రసన్నం

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి ప్రబోధాలను వివిధ రీతుల్లో మన జీవన వికాసం కోసం అన్వయించుకోగలగటం ఈనాటి మన అదృష్టం. ఆర్థికపరంగా ఎన్ని సూత్రాలు మనకు తెలిసి వుంటే మాత్రం ఏమి ప్రయోజనం ? వాటిని అమలు చేయటం చేత కావటంలేదు. ఎంత సంపాదించినా చాలదు. ఇంకా ఇంకా సంపాదించాలనే ఆరాటం. అందుకు మూలకారణం ? ... భగవాన్ బాబావారి సందేశాల వెలుగులో పరిశీలించుదాం. ఈ ఆర్థికమైన వొత్తిడిని భరించలేక ఆత్మహత్యలు కూడా చేసుకుంటున్నారు ! దీనికి పరిష్కారం ? బాబావారిని అధ్యయనం చేద్దాం.

ప్రభుత్వోద్యోగంలో పదవీ విరమణ చేసి షిరిడీలో సాయినాధుని యెదుట కూర్చున్నారు శ్రీ హేమాద్ పంత్ ''బాబా ! వీరికి పెన్షన్ చాలదు ఏదైనా దారి చూపించు'' అంటూ వారి తరపున శ్యామా బాబావారిని ప్రార్థించారు.

'' నా భక్తుని విస్తరిలో ఎప్పుడూ అన్నానికి లోటు ఉండదు అతని మీద నా అనుగ్రహం ఎప్పుడూ వుంటుంది. అందుకు తగినట్లుగా అతడు దైవ విశ్వాసంతో జీవించాలి దుర్మార్గుల సహవాసం చేయరాదు", అని అతనితో చెప్పు, అని శ్యామాతో బాబా అన్నారు. ఆ తర్వాత హేమాద్‌పంత్ సాయి సన్నిధిలోనే సాయి సేవ చేస్తూ జీవించారు

సాయి ప్రబోధాల్లోగల ఆర్థికపరమైన విలువ యిదే! దైవభక్తి, దైవంమీద విశ్వాసం, సత్సంగంలో జీవించటం అనే జీవిత విధానంతో మనకు ఆర్థికపరమైన అలజడులూ, ఆందోళనలూ లేని రీతిగా రోజులు గడుస్తాయి అనేది సాయి భక్తుల చరిత్రలు చూస్తే తెలుస్తుంది. ఈనాడు మనకు కాముని మీద, కాంచనం మీద గల విశ్వాసం రాముని మీద లేదు కనుకనే '' దైవ విశ్వాసం, దైవ విశ్వాసం '' అన్నారు బాబా '' నా స్వామి నాయందు వుండగా నాకేమి కొరత అనుకుంటారు సాయి భక్తులు ''నేనుండగా భయమేల ?'' అని అభయం ఇస్తారు బాబా సాయి భక్తులకు సాయి యందుగల విశ్వాసం ఒక అగ్నిపర్వతం వంటిది. ఈ విశ్వాసమనే అగ్నిపర్వతం మీద అవిశ్వాసం గడ్డిపరక రూపంలో కూడా తల యెత్తటానికి వీలులేదు. సాయి భక్తుల విశ్వాసం వారి గొంతుకలో కదిలే ఊపిరివంటిది. ''డబ్బు కోసం అవసరాల కోసం వేరే గతి లేక నీతి నిజాయితీలపై మాకున్న నమ్మకాన్ని వదలుకున్నాం. అవినీతికేరోజులు. ధనసంపాదనలో నీతి, అవినీతి అనే విచక్షణ పనికిరాదు,'' అనే స్థితికి దిగజారిపోయాం ఇలా వుంటూ మళ్ళీ దేవుళ్లు కావాలి దేవాలయాలూ కావాలి ! ఇది సన్మార్గుల లక్షణం కాదు, దుర్మార్గుల లక్షణమే అని సాయి దివ్యచరిత్ర, సందేశాలూ చదివితే తెలుస్తుంది

భక్తి, శ్రద్ధ (శ్రద్ధ-ఓర్పు) అనే రెండు కాసులను దక్షిణగా అడిగి తీసుకొని అక్షయమైన సంపదలను అనుగ్రహిస్తారు సాయినాథులు కపర్దేగారు షిరిడీసాయి ప్రముఖ భక్తులలో ఒకరు. వారు అమరావతిలో వుంటూ లక్షలు గడిస్తున్న ప్రముఖ న్యాయవాది వారి సతీమణి సాయిబాబావారి పాదసేవనం చేస్తోంది, ఈమెకు 200 రూపాయలు యివ్వు' అన్నారు దీక్షిత్‌తో బాబా. కపర్దే గారికి బి పి పెరిగిపోయింది ' నేనేం కూటికి లేని ముష్టి వాణ్ని కాను కదా! ఒకరు వూరికే యిస్తే పుచ్చుకోవటం

నాకు అవమానం, అనే సహజ ధోరణిలో శ్రీ కపర్దే ప్రతిస్పందించారు. తర్వాత లోతుగా వితర్కించుకున్నారు 'నాకు డబ్బు వున్నది అని నేను ఎంతో అహంతో బ్రతుకుతూ వుంటాను నా గర్వాన్ని సమూలంగా సాయిబాబా తొలగించారు'' అని తెలుసుకోగలిగారు శ్రీ కపర్దే!

ఈరీతిగా లేనివారి లేమిని తొలగించటం కలవారిలో కలవనే గర్వాహంకారాలను నిర్మూలించటం అనేది ఆర్థికపరంగా సాయినాథుడు చేస్తున్న దివ్యలీల.

ఈనాడు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు సంకల్ప మాత్రం చేత కోటానుకోట్ల విలువగల నిధులతో లోక కళ్యాణార్థం ఎన్నెన్నో మహత్కార్యాలు చేస్తున్నారు. అటువంటి శ్రీ సత్యసాయినాథుని యెదుట 'నేను డబ్బు కలవాణ్ని' అనుకోగల అల్పబుద్ధులు ఈనాడు ఎవ్వరూ లేరు. ''స్వామీ! నా సంపదనుకూడా స్వీకరించండి, నన్ను కూడా మీ చేతిలో ఒక ఉపకరణగా గ్రహించండి,'' అంటూ ముకుళితహస్తాలతో, వినమిత శిరస్సులతో బాబావారి యెదుట అమెరికా, జపాన్ యూరప్ వంటి దేశ విదేశాలలోగల మిలియనీర్లు వరుసలో నిలబడుతున్నారు. లక్ష్మీదేవి శ్రీమన్నారాయణుని పాదసేవ చేస్తుంది అనటానికి యిదొక ప్రత్యక్ష నిదర్శనం కాదా! దైవ సాన్నిధ్యానికి, సేవకు వినియోగపడని సిరిసంపదలు మానవుని సర్వతోముఖ పతనానికే దారితీస్తాయి

''ఉన్నవి రెండే కులాలు ఒకటి డబ్బు కలవారి కులం రెండవది లేనివారి కులం,'' అనే రోజులు వచ్చాయి అటువంటి ఈ రోజులలో 'ఉన్నది ఒక్కటే కులం మానవత్వపు కులం" There is only one Caste The caste of humanity'' అంటూ మన అజ్ఞానాన్ని పారద్రోలుతున్నారు బాబా! కోటీశ్వరుని, నిరుపేదను,గవర్నరును గడ్డికోసుకొని బ్రతికే కూలీని సమానంగా చూస్తూ, వారిని ఒకరిప్రక్కన ఒకరిని నిలబెట్టి, యిరువురినీ మానవసేవలో భాగస్వాములుగా తీర్చిదిద్దుతున్నారు భగవాన్ బాబా! పోటీతో, స్పర్థతో, ద్వేషంతో కుట్రతో, రాజకీయంతో, నెత్తుటి మరకలతో సిరిసంపదలు మూటిపెట్టుకొనివున్న ఈ రోజుల్లో వాటికి అతీతంగా మనస్సును పెంచి కలవానిచేత, లేనివాని చేత కూడా ఈనాడు సమాజసేవ చేయించే ప్రేరణ వెనుక గల పరిమాద్భుతశక్తి భగవాన్ శ్రీ సత్యసాయి బాబా 'సామాజిక న్యాయం', 'ఆర్థిక విప్లవం' వంటి ఎన్నో ఉద్యమాల ద్వారా మానవాళికి సుఖశాంతులను అందించాలని విఫల ప్రయత్నాలు జరుగుతున్న రోజులు యివి. ఇటువంటి రోజులలో నిశ్శబ్దంగా ఆర్థికపరమైన వ్యక్తిగత సంస్కరణ తేవటం ద్వారా యిటు వ్యక్తి జీవితాన్ని అటు సమాజం యొక్క అస్తిత్వాన్ని సుఖశాంతులతో నింపి అభ్యుదయమార్గంలో నడిపించాలనే బాబావారి దివ్య సంకల్పం సఫలీకృతం అవుతోంది. డబ్బు లేకపోవటం ఒక శాపం కారాదు, అలాగే సంపద కలిగివుండటం పతనానికి కారణం కారాదు, అనే దివ్య సూత్రాన్ని భగవాన్ బాబావారు నిరూపించి చూపెడుతున్నారు.

''బంగారపు పాత్రలో విషం వుంది. మట్టిపాత్రలో అమృతం వుంది, నీకు ఏది కావాలి? బంగారు పాత్రపై వ్యామోహం చెందితే నీకు వినాశనం తప్పదు, అందులో విషం వున్నది, కాబట్టి! మట్టికుండ అని విచారించకు అందులో మధువు వున్నది దాన్నే స్వీకరించు'', అంటున్నారు భగవాన్ బాబా.

Pay, Promotion, Protection వంటి నినాదాలతో, పెరిగిపోతున్న కోరికలతో, పెచ్చుపెరిగిపోతున్న ధనదాహంతో బ్రతికే మన బ్రతుకులు విషంతో నిండిన బంగారపు పాత్రలే. వీటిని శాంతి అనే అమృతంతో నిండిన మట్టిపాత్రలుగా తయారుచేస్తున్నారు బాబా.

"I dont want money'' (నాకు ఈ డబ్బు వద్దు బాబూ!) అంటూ జుట్టు పీక్కుంటూ అమెరికాలో

( తరువాయి 36 వ పేజీలో )

# ఇంతకీ ఆ అపురూప సుందరి ఎవరు?

—పాలగుమ్మి జగన్నాథరావు

శ్రీమతి సీతామహాలక్ష్మి న్యాయవాది (Lawyer) గ మంచి పేరు తెచ్చుకుని వైట్‌ఫీల్డులో స్థిరపడింది. ఆమె భర్త శ్రీ సాంబశివరావు రిటైర్డు హైకోర్టు జడ్జి. జడ్జి పదవికి ఆమె పేరును కూడ ప్రతిపాదించగ, ఈ ఆహ్వానమును ఆమె తిరస్కరించింది. "భగవాన్ బాబావారి దివ్య సన్నిధిలో తప్ప మరెక్కడయినా శాంతి ఆనందం లభిస్తుందా? దైవచింతనలేని జీవితము వ్యర్థమే గద!" అనెడి దృఢ నమ్మకము గలది.

అసలు ఆమె శ్రీ సత్యసాయిబాబావారినెట్లు దర్శించ గల్గింది? తన ఏకైక పుత్రునకు పదకొండవఏట కాళ్ళకు పక్షవాత రోగం వచ్చి అవిటి వాడయినాడు. వివాహానంతరము ఆమె ప్రయివేటుగ 'లా' చదివి ప్లీడరు వృత్తిలో బాగా రాణించింది సంఘసేవలో కూడ చురుకుగ పాల్గొని తన భర్త పనిచేసిన ప్రతిచోట సేవా సంఘములను స్థాపించి ముఖ్యముగ అనాథ బాలలకు ఎంతగనో సేవ చేసింది

తన కుమారుడు జీవితంలో నడువలేడని డాక్టర్లు ధృవపరిచినారు మద్రాసులో మంచాన్ని అంటిపెట్టుకునియున్న తన కుమారునకు అనేకరకాల వైద్యం చేయించింది కాని ఏదీ ఫలించలేదు ఆమె దుస్థితిని గమనించి ఇద్దరు స్నేహితులు "ఎందుకు అంతగా బాధ పడతావు? రెండు చేతులా సంపాదిస్తున్నావు ఒక్కడే సంతానము. వాడికి ఏ లోటు రాకుండగ జీవితం గడచి పోతుంది" అని ఓదార్పడం మొదలుపెట్టారు.

ఈ విధమైన ఓదార్పుకు ఆమె తట్టుకోలేకపోయింది డబ్బుతోనే ఈ ప్రపంచములో అన్నీ సాధించవచ్చునవెడి వారి సలహాకు ఆమె ఉగ్రురాలయింది.

"ఓ దైవమా! ఎందుకు నాకు ఇట్టి శాపాన్ని కలుగ చేసినావు? నాకు తెలిసినంతవరకు అందరికీ మంచినే చేసినాను ముఖ్యంగ అనాధ పిల్లలకు ఎంతగనో సేవ చేసినాను ఎందుకు నా బిడ్డ అవిటివాడై మంచం పట్టినాడు:' అని నిరాశ నిస్పృహలతో ఆమె దైవాన్ని హృదయవేదనతో ప్రార్థించింది

ఒక్కసారి ధగధగ మెరిసెడి ఒక అందమయిన స్త్రీ సోఫాలో ఆమె ప్రక్కన కూర్చున్నది ఆ అపురూప సుందరి సొగసునకు సీతామహాలక్ష్మి ముగ్ధురాలయి ఆశ్చర్యంలో మునిగిపోయింది నోట మాట రాలేదు. 'అసలు నీవు ఎవరు? ఇక్కడకు ఎట్లు రాగలిగితివి?' అని కూడ అడుగలేకపోయింది ఆ లావణ్యవతి నవ్వుతూ మృదువుగ అతి చనువుగ 'సీతామహాలక్ష్మి! బాధపడకు, ఆదుర్దా వద్దు, సాయిబాబాను ప్రార్థించు, నీ కుమారుని పరిస్థితి అతిత్వరలో చక్కబడుతుంది' అని సలహా యిచ్చింది

ఇప్పటికే వంద దేవుళ్ళకు మొక్కుకున్నాను, ఇది చాలదన్నట్లు సాయిబాబా ఒకడా? నాకు అవసరంలేదు' అని సమాధానమిచ్చింది సీతామహాలక్ష్మి

'వయస్సులో ఉన్నావు, ఎంతో సంపాదిస్తున్నట్లు, ఎన్నో చేస్తున్నట్లు అనుకుంటున్నావు నా మాటలలో నమ్మకముంచి సాయిబాబాను ప్రార్థించు' అని చెప్పి ఆ వయ్యారిభామ అదృశ్యమయింది

సీతామహాలక్ష్మికి మతిపోయినట్లయింది చూస్తుండగనే అంత హఠాత్తుగ ఆమె ఎట్లా అదృశ్యమయింది?

మంచం మీద పడుకుని ఇదంతా చూస్తున్న ఆమె కుమారునికి కూడ అంతా చాల విచిత్రంగా ఉంది కాని తల్లికొడుకులు ఈ సంఘటనను గురించి ముచ్చటించుకోలేదు ఆ రాత్రి పడుకునేముందు అతడు తల్లిని పిలిచి 'అమ్మా! ఆవిడ చెప్పినట్లుగ సాయిబాబాను ప్రార్థించడంలో తప్పేముంది ' అని ప్రశ్నించాడు, ఆ రాత్రి వారిద్దరూ సాయిబాబాను ప్రార్థించి పడుకున్నారు

అర్థరాత్రివేళ ఒక పెద్ద చప్పుడును విని సీతామహాలక్ష్మి అదురుపాటుగ లేచి లైటు వేసింది, తన కొడుకు చాలా ఉద్రేకంతో 'అమ్మా! నన్ను లేవదీసి కూర్చోబెట్టు. నేను నడవాలి" అని అరుస్తున్నాడు వాడి విపరీతమయిన ఈ కోరికకు ఆమె ఆశ్చర్యపడి 'పెళ్ళి పడుకో, ఈ సమయంలో నడవడం ఏమిటి? క్రింద పడ్డావంటే లేవదీసేవారు కూడా ఎవ్వరూ లేరు' అని సముదాయించడానికి ప్రయత్నించింది కాని ఆ అబ్బాయి పట్టు విడువలేదు. ఏమయినాసరే నడచి తీరాలన్నాడు

'నీ కాళ్ళు ఎలా ఉన్నాయి ఏమిటి?' అని ఆమె ప్రశ్నించింది

'ఇన్నాళ్ళు గాలి తీసివేసిన టైర్లలాగ ఉన్నాయి ఇప్పుడు పూర్తిగ గాలితో నిండిన వాటివలె ఉన్నాయి కాళ్ళలోకి విద్యుత్తు ప్రవహిస్తున్నట్లుగా ఉంది అమ్మా! నేను నడుస్తాను' అని ప్రాధేయపడ్డాడు

సీతామహాలక్ష్మి నెమ్మదిగా వానిని లేవదీసి నేలమీద నిలబెట్టింది. ఆ గదిలో ఒక మూల నుండి మరో మూలకు నడిచేస్తున్నాడు జోళ్లు వెతుక్కొని ధరించాడు సీతామహాలక్ష్మి తన కళ్ళను తానే నమ్మలేక వింతగా చూస్తోంది.

కొన్ని సంవత్సరాలనుండి మంచాన పడియున్న తన కొడుకులో ఒక్కసారిగ ఇంత మార్పు ఎలా వచ్చింది? వైద్యం చేసిన ప్రతీ డాక్టరు, వాడికి నడక రావడం జరగని పని అని చెప్పారు గదా తెల్లవారు ఝామున నాలుగు గంటలయింది. వీధిలోనికి తీసికొని

# నాలుగు శత్రువులు

అహంకారము, క్రోధము, కామము, లోభము - ఈ నాల్గు శత్రువులను దూరం చేసుకున్నప్పుడే మానవుడు సుఖశాంతులను పొందగలడు. అహంకారం మానవుని అధఃపతనము గావిస్తుంది. ఇదే మానవుని ప్రధాన శత్రువు. మానవునిలో అహంకారం ఉండినంత వరకు, ఇతరుల నుండి దెబ్బలు భరించకతప్పదు. క్రోధము ఉన్నంతవరకు దుఃఖం తప్పదు. ఇది భయంకరమైన అగ్నిజ్వాల వంటిది. అందు వలననే దీనికి "క్రోధాగ్ని" అని పేరు. క్రోధము కల్గినవానికి ఏ పనీ ఫలించదు. ఉన్న గౌరవము కూడా దగ్ధమైపోతుంది. మానవుని మూడవ శత్రువు కోరిక. ఇది మానవునియందు నఖశిఖ పర్యంతం వ్యాపించి ఉంటుంది. ఒక్క కోరిక తీరిన తక్షణమే పది కోరికలు అభివృద్ధి అవుతుంటాయి ఏనాడు మానవుడు కోరికలను అదుపులో పెట్టుకోగలుగుతాడో, ఆనాడే సర్వ సంకల్పములూ సిద్ధిస్తాయి, సర్వసంపదలూ చేకూరుతాయి. నాల్గవది లోభము. లోభత్వము కల్గినవానికి శారీరక, మానసిక, ఆధ్యాత్మిక సుఖములన్నీ దూరమైపోతాయి, లోభి తాను భుజించడు, పరులకు అందించడు, కలలో కూడా లోభికి సుఖము ఉండదు. కనుక ఈ నాలుగూ మానవునియందు ఉండవలసినవి కావు.

- బాబా

వెళ్ళమని గొడవచేశాడు. మైలాపూర్ పార్కువద్దకు తీసికొని వెళ్లింది ఆమె.

'ఎవ్వరూ ఊహించనిది. వానిలో మార్పును వైద్యులే నమ్మలేకపోయారు' అంది సీతామహాలక్ష్మి

తన కుమారునిలో ఇట్టి అద్భుత మార్పు వచ్చిన తర్వాత ఆమె ఒక రోజున మద్రాసులో ఒకరిని 'సాయిబాబా ఎవరు?' అని ప్రశ్నించింది మహారాష్ట్రలో షిరిడీ అనే గ్రామములో షిరిడీ సాయిబాబా సమాధి మందిరం ఉందని అక్కడికి భక్తులు వెడుతూ ఉంటారని తెలిసికొన్నది కొద్ది రోజుల తర్వాత ఆమె కుటుంబ సభ్యులందరూ షిర్డి ప్రయాణమయ్యారు

వారు షిరిడీ చేరునప్పటికి సాయంత్రమయినది, గుడికి దగ్గరగా ఒక గదిలో బస చేసిరి. కాస్సేపటికి సుమారు ఇరువది సంవత్సరముల వయస్సుగల ఒక యువకుడు అక్కడకు వచ్చి 'సీతామహాలక్ష్మి ! లేచి కూర్చో, తీర్థంయిస్తాను' అన్నాడు క్రొత్త ప్రదేశంలో అపరిచిత వ్యక్తి వద్దనుండి ఏదయినా తీసుకొనుటకు ఆమె అంగీకరించలేదు. వెంటనే అతడు 'ప్రతి ఒక్కరు సీతామహాలక్ష్మి చాలా ఆరోగ్యంగా ఉందని అనుకుంటున్నారు, కాని ఆమెకు ఒళ్ళంతా నొప్పులే ! లే, లేచి తీర్థం త్రాగు' అని గర్జించాడు అతడు చెప్పినది నిజమే. కొడుకుతో పడిన బాధలకు ఆమె అలిసిపోయి స్పృహ తప్పే స్థితికి వచ్చింది. ఆమె లేవలేకపోయింది. భర్త, కొడుకు సాయంతో లేచి కూర్చొని చేయిజాపింది అహా ! అది కేవలం తీర్థంకాదు, అమృతమే ! తీర్థం త్రాగిన తర్వాత చూస్తే ఆ యువకుడు అదృశ్యమయినాడు.

షిర్డి దర్శనానంతరం మద్రాసు చేరిన కొద్ది రోజులకు ఆమెకు కలలో ఒకామె కనబడి చేయి పట్టుకొని ఒక ప్రదేశానికి తీసికొనివెళ్లింది. అక్కడ ధగధగ మెరిసెడి కొండమీద తేజస్సుతో నిండిన ఒక యువకుడు నిలబడి యున్నాడు

ఆ మర్నాడు ఆమె, ఆమె కుమారుడు శ్రీమతి హనుమంతరావు ఆహ్వానముపై మొట్టమొదటిసారిగ యింటికి వెళ్లిరి. గుమ్మంలో అడుగు పెట్టగానే ఆ ప్రదేశమంతా బాగా పరిచయమున్నట్లుగ ఆమెకు అనిపించింది. అప్పటికి ఇరువది సంవత్సరములు వయస్సు గల శ్రీ సత్యసాయిబాబా నవ్వుతూ మేడ మెట్లపై నిలబడి యున్నారు ఆమెకు కలలో కనబడిన వ్యక్తి కూడా సరిగ్గా అట్లాగే ఉన్నాడు. 'అవును, నిన్న రాత్రి నీకు కలలో కనబడ్డానుగదా!' ఆమెకు అంటూ ఆమె అబ్బాయికి ప్రసాదాన్ని అనుగ్రహించారు

ఇన్ని అద్భుతాలు జరిగినా తన బిడ్డ అత్యద్భుత చికిత్స పొందినా సీతామహాలక్ష్మి సుమారు పదహారు సంవత్సరాలపాటు బాబావారిని పూర్తిగ మరచిపోయింది. ప్లీడరు వృత్తి ఒత్తిడులు తదితర కార్యక్రమాల మూలాన ఊపిరాడక స్వామి మాటే గుర్తుకు రాలేదు. అంతేకాదు. ఆమె చక్కని గృహిణి ఇంటిలో భర్తకు సేవచేస్తూ అబ్బాయి చదువు విషయము చూస్తూ షిర్డీ సాయి పూజ చేసుకుంటూ ఆఫీసు తదితర వ్యవహారాలను చక్కబెడుతూఉండేది అందుచేత ఆమెకు సుమారు పదహారు సంవత్సరాలపాటు స్వామిని చూడాలనే సంకల్పమే కలుగలేదు. ఆ తర్వాత ఒక రోజున హైదరాబాదు నగరంలో శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారి భార్య 'భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు సాక్షాత్తు భువిపై వెలసిన దైవమే' అని చెప్పగా బాబావారు జ్ఞప్తికి వచ్చారు

ఆ తర్వాత ఆమె, ఆమె అబ్బాయి బాబావారిని దర్శించుటకు వెళ్లిన వెంటనే స్వామి వారిని ఆహ్వానించి వారికి మొదటిసారిగ కలలో కనబడుట, ఇద్దరికీ ప్రసాదాన్ని ఇచ్చుట మొదలగు విషయాలను జ్ఞాపకంచేశారు. కుర్రవాని వీపును తట్టుతూ 'ఈ పదహారు సంవత్సరాలలో ఎంత ఎదిగిపోయేవురా' అనగానే ఇంతకాలమూ వృధాఅయినందులకు స్వామిని మరచినందులకు ఆమె మనస్సులో నొచ్చుకొని చాలా బాధపడింది.

అప్పటినుండి ఆమె తరచు పుట్టపర్తి వెడుతూ ఉండేది స్వామి ఆమెకు ఆమె బిడ్డకు అనేక ఆశీస్సులను అందచేస్తూ ఉండేవారు. ఆమె అదృష్టంకొలదీ

స్వామి అనేకమార్లు ఆమె ఇంటికి వచ్చి ఆ కుటుంబానికి పాదనమస్కారములను ప్రసాదిస్తూ వారిని కంటికి రెప్ప వలె కాపాడుతూ ఉండేవారు

ఆమె ఆఖరి చెల్లెలు వయస్సులో చిన్నదయినా కడుపులో క్యాన్సరు వ్యాధికి మూడు పెద్ద ఆపరేషన్లు చేయబడినవి ఇంతకన్నా క్లిష్టమయిన నాల్గవఆపరేషను అవసరమయినప్పటికి ఆమె విపత్కర పరిస్థితిని గమనించి ఏమీ ఉపయోగంలేదని వైద్యులు ఆపరేషను చేయుటకు ముందుకు రాకుండిరి

'స్వామీ ! మా పదిమంది సంతానంలో నేను పెద్ద దానిని. అది ఆఖరిది. పెద్దదానినైన నేను ఆరోగ్యంగా ఉండి బాగా చిన్నదయిన నా చెల్లెలు అట్టి గడ్డుస్థితిలో నుండుట న్యాయమా ? అవసరమయితే నా ఆయుస్సును కొంత తగ్గించి దానికిచ్చి ఆమెను ఆరోగ్యవంతురాలిని చేయండి' అని ప్రార్థిస్తూ ఆ రాత్రి నిద్రపోయింది

తెల్లవారుఝామున స్వామి ఆమెకు కలలో కనబడగా 'స్వామీ ! ఆమెకు ఆపరేషను చేయించి మీ ఆశీస్సుల ననుగ్రహించండి' అని వేడుకొంది ఆమె కోరికను మన్నించి స్వామి ఆమెకు అభయహస్తము చూపిరి షిర్డీసాయిబాబావలె రోగి మంచంమీద కూర్చుండిరి 'ఎవరు నువ్వు ? నా మంచం మీదకు ఎందుకు వచ్చినావు' అని ప్రశ్నించగ వాసన కొడుతున్న నీ శరీరాన్ని శుభ్రపరచడానికి వచ్చాను' అని సమాధాన మిచ్చిరి రోగికి ఎక్కడలేని ధైర్యం వచ్చింది. ఆపరేషను జయప్రదమగుట మరియు ఆమె త్వరత్వరగా కోలుకొనుటను చూచి డాక్టర్లు, నర్సులు కూడ వారి కళ్ళను వారే నమ్మలేకపోయారు

సీతామహాలక్ష్మి ఇప్పుడు మనమలనెత్తింది. 'ఈ విశ్వమంతా కేవలం భగవాన్ శ్రీ శ్రీ శ్రీ సత్యసాయి బాబావారి సంకల్పమాత్రముననే నడచుచున్నది. సర్వం శ్రీ సాయిమయం' అనెడి దృఢనమ్మకం గలది. 1976నుండి కూడ ఆమె కుటుంబ సభ్యులందరూ పుట్టపర్తి, వైట్ ఫీల్డులలో నివసించుటకు స్వామి అనుమతించిరి.

ఒకసారి ఆమె భర్తకు మూత్రంలో రక్తం పోతూ ఉండడం మూలాన బాగా నీర్సపడిపోయాడు. పరిస్థితి విషమించి అంత్యదశ సమీపించిందని గ్రహించారు. ఆపరేషను అత్యవసరం కాబట్టి వెంటనే ఆసుపత్రిలో చేర్చమని వైద్యులు సలహాయిచ్చిరి స్వామికి దూర మగుటకు ఇష్టంలేక సీతామహాలక్ష్మి స్వామిని హృదయ పూర్వకంగా ప్రార్థించింది. కుటుంబ సభ్యులందరికీ ఇంటర్వ్యూను ప్రసాదించి "శివ-సాయి" ఉంగరాన్ని సృష్టించి సాంబశివరావు వ్రేలికి తొడిగిరి

అంతే ఆ రోజుననే రక్తస్రావం ఆగిపోయింది. ఆ రోజునుండి అతనిలో ఆరోగ్యం పుంజుకుంది. స్వామి చెప్పిన ప్రకారం స్త్రీకి పతిసేవకు మించినది మరొకటి లేదనే నమ్మకం గలది సీతామహాలక్ష్మి ఆమె ఆమె భర్త కూడ బృందావనంలో జరిగెడి నగరసంకీర్తన, భజనలు, మరియు స్వామి ఉపన్యాసాలలో విడువక పాల్గొంటారు స్వామియే వారికి మూలాధారము.

'నిత్యమూ పూజ, ధ్యానము చేతువా' యన్న ప్రశ్నకు 'సదా నాలో ఉండెడి దైవాన్ని పూజయని, ధ్యానమని కొద్ది గంటలు మాత్రమే ఎట్లు బంధింతును' అంటుంది సీతామహాలక్ష్మి ○

( 31 వ పేజీ తరువాయి )

శ్రీ రాబర్ట్ బోజానీ అనే ఒక ప్రముఖ వ్యాపారస్థుడు, డబ్బుతో విసిగి, డబ్బు కోసం పడే పాట్లతో విసిగి, తన ఏకాంత మందిరంలో బిగ్గరగా అరిచారుట. '' Yes, you will have peace since you don t want money '' ( అవును, డబ్బు అక్కర్లేదు అన్నావు కాబట్టి నీకు శాంతిని అనుగ్రహిస్తున్నాను) అని ఒక అపరిచిత కంఠం అభయమిచ్చిందిట అది గురువారం. ఆ రాత్రే ఒక మహాపురుషుడు వారి కలలో దర్శనమిచ్చారు 'నా దగ్గరకు రా, శాంతిని యిస్తాను', అని పిలిచారు తర్వాత ఆ కలలో కనిపించినవారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారేనని తెలుసుకొన్న శ్రీ రాబర్ట్ బొజానీ ప్రశాంతినిలయం వచ్చి, ధనకాంక్షను వీడి సాధన కాంక్షను స్వీకరించారు

డబ్బు యొక్క ప్రాధాన్యత లేదని ఎవ్వరూ చెప్పరు అలా చెప్పటం సబబు కాదు మన మనస్సులను డబ్బు ధ్యాసతోనే ఎప్పుడూ నింపటం, డబ్బుకోసం మానవత్వాన్ని కూడా అమ్ముకోవటం తగని పనే ఈనాడు ఈరీతిగా భగవాన్ బాబా వ్యక్తిగత జీవితాల్లో ఆర్థిక విలువలను పోషిస్తున్నారు. ○

# యోగక్షేమం వహామ్యహమ్

— ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్య

అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడు, సంకల్పమాత్ర సృష్టి స్థితి లయకరణదక్షుడు అయిన పరబ్రహ్మ, ఆపద్బాంధవుడై ఆర్తజనరక్షణ దీక్షాపరతంత్రుడై జీవకోటిని అనుగ్రహించదలచి, దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసి ధర్మాన్ని సంస్థాపించే సంకల్పంతో అవతారాలను స్వీకరిస్తాడు. దుష్టులను శిక్షించడానికిగాని శిష్టులను రక్షించడానికిగాని భగవంతుడు నామరూపాలను ధరించి అవతరించాల్సిన అవసరంలేదు. సంకల్పమాత్రంచేతనే దుష్టులను శిక్షించగలడు, శిష్టులను రక్షించగలడు. కాని ధర్మ సంస్థాపనం చేయాలంటే తప్పనిసరిగా నామరూపాలను ధరించి, తాను ధర్మాన్ని ఆచరించి లోకంలో ఒక ఆదర్శాన్ని నిలబెట్టి నిదర్శనంగా అవతారాన్ని ప్రకటించవలసి ఉంటుంది. అందుకే ప్రతి అవతారం కొన్ని లక్ష్యాలతో ఏర్పడి ఆ అవతార కార్యక్రమాన్ని నిర్వహిస్తూ ఉంటుంది.

## వాళ్ళ జన్మ నిరర్థకం

సత్య ధర్మాలను త్రేతాయుగంలో సుస్థాపించిన భగవాన్ శ్రీరామచంద్రుడు, శాంతి ప్రేమలను ద్వాపర యుగంలో చక్కదిద్దిన భగవాన్ శ్రీకృష్ణుడే, సత్య ధర్మ శాంతి ప్రేమలను నాల్గింటిని కలియుగంలో తన దివ్య లీలావిలాసాలతో భూలోకమంతా వ్యవస్థాపనం చేస్తున్న భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగా అవతరించారు. ఈనాడు బాబా సందేశం అందుకోని దేశం భూగోళంలో లేనే లేదంటే అతిశయోక్తి కాదు. తన అవతారంలో ప్రతి క్షణం మానవజాతి యోగక్షేమాలకోసం వినియోగిస్తున్న దివ్యావతారం మన కళ్ళముందు కదలాడుతున్నది. నడచి నడచి వచ్చి తన దివ్య సందర్శన భాగ్యాన్ననుగ్రహించి మన ఆర్తిని పోగొట్టి మనల్ని కంటికి రెప్పలాగా కాపాడుతున్నది ఒక్కసారి ఆ త్రిభువన సుందరమూర్తి దివ్య దర్శన భాగ్యం లభిస్తే చాలు ఆ జీవి ఎంతో ధన్యమౌతుంది శ్రీరామచంద్రుని ఒక్కసారైనా దర్శించని వానికంటే, ఆయన దృష్టిలో ఒక్కసారైనా పడని వానికంటే ఈ లోకంలో దురదృష్టవంతుడింకొక్కడు లేడని మహర్షి వాల్మీకి మహితోపదేశం చేశాడు ఆనాడు. ఈనాడు సర్వవిలక్షణమైన అవతారాన్ని ధరించి సర్వమానవ సంక్షేమంకోసం అటు ఆధ్యాత్మికోపదేశాలను అందిస్తూ ఇటు సామాన్య జనుల ఉచిత విద్యా-వైద్య-సమాజాభ్యుదయ కార్యక్రమాలతో ఆదుకొంటూ 'న భూతో న భవిష్యతి' అన్న రీతిలో ప్రకాశిస్తున్న భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారిని దర్శించనివాడుగాని, వారి అపాంగ వీక్షణాన్ని అందుకోలేని వాడుగాని, నిజంగా నిరర్థకమైన జన్మగలవాడని, గొప్ప దురదృష్టవంతుడని చెప్పక తప్పదు. అందుకే ఇలా అంటాను -

> యం చ సాయిం న పశ్యేత్తు
> యః పశ్యతి న సాయినమ్ ।
> తౌ ఉభౌ నిన్దితౌ లోకే
> తయోర్జన్మ నిరర్థకమ్ ॥

ఎవరిని బాబా చూడడో, ఎవరు బాబాను దర్శించలేరో వారిద్దఱు లోకంలో నిజంగా నిందితులు వాళ్ళిద్దఱి జన్మ నిష్ప్రయోజనం.

## మీ యోగక్షేమాలు నేనే చూస్తాను

భగవంతుడు భక్తుల యోగక్షేమాలను తనే నిర్వహిస్తానని ఇలా ప్రతిజ్ఞ చేసి చెబుతున్నాడు -

అనన్యాశ్చిన్తయన్తో మాం
యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహామ్యహమ్॥

అనన్య భక్తితో ''నీవే తప్ప నితః పరంబెరుగ'' నని ఎవరు ఆ స్వామినే ఉపాసన చేస్తారో నిత్యాభియుక్తులైన అటువంటి భక్తుల యోగక్షేమాలను తానే తప్పక విచారిస్తానని ప్రతిజ్ఞ చేసి చెబుతున్నాడు భగవంతుడు ద్వాపరయుగంలో భగవాన్ బాబా శ్రీ కృష్ణావతారంలో ఇచ్చిన మాటను ఈనాటికి అక్షర సత్యంగా నిలబెట్టుకుంటున్నారు అంతేకాదు ఇంకా ఒక అడుగు ముందుకేసి ''నీవు నావైపు పది అడుగులు వస్తే చాలు నేను నీవైపు వంద అడుగులు నడచి వస్తానని'' పూర్వావతారాలన్నింటి కంటే తన సౌలభ్యాన్ని తెలియజేస్తున్నారు.

## యోగక్షేమాలంటే ఏమిటి ?

యోగ మంటే ఇంతకు ముందు మనకు లేనిదాన్ని కొత్తగా అనుగ్రహించడం క్షేమ మంటే ఇచ్చినదాన్ని కాపాడటం ఆదిశంకరుల వాక్యాలలో యోగక్షేమాల స్వరూపం పరిశీలించండి-

"యోగః అప్రాప్తస్య ప్రాపణం, క్షేమః తద్రక్షణమ్"

యోగక్షేమాలు ఈ లోకంలో మనం అనుభవించే అశాశ్వత విషయాలకు సంబంధించినవే కాక శాశ్వతమైన భగవత్ప్రాప్తి-అపునరావృత్తులు కూడా అవుతాయని భగవద్రామానుజు లిలా వివరిస్తున్నారు-

"మత్ప్రాప్తి లక్షణం యోగం, అపునరావృత్తి రూపం క్షేమంచ"

భగవంతుడు మనకు సుప్రసన్నుడై లభించడం యోగం మరల వెనుకకు తిరిగిరాని శాశ్వతమైన ప్రాప్తి క్షేమం అని దాని భావం

## ఎప్పుడు మనల్ని పట్టించుకుంటాడు ?

మన యోగ క్షేమాలను భగవంతుడు పట్టించుకోవాలంటే మనలో అనన్యత్వం ఉండాలి అనన్యత్వమంటే భగవంతుడు తప్ప ఇతర ప్రయోజనం లేక పోవటం, భగవత్సేవ దప్ప ఇంకొక ప్రయోజనం ఆశించని ప్రసన్నులకు, భగవచ్చింతన లేకుండా జీవించి ఉండలేక అహర్నిశలు భగవన్నామ స్మరణంచేసే మహాత్ములకు, నిరంతరం భగవంతునితో సంబంధాన్ని కోరేవాళ్ళకు ఏలోటు రాకుండా వారి యోగక్షేమాలను భగవంతుడెప్పుడూ నిర్వహిస్తాడు మనలో ఇలాంటి లక్షణాలు ఒకటి కూడా లేకుండా దేవుడు నన్ను రక్షించ లేదని ఆయనను నిందిస్తే ఏం ప్రయోజనం ? అనన్య భక్తితో బాబాను నమ్మి బాబానామ స్మరణం చేస్తూ తన జీవితమంతా బాబా సేవకు అంకితంచేసే భక్తుల యోగ క్షేమాలను ఆయన ఎన్నటికి పట్టించుకోకుండా ఉండడు. "న మే భక్తః ప్రణశ్యతి" అని కదా ! ఆయన ప్రతిజ్ఞ.

అనన్య భక్తి స్వరూపం బాబా ఇలా బోధిస్తున్నారు- గమనించండి - ''మన సర్వస్వము భగవంతునికి అర్పితం గావించి, తన ప్రేమానందము కోరటమే ప్రధానమైన మార్గము. ఒక చిన్న ఉదాహరణము- ఒక కన్యకు పెండ్లైన తక్షణమే తన సర్వస్వముగా భావించిన సర్వంకూడను, కని పెంచి పెద్దచేసిన తల్లిని, పోషించి అభివృద్ధిచేసి కల్యాణం గావించిన తల్లిని, తోడ బుట్టిన అక్కచెల్లెండ్రను, అన్నతమ్ములను విసర్జించి ఒక నూతనమైన వ్యక్తితో, సంపూర్ణ విశ్వాసముతో అతని వెంట పోతుంది. తన ఇంటియందున్న భోగభాగ్యములను ఏమాత్రం తాను ఆశించదు, అదే విధముగనే తన మనస్సుయొక్క తత్త్వం భగవంతునికి అర్పితం గావించిన తరువాత తన మనస్సు, తన ధనము, తన భావము, తన ప్రేమ సర్వము భగవంతునికి అర్పితమై పోతుంది, అదియే నిజమైన అనన్య భక్తి ''—సనాతన సారధి పు. 88, ఏప్రియల్ 1989.

## మన కర్తవ్యం ఏమిటి ?

అహంకార మమకారాలను వదిలి ''నీవే నాకు దిక్కు, నన్ను బ్రోచేవారింకెవరూ లేరని'' సంపూర్ణ శరణాగతి, చేసి తననే ఆశ్రయించి ఉన్న తన భక్తుల యోగక్షేమాలను ఎలాంటి పరిస్థితుల్లోను బాబా వదలిపెట్టరు కనుక మనసా, వాచా, కర్మణా శరణాగతిచేసి, మన రక్షణ భారాన్ని ఆయనపైపెట్టి ప్రశాంతంగా ఆయన సేవలో జీవితాన్ని ధన్యం చేసుకోవడం మనకందరకు అవశ్య కర్తవ్యం

పుట్టపర్తి పురీరమ్య
నివాసాయ విలాసినే,
సత్యసాయీశ్వరాయాఽస్తు
నిత్యశ్రీర్నిత్య మంగళమ్



# భగవంతుడు భారతావనిలో అవతరించాడు

— ఆర్. కె. కరంజియా

( అనువాదము : డా॥ రాపర్ల జనార్ధనరావు )

(గత సంచిక తరువాయి)

## ప్రేమ దైవత్వానికి చిహ్నం

ప్రశ్న : విభూతి, చిన్ని చిన్ని వస్తువుల్ని మీరు సృష్టించి ప్రజలకు కానుకలుగ ఇస్తూ ఉంటారు. దీని ఉద్దేశ్యం ఏమిటి ? ఇంద్రజాలికుడు చేసే మ్యాజిక్కు పనిలాగున దైవరూపియైన మీరు చేయవలసిన అగత్యమేమి ?

బాబా : నాకు సంబంధించినంతవరకు, ఇది నా దైవత్వమునకు ఒక నిరూపణ. దైవత్వానికి ఋజువులు కానే కాదు మ్యాజిక్కులన్నియు ధనసేకరణకోసం చేస్తూ ఉండటం మీకు తెలిసిన విషయమే అవి పొట్ట పోసుకునేందుకు చేసే పనులు. అవి అన్ని ఒకరకమైన మోసపు పనులు. చేతులు తెలివిగా త్రిప్పుతూ వస్తువుల్ని ఒకచోట నుండి ఇంకొకచోటకు ఇతరులకు తెలియకుండా మార్చటం మొదలైన మోసాలు చేస్తూ ఉంటారు ఈ పనులు చేయటానికి సిద్ధులు గాని. మహిమలు గాని అవసరం లేదు.

నేను చేసేవి ఒక భిన్నమైన సృష్టి క్రియ అది మ్యాజిక్కు గాని, అద్భుతం గాని కాదు. ఒక్క విషయం నేను ప్రతిఫలం ఆపేక్షింపను, ఇంకొక విషయం, నేను వస్తువులను ఒకచోట నుండి వేరొక చోటకు మార్చను, నేను వస్తువులను సృష్టిస్తాను. ఇంకా ఏమిటంటే, నేను ఈ క్రియలను నా దైవశక్తి ప్రకటనలుగ ఉపయోగించను ఇది ప్రజలపై నాకు గల ప్రేమను నమ్మింపచేసేందుకు మాత్రమే అది నా విజిటింగ్ కార్డు, వారలకు విశ్వాసము చేకూర్చి, వారిని భక్తులుగ చేయుటయే నా ఉద్దేశ్యము. ప్రేమకు రూపం లేదుకదా ! అందువలననే నా ప్రేమను చూపించేందుకు ఈ వస్తు సృష్టి చేస్తూ ఉంటాను

ప్రశ్న : ఏమోనండి, నాకు ఇప్పటికీ మీరు ఉంగరాలు, గాజులు, గడియారాలు చిన్ని చిన్ని వస్తువులను ఎందుకు సృష్టించి ఇస్తున్నారో అర్థం కావటం లేదు.

బాబా : చాలామంది నన్ను నా అభయాన్ని సూచించే తాయెత్తు లేదా రక్షరేకు అడుగుతూ ఉంటారు అందుకని వానికి నేను అలాంటివి ఇస్తూఉంటాను వారు ఏదైనా కష్టాలలో ఉంటే నేనిచ్చిన ఉంగరం, గాజు, గడియారం లాంటి వానిని గట్టిగా స్పృశించి నన్ను రక్షణకై పిలుస్తారు నన్ను స్మరిస్తారు. నేను రక్షిస్తానని నమ్ముతారు. అలా చిన్నవి కాకుండా, వారు ధరించలేనివి మరేమైనా ఇస్తే వాటిని ఎక్కడో దాచి మరచిపోవచ్చు.

ముఖ్యమైన విషయమేమిటంటే, ఈ చిన్ని వస్తువులు తాయెత్తులు, రక్షరేకులు అనండి, మరేమైనా అనండి, ప్రజలకు ఒక విధమైన విశ్వాసం, రక్షణ సమకూర్చు క్లిష్టసమయాల్లో ఎంతెంతో దూరాలలో ఉన్న నా భక్తులకూ నాకూ ఇవి ఒక అనుబంధాన్ని ఏర్పరచుతాయి. నా భక్తులు నన్ను పిలవగానే నేనిచ్చిన ఈ వస్తువులు నాకు మెరుపు సందేశాన్ని పంపుతాయి ఆ సందేశం నాకు చేరిన వెంటనే నేను వారికి రక్షణపంపుతాను

ప్రశ్న : నేను అదేపనిగా అడుగుతున్నానేమో మన్నించండి స్వామీ ! కాని ' హెచ్. యమ్ టి ', 'ఒమేగా' కంపెనీ వాచీలను మీరు సృష్టించి ఇవ్వటం, ఆ కంపెనీలు లేదా వారి శాఖల పేటెంటు హక్కుల్ని ఉల్లంఘించటం కాదా ?

బాబా : మీకు ముఖ్యంగా చెబుతున్నాను ఏ కంపెనీని మోసం చేయటంగాని లేదా పేటెంటు హక్కులను ఉల్లంఘించటంగాని చేయటం జరగదు వాచీలను ఒక చోట నుండి వేరొక చోటుకు మార్చటం గాని నేనేమీ చేయటం లేదు నేను వాచీలను సంపూర్ణంగా సృష్టింప గలను నేనేది సంకల్పిస్తే అది సృష్టింపబడుతుంది. అయినా ఏ కంపెనీ ఇంతవరకూ పేటెంటు హక్కుల్ని భంగపరుస్తున్నట్లు ఫిర్యాదు చేయలేదు

## విభూది యందలి ఉద్దేశ్యము

ప్రశ్న : మీరు సృష్టించి ఇచ్చే విభూతి గురించి ఏమంటారు ? దీని అంతరార్థమేమిటో తెలుసుకోవాలని ఉంది. కారణం మిమ్మల్ని విమర్శించేవారు మిమ్మల్ని అపనిందలపాలు చేయటానికి మాజిక్ చేసే ఇంద్రజాలి కుల్ని సరిగా ఇలాగే విభూతి సృష్టించే కార్యక్రమాలు ఎల్లెడలా ప్రదర్శింపచేస్తున్నారు.

బాబా : నేను సృష్టించేది దైవ శక్తి నుండి. అది ఎంతో ప్రాధాన్యత గల్గినది దానిలో ఎంతో అంతరార్థం ఉంది. అది విశ్వ రూపం, అమరత్వం, అనంతత్వం కల్గిన దైవ శక్తి చిహ్నం కల్గినది అది కేవలం సూక్ష్మరూపమైన ఆత్మ తత్వం కల్గినది ప్రాపంచిక రూపాలన్నీ భస్మీపటలం చేసి చివరకు మిగిలేదానిని సూచిస్తుంది (విభూతి)

మీకు నేను కోర్కెలు లేని జీవిత విధానాన్ని దాని అవసరం గూర్చి తెల్పి ఉన్నాను. శివుడు కామాన్ని (కోర్కెల్ని) భస్మంచేసి ఆ భస్మాన్ని శరీరం నిండా పులుముకున్నాడు తన కామముపై విజయాన్ని ఆ రూపముగా, ఆ విధంగా చాటుకున్నాడు వాంఛలు నశిస్తే ప్రేమ విజయం పొందుతుంది ప్రేమ విజ యాన్ని చాటుతుంది. భస్మం (విభూతి) దాని అంతరార్థం అది.

మొదటగా భస్మం మానవుని జనన మరణాల్ని సూచిస్తుంది. మానవుడు మట్టి నుండి జనించి మట్టిలో కలవవలసిందేననే నిత్యసత్య సిద్ధాంతాన్ని చాటుతుంది భస్మం చిట్టచివరి స్వరూపం అంతకు మించిన స్వరూపం లేదు విభూతి ధారణ చేసుకున్నవానికి అది కోర్కెలను విడిచి, కామవాంఛలన్నిటిని దహింపచేసి, వ్యామోహాలను ఎదిర్చి నిలబడి, భగవత్పూజ అనే హోమం నుండి (కాయా,వాచా, మనసా) త్రికరణశుద్ధి కలవాడవు కమ్మని (విభూతి) బోధిస్తుంది.

ఈ ముఖ్యమైన గుణపాఠాన్ని ఎల్లరూ అర్థం చేసు కొని జీవించాలని నేను విభూతిని సృష్టించి చేస్తూ ఉంటాను నావద్దకు చేరినవారి కందరకు ఇతర కానుకలను అందచేసినవి ఎలా వారికి రక్షరేకు వలె పని చేయునో అటులే విభూతి కూడా నా భక్తులకు, వ్యాధి గ్రస్తులైనవారికి, బాధలలో ఉన్నవారికి రక్షణ కల్గ జేస్తుంది. అది దైవ చిహ్నం. మీరు చెప్పిన ఇంద్ర జాలికులు వెలికి తీసే విభూతితో ఎంతమాత్రం సంబంధం లేనిది (సశేషం)

## ఓంకారము

ఆశ పెద్ద నది వంటిది. కోరికలు నీరు. ఊహాలే అలలు. కాంక్షలు మొసళ్ళు. భ్రాంతులు సుడిగుండాలు. ఈ భయంకరమైన నదిని దాటే సాహసం. ధైర్యం ఒక్క యోగికే ఉంది. అందుకే పతంజలి "యోగః చిత్త వృత్తి నిరోధః" అన్నారు. సామాన్యంగా నదులు పెరగటం, తరగటం, ఎండిపోవటం జరుగుతుంటాయి. కాని ఈ జీవనదికి కోరికలు నీరుగా ఉండటంచేత నీరు పెరుగుతుందేకాని తరగదు. ఈ నదియొక్క అంతు కనుగొనటం కష్టం. ఈ నదిలో జలం నిరంతరం నిండుగా వుంటుంది. అందులో ఊహాలు అనే గాలి తరంగాలు అమితం. ఈ నదిని ఓంకారమనే నావను ఆధారం చేసుకొని దాటవచ్చును. ఈ ప్రణవం అతి శక్తివంతం, "ఓం" సర్వ మతాలసారం, సమస్త శాస్త్రాలకు మూలం, సర్వ ధర్మాలకు ఇదియే కీలకమైనది. - బాబా

# పరిపూర్ణ పూర్ణ శరణాగతి పొందినవాడు బలిచక్రవర్తి

—భగవాన్ సాయి దివ్యబోధ

" తిలమధ్యే యదా తైలం
క్షీర మధ్యే యదా ఘృతం
పుష్పమధ్యే యదా గంధం
ఫలమధ్యే యదా రసం
కాష్ఠాగ్నివత్ ప్రకాశేన
తల్లింగం అచలం ప్రభో ! "

ప్రేమస్వరూపులారా !

నువ్వులయందు నూనె సర్వత్రా నిండియున్నది. పాలలోని ప్రతి బిందువునందునూ నెయ్యి వ్యాపించి యున్నది. పుష్పములందు అవ్యక్తంగా, అగోచరంగా సుగంధం వెలువడుతున్నది ఫలమునందు మధురమైన రసము నిండియున్నది. ప్రతి కర్రయందు కూడానూ అగ్ని అవ్యక్తంగా ప్రజ్వరిల్లుతూ ఉన్నది. అదే విధముగనే ఈ ప్రపంచమంతయుకూడనూ భగవంతుడు వ్యాపించి, అగోచరంగా తనయొక్క చర్యలను నిరూపిస్తూఉన్నాడు

దేవుడనగా ఏ దేశమునందో, ఏ దేహమునందో మాత్రమే ఉండేవాడుకాదు. కనులలో దృష్టి ఉండి నట్లుగా, చెవులలో శబ్దము ఉండినట్లుగా ప్రతి మానవుని మనసునందు చైతన్యస్వరూపుడై వుంటున్నాడు భగవంతుడు ఈ కనిపించేటటువంటి చరాచర ప్రపంచ మంతయూ కూడనూ భగవంతుని ప్రకాశముయొక్క ప్రభావమే. మానవుడు ఇంత సన్నిహితుడై వుండగా తన యొక్క దివ్యత్వాన్ని తాను గుర్తించుకొనలేక, అజ్ఞానంతో మానవుడు సర్వత్రా భగవంతుని వెదకటా నికి ప్రయత్నిస్తున్నాడు. ప్రతి మానవునియందునూ, మానసిక చైతన్యస్వరూపుడై సత్, చిత్, ఆనందంగా వెలుగుతూఉన్నాడు

ఆకాశమునందు ప్రకాశించేటటువంటి సూర్యుడు, నదీ జలమునందు, సముద్రజలమునందు, బావిజలమునందు, పాత్రజలమునందు కూడనూ ప్రతిబింబిస్తూవుంటాడు. కాని నదులు, సముద్రము, బావులు, పాత్రలు వేరువేరు అయినప్పటికినీ,సూర్యునియొక్క ప్రతిబింబముమాత్రం ఒక్కటే. పూసలయందు సూత్రము (దారము) ఏ విధంగా కనిపించని రీతిగ సంచరిస్తూ వున్నదో, అదే విధముగనే, ప్రతి మానవునియందునూ దైవత్వం సంచరిస్తునే ఉన్నది. ఈ ప్రపంచమంతయు కేవలం దైవముయొక్క ఆకారమే దైవము లేని ప్రపంచము కాని, దైవములేని పదార్థముగాని, దైవములేని మానవుడుకాని, ప్రాణికాని ఈ జగత్తులో కానరాదు. ఈ ప్రపంచమునందు, అనేక భాషలతో, రూపనామము లతో, మానవుడు భిన్న భిన్న స్వరూపములలో కపిపిస్తూ ఉండినప్పటికినీ ఈ మానవునకు, మానవత్వమనేటటు వంటి ఏకత్వము సర్వత్రా, సమత్వంగానే గోచరిస్తు న్నది. జాతి ఒక్కటే అదే మానవజాతి దైవము ఒక్కడే. అదే దివ్యత్వముతో కూడిన సత్, చిత్, ఆనందం. విత్తు మొలకెత్తి దానియొక్క ప్రభావము వలన పరిమళమయమైనటువంటి పుష్పముగ వికసించి నట్లుగా, భగవంతుని యొక్క దివ్యత్వమనేటటువంటి బీజము, మానవుని హృదయమునందు వికసించి సత్, చిత్, ఆనందమనేటటువంటి పుష్పముగా ప్రకాశిస్తున్నది

విత్తు మొలకెత్తటం ఎంత సహజమో, సచ్చిదానంద స్వరూపుడైన భగవంతుడు ప్రతి మానవునియందునూ ఆవిర్భవించడం అంత సహజం. మానవత్వంలో వుండినటువంటి దివ్యత్వాన్ని ప్రతి వ్యక్తి అర్థం చేసుకోవటానికి ఎంతైనా ఆధారాలున్నాయి. అయితే దీని యొక్క యదార్థమును గుర్తించటానికి, ఏ మానవుడూ పరిపూర్ణమైనటువంటి త్యాగమును చేయటంలేదు. ప్రాచీన ఋషులు మానవ జీవితమును పరిపూర్ణమైనటువంటి సుగంధంగా విశ్వసిస్తూ వచ్చారు. మానవజీవితం అతి మధురమైనదిగా భావిస్తూవచ్చారు. మానవుడు ఈ మాధుర్యాన్ని ఏనాడు కోల్పోతాడో, ఆనాడే మానవత్వమును కూడా కోల్పోతాడు. ఈ మానవత్వములోని మాధుర్యమే త్యాగము.

"త్యాగేనైక అమృతత్వ మానశుః" ఈ త్యాగము మానవత్వము దివ్యత్వాన్ని పొందగలుగుతున్నది. అయితే ఇట్టి సత్యమును మానవుడు గుర్తించుకోలేక పోతున్నాడు. నిరంతరం స్వార్థ స్వప్రయోజనముల యందే జీవితమును అంకితం గావించుకుంటున్నారు. ఈ త్యాగమునకు మరొక పేరు "బలి". ఈ పదము అనేక విధములైన అర్థములతో కూడిఉంటున్నది. అర్పితము, అంకితము, త్యాగము, సుంకము - అని దీనికి అర్థములు. ఈ సుంకము (TAX) అంటే ఏమిటి? మానవ జీవితముతో దైవమునకు అర్పితము గావించునటువంటిదే ఈ బలి. కాని మన ప్రాచీనులు 'బలి' అనగా ఒక ప్రాణమును అర్పితం గావించటమని భావిస్తూవచ్చారు. ఇదికాదు నిజమైన బలి. మానవత్వములో నున్న తన దివ్యత్వాన్ని దైవముగా విశ్వసించడమే ఒక 'బలి' ఎంతో దూరంలో ప్రవహిస్తున్న నదీ జలమును కార్పొరేషన్ లేక మున్సిపాలిటీవారు పైపుల ద్వారా మన ఇంటికి అందిస్తున్నారు. వారికి మనం Water Tax అని కడుతుంటాం. అదే విధముగా విద్యుచ్ఛక్తి శాఖవారు ఎక్కడనుంచో తెచ్చి కరెంటును మన ఇంటికి యిస్తున్నారు. వారికి కూడా Electricity



ఒక్కచో కూర్చుని విశ్వమంతయు బరికించు
విశ్వవిభుడు శ్రీ సాయీశ్వరుండు
ఒక్క మాటతోడ విశ్వాన్ని శాసించి
విశ్వశాంతిని నిల్పు విశ్వనాథుడు
శ్రీ సాయీశ్వరుండు
ఒక్కచూపు తోడ, భవ్య హర్మ్యాలు నెలకొల్పి
ఆరోగ్యమందించు అపర ధన్వంతరి
అవతార పురుషుండు శ్రీ సాయీశ్వరుండు
ఒక్క భావంబుతో, పెక్కు భాషలతోడ
భక్తుల నలరించు
భక్త బాంధవుండు శ్రీ సాయీశ్వరుండు

అట్టి సాయి- మన సాయి- శాంతి సాయి
గట్టి మాటల సాయి- విద్యా సాయి-
ఆరోగ్య సాయి
పొట్టి మాటలలోన, పొడుగు అర్థము కూర్చు
ప్రజ్ఞా సాయి అవతార సాయి
ఎట్టి జాగులేక పాదాలనందించి మముబ్రోవ,
మ్రొక్కెద శ్రీ సత్యసాయి

**- చౌడవరపు పురుషోత్తం**



Tax కడుతున్నాం. కుంభవర్షమును కురిపించి నదులను చెరువులు నింపిస్తూ పంటలు పండిస్తున్న భగవంతునికి ఏమి Tax కడుతున్నాం? మలయమారుతమును వీపించి మానవునికి కావల్సినంత ప్రాణవాయువును అందిస్తున్న భగవంతునికి ఏమి Tax కడుతున్నాం? యావత్ ప్రపంచమునకు దివ్యకాంతులనందిస్తున్న సూర్య భగవానునికి ఏమి Tax కడుతున్నాం? అదియేఅర్పితము అదియే Tax దానినే 'బలి' అన్నారు. తనను తాను అర్పితం గావించుకోవటమే 'బలి'. ఆ 'బలి' లో చక్రవర్తి అయినటువంటివాడు ఈ 'బలిచక్రవర్తి'.

బలిచక్రవర్తి, ప్రహ్లాదుని మనుమడు. తన జీవితమునే భగవంతునికి అర్పించాడు. ఇతడు దైవభక్తుడు, అంతేకాదు దానశీలుడు, ప్రజారంజితుడు, ఆడిన మాట తప్పెడువాడు కాదు. ఈ పవిత్రమైన గుణములు కలిగినటువంటివాడే బలిచక్రవర్తి, అసలు వీరి వంశములోనే ఉన్నది దైవభక్తి. దైవభక్తి బలి చక్రవర్తి గురువైన శుక్రాచార్యుడు ఎంత వలదని నివారించినప్పటికినీ, గురువాజ్ఞను ఉల్లంఘించి, దైవమునకు అర్పితమై పోయినాడు. బలిచక్రవర్తి "గురూజీ! భగవంతుడే దిగివచ్చి దేహీ! అని హస్తము చాచినప్పుడు ఇవ్వటం కంటె కలిగేటువంటి మహాభాగ్యం మరొకటి ఏమున్నది? ఇంతకంటే మహాభాగ్యం నాకు అక్కరలేదు. నా మనస్సును, నా శరీరమును నా సర్వస్వమును, చిట్టచివరికి నా ప్రాణమును కూడనూ దైవమునకు అర్పితం చేయడానికి నేను సంసిద్ధుడనై ఉన్నాను" అంటాడు బలిచక్రవర్తి.

ఏ ధనమో, ఏ ధాన్యమో, ఏ సంపదలో నాకు అర్పితం చేయమని కోరటం లేదు భగవంతుడు. పత్రమో, పుష్పమో, ఫలమో, తోయమో మాత్రమే అర్పితం చేయమంటున్నాడు భగవంతుడు. ఏమిటి ఇవి? పత్రమంటే బిల్వపత్రమో, మారేడు పత్రమో, తులసి పత్రమో కాదు. ఇవన్నీ వాడిపోయేవి ఎండిపోయేవి. పత్రము అంటే నీవు ధరించిన దేహమే, పుష్పము అంటే హృదయ పుష్పము, ఫలము అంటే మనో ఫలము, తోయము అంటే ఆనంద బాష్పములు భగవంతుడు కోరేవి ఇవే. జలమునకు సంస్కృతములో 'నారములు' అన్నారు. నారములు. నయనములు నారము + నయనము = నారాయణము. నారములనేటటువంటి జలమును నయనముల ద్వారా విడిచిపెట్టేటటువంటిదే 'నారాయణము' ఒక్క భగవంతునికి మాత్రమే కన్నుల ద్వారా ఈ జలమును వదలాలి కాని అన్యమునకు కాదు. అయితే శోకమునకు దూరంగా ఉండాలి. శోకమునకు దూరంగా ఉండాలంటే లోకమునకు దూరంగా ఉండాలి. లోక వాంఛలలో మునిగి శోకమునకు గురి కాకూడదు. దైవమే మన లోకము దైవమే మన ప్రాణము దైవమే మన జీవితము. దైవమే మన మాధుర్యము-ఇలాంటి భావములచేతనే బలిచక్రవర్తి వామనునికి తాను అర్పితం గావించుకున్నాడు.

అనేకమంది అనేకం అర్పితం చేస్తుంటారు. ఈ అర్పితములు కాదు ప్రధానం. తనకు తానే అర్పితం చేసుకోవటం-అదే గొప్ప అర్పితం. బలి ఆ విధంగా అర్పితం గావించుకున్నాడు. బలిచక్రవర్తి త్యాగమూర్తి. కనుకనే దైవాన్ని అంత ఆనందపరిచాడు. దైవానికి ఎట్టి వాంఛలూలేవు ఎట్టి ఆశలూ లేవు. కారణమేమిటి? అన్నీ తనయందే వుంటున్నప్పుడు ఇంకా ఆశలెందుకు? కనుక భగవంతుడు ఏది చేసినప్పటికినీ భక్తుల శ్రేయస్సు నిమిత్తమే చేస్తుంటాడు. సర్వశక్తిమయుడైన భగవంతుడు తన హృదయమునందే ఉండినప్పటికినీ, దానిని తాను మరచి ఏదో భగవంతుడు ఎక్కడో వుంటున్నాడని ఈనాటి మానవుడు పరుగులిడుతున్నాడు.

బలిచక్రవర్తి యొక్క లక్ష్యము త్యాగము. ఈ త్యాగమును గురించి చక్కగా కేరళ ప్రజలకు బోధించాడు. 'నాకు రాజ్యము అవసరంలేదు. ధనకనక వస్తువాహనాదులు అవసరంలేదు. దైవమే నా సన్నిధికి వచ్చి 'భిక్షాందేహి'! అంటున్నాడు. అలాంటి భగవంతునకు అందించడం కంటే గొప్ప భాగ్యం మరేమిటి? అట్టి విషయములందు గురువులనైనా ధిక్కరించవచ్చు. అన్నాడు. "మాతృదేవోభవ! పితృదేవోభవ! ఆచార్యదేవోభవ!" ఎంతో పవిత్రమైన తత్వాన్ని వేదం ప్రబోధిస్తూ వచ్చింది. అయితే భరతుడు రామచంద్రుని చేరే నిమిత్తమై తల్లినికూడా ధిక్కరించి అరణ్యంలో ప్రవేశించాడు. ప్రహ్లాదుడు నారాయణ తత్త్వమును పొందే నిమిత్తమై తండ్రి హిరణ్యకశిపుని త్యజిస్తూవచ్చాడు. నారాయణుని నమ్ముకున్నవాడు ప్రహ్లాదుడు నరుణ్ణి నమ్ముకున్నవాడు హిరణ్యకశిపుడు

బలిచక్రవర్తి గురువాజ్ఞను కూడా ధిక్కరించాడు. ఈ ముగ్గురూ వరుసగా తల్లి, తండ్రి, గురువులను ఎందుకోసం ధిక్కరించారు? దైవంకోసం ధిక్కరించారుగాని; ధనముకోసమో, రాజ్యంకోసమో కాదు. దైవానికి మించినది వేరొకటిలేదు. అన్నీ దైవసంకల్పములవలననే జరుగుతాయి. దైవసంకల్పము లేనిదే గడ్డిపోచకూడా కదలదు. పరిపూర్ణ శరణాగతిని పొందినటువంటివాడు బలిచక్రవర్తి. ఆయన రాజ్యములోని ప్రజలు కూడా ఎంతో ప్రభుభక్తిగలవారు. అట్టి ప్రీతికరమైన ప్రజలను వదలి తాను పోవటానికి ఇష్టములేక 'ఓ ప్రియమైన ప్రజలారా! మిమ్ములను వదలి నేను, నన్ను వదలి మీరు ఉండలేరు. కనుక ప్రతి సంవత్సరం నేను వచ్చి మీకు దర్శనమిచ్చి ఆనందమును అందిస్తాను' అని చెప్పాడుట. ఆ వాగ్దానం యిచ్చినటువంటి దినమే ఈ "ఓణమ్". ఆనాడు తెల్లవారుజామున లేచి అభ్యంగ స్నానంచేసి, నూతన వస్త్రములను ధరించి, భగవదర్పితం గావించిన ప్రసాదమును తిని, భగవంతుని చింతించడమే 'ఓణం' ఇందులో నూతన వస్త్రములకు ప్రత్యేకత గలదు. నూతన వస్త్రములనగా ఏమిటి? హృదయమునకే 'వస్త్రము' అని పేరు. పవిత్రమైనటువంటి హృదయమే ఈ వస్త్రము. ఈ పవిత్రమైన హృదయమును ధరించినప్పుడే, భగవంతుడు అందులో ప్రవేశిస్తుంటాడు. అట్టి హృదయం మాత్రం మాలిన్యముతో వుంచి, బాహ్యమైనటువంటి నూతన వస్త్రములు ధరించి ప్రయోజనం ఏమిటి? కనుక హృదయమును పవిత్రంగావించుకోవాలి. ప్రభువుకు తగినటువంటి ప్రజలూ వుంటుండాలి. ప్రజలకు తగినటువంటి ప్రభువూ వుంటుండాలి. ఈ రెంటియొక్క ఏకత్వమే నిజమైనటువంటి ఆత్మతత్త్వము, ఇదియే భగవంతునియొక్క లీలలు. దీనిని ఎవ్వరునూ తెలుసుకోలేరు.

ఋషులందరూ ఒకచోటచేరి అనేక విధములుగ భగవంతుని వర్ణిస్తూవచ్చారు. 'ఓ భగవంతుడా! నిన్ను వర్ణించుటకు వీలుకాదు' అన్నారు. 'నిన్ను

# భగవాన్ శ్రీ సత్యసాయి స్తుతి రత్నమాలా

చిత్రాతి చిత్రాస్తవ భవ్యలీలా!
మాధుర్యధుర్యా తవ దివ్యవాణీ
చిత్రావతీతీర ప్రశాంతివాసిన్
ప్రత్యగ్దృశం త్వాం ప్రణమామి నిత్యమ్ ॥

గభీర చిత్తం జ్వలన ప్రకాశమ్
శరీరిణం శాంతరసావతారమ్
భక్తైరుపేతం భవవార్ధి పోతమ్
శ్రీ సాయినం తం మనసా స్మరామి ॥

రక్తాంగ రత్నాంచిత మూర్తిమంతం
భక్తార్తి విచ్ఛేదన శక్తిమంతం
భూమౌ చరంతం త్రిపురాంతకంతం
శ్రీ సాయినం సౌమ్యతి దీప్తిమంతం ॥

శ్రియం వికర్ణత్యపహస్త్య ఘాని
శ్రేయః పరిస్నాతి తనోతి కీర్తిం
శ్రీ సత్యసాయీశ ప్రశాంతమూర్తే
కింకిం నధత్తే తవభూతి రేణుః ॥

శ్లోకప్రవాహోద్భవ భావరూపాం
పయోజమాలాం తవ పాదయుగ్మే
సమర్ప్య భక్త్యా కరుణారసార్ద్రి!
యాచేత్వదీయామృత వీక్షణాని ॥

పయోనిధేస్సంస్కృత వాఙ్మయస్య
జాతోఽస్మ్యహం బిందురివ ప్రభో! మే
శ్లోకేషు దోషాన్ ప్రవిహాయ సాయిన్
గృహ్ణీష్వ శోభాస్తుతి రత్నమాలాం ॥

- కొల్లూరు సూర్యకోటేశ్వరరావు

కనుగొనగలమా....కృష్ణా! అన్నారు గోపికలు, దీనినే ఋషులందరూ కూడా 'నేతి' .... 'నేతి' .... Not this .... Not this .... అన్నారు. 'ఈభావములు నావి కావు, ఈ దేహము నాది కాదు, ఈ సంకల్పం నాది కాదు, ఈ ధనం నాది కాదు, ఈ సంపద నాది కాదు .... సర్వమూ నీదే .... నీదే ...' ఈ విధ మైనటువంటి త్యాగము చేతనే దైవత్వమును ఆనాడు పొందగలిగారు. కలియుగ ప్రభావం వలన ఈనాటి మానవుడు 'అంతా నాదే .... అంతా నాదే .... నాదే.... నాదే అంటున్నాడు. ఏదీ నీది కాదు? నీది కాదన్నప్పుడు ఇంక తనదేది? ఇంతటి మూర్ఖత్వంలో మునిగి ఉంటున్నాది ఈ కలియుగం. ఈనాడు ప్రతి భావ మందునూ మమత్వం అధికమవుతూ వస్తున్నది. ఈ మమత్వం చేతనే అహంకారం పెరిగిపోతున్నది. ఈ అహంకారమును నిర్మూలం గావించాలి మమత్వాన్ని దూరం చేయాలి దివ్యత్వానికి హృదయములో చోటివ్వాలి 'అంతా భగవంతుడిదే నా వద్ద ఏమీ లేదు. వట్టి చేతులతో వచ్చాను. వట్టి చేతులతోనే పోతాను. మధ్యలో వచ్చిన ఈ ధన కనక వస్తువాహనాదులు కదిలిపోయే మేఘముల వంటివే' అనే సత్యమును ప్రబోధిస్తూ వచ్చాడు బలిచక్రవర్తి

బలిచక్రవర్తి మహా పరమ భక్తుడు భక్తికి ఐదు గుణములన్నారు. ఈ ఐదు గుణముల లోపల తొమ్మిది మార్గములన్నారు. అవే "శ్రవణం, కీర్తనం, విష్ణు స్మరణం, పాద సేవనం, వందనం, అర్చనం, స్నేహం, ఆత్మ నివేదనం" ఈ తొమ్మిది మార్గము లలో ఆఖరిది ఆత్మ నివేదనం. ఇందులోనే ఉన్నది సర్వం. ఇంకా మనకు వేరొకటి అక్కరలేదు ఇలాంటి భావములచేత, దివ్యమైనటువంటి నవ్యమైనటువంటి ప్రపత్తి ప్రబోధిస్తూ వచ్చాడు కేరళ ప్రజలకు బలి చక్రవర్తి కనుకనే నాటికి, నేటికి, ఏనాటికైనా కేరళ ప్రజలకు ఈ ఓణం అంటే ప్రాణం ఓణం వస్తున్న దంటే వారిలో ఆనందం ఉప్పొంగి పోతుంటుంది. కేవలం తినుబండారములకోసంకాదు అదివారికి ప్రాణంతో సమానమైన సుదినం. అదే నిజమైన దినం. భగవచ్చింతన చేసే దినమే దినం. భగవంతుని సన్నిధి చేరిన దినమే దినం. భగవత్ సన్నిధిని అనుభవించిన దినమే దినం దినము కానటువంటిదే దైవము అన్నారు. దిన మనగా పగలు రాత్రి చీకటికి వెలుగునకు అతీత మైనటువంటి దైవము కనుక దినము కానిది దైవము కాలాతీతమైన తత్వము ఇది ఇలాంటి దైవత్వం ఎక్కడ ఉన్నది? మనలోనే ఉన్నది.

కేరళలో భక్తి అధికం. దైవ పూజలు, పద్మనాభ పూజలులాంటివి అధికంగా చేస్తుంటారు ఎవరు ఈ పద్మనాభుడు? మన నాభి నుంచి ఏర్పడినటువంటిదే పద్మము. పద్మము నుంచి ఆవిర్భవించినటువంటివాడే బ్రహ్మ. కనుకనే బ్రహ్మతత్వ మనేది నాభి నుండి ఆవిర్భవిస్తున్నది. అదియే బలిచక్రవర్తి నిజమైన ప్రబోధ సోఽహం...సోఽహం-అదే నాభి శబ్దం. "నేనే దైవము...నేనే దైవము" అని ప్రబోధిస్తూ వస్తున్నది.

## ప్రేమ స్వరూపులారా!

నీకంటే దైవము మరొకటి లేదు దైవం నీకంటే భిన్నంగా లేదు, నీవే దైవము, దైవమే నీవు-ఇలాంటి ఏకత్వంచేత మనం భగవంతుని సాధించాలి ఆ పవిత్ర మైన తత్వాన్ని మనం ప్రేమ ద్వారానే పొందాలి. భగవంతుడు ప్రేమ స్వరూపుడు. నీ విద్యచేతగాని, నీ యుక్తిచేతగాని, నీ ధనకనక వస్తువాహనాదులచేత గాని దైవమును కొనటానికి వీలుకాదు భగవంతుణ్ణి ఒక్క ప్రేమచేత మాత్రమే కొనటానికి వీలవుతుంది. ప్రేమచేతనే భగవంతుణ్ణి కొనవచ్చును

(ది 6-9-1995 న ప్రశాంతి నిలయంలో 'ఓణం' పండుగ సందర్భమున భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగమునుండి)

# మాటలాడే దేవుడు మన సాయిరాముడు

కొమరగిరి జయప్రద

"యుగధర్మ పద్ధతుల్ వికలమై యుండ
నయమార్గమున త్రిప్పి నడుపు కొఱకు
లోకంబులెల్ల కల్లోలమై చెడియుండ
నిష్కల్మషము చేసి నెగడు కొఱకు
దుర్మార్గ బుద్ధులై క్రుంగి దీనత నుండు
సాధు సంరక్షణ సలుపు కొరకు
కాల సందిగ్ధ విగ్రహాదిప్తులై యుండు
భాషార్థ గోప్యముల్ పలుకు కొఱకు

క్ష్మాభరము బాపి భూదేవి మనుపుకొఱకు
చేతనొసగిన కోర్కెలు తీర్చు కొరకు
అవతరించెను అచ్యుతుడవనియందు
సత్యరూపుడై పర్తిలో చూడుడిపుడు"

రండి! పదండి! నడవండి! చూడండి! అనుభవించండి! ఆనందించండి! ఎక్కడికి వెళ్ళేది! ఏమిటి చూచేది! అనుభవించేది ఏమిటి! ఆనందించేది ఏమిటి? వెళ్ళేది పర్తికి, చూచేది స్వామిని, అనుభవించేది ఆత్మానందాన్ని. అక్కడ అందరికి స్వామి దర్శనం ఉచితం, స్పర్శనం అదృష్టం, సంభాషణ మహాద్భాగ్యం స్వామి మనయందు చూపించే కరుణ, దయ అనుగ్రహం ఆశీస్సులు అపరిమితం. వాటిని అందుకున్నవారు ఎంత అదృష్టవంతులో! ఇవన్నీ మనకు స్వామి ఉచితంగా ఇచ్చినప్పుడు, స్వామికి మనం ఏమి ఇస్తున్నాము అని ప్రతి ఒక్కరూ ఆలోచించాలి. ప్రపంచంలో ప్రతి మానవుడు ప్రతిఫలం ఆశించకుండా ఏ పని చేయడు. కానీ స్వామి మన నుండి ఆశించేది ఏమిటి! ప్రేమ హృదయులై ఉండండి! అందులో నదిమందికి చోటివ్వండి! స్వామి కోరేది అదే. అది ఎటువంటి ప్రేమ? ఈనాడు సినిమాలలో చూపించే, యువతీ యువకులమధ్య కలిగే ఆకర్షణను ప్రేమ అని పిలుస్తున్నారు అదికాదు ప్రేమ అలాగే తల్లీ బిడ్డలు, అక్కా చెల్లెళ్లు, అన్నా తమ్ముల మధ్య ప్రేమలన్నీ అశాశ్వతములయినవి. ఇది కాదు కావలసింది శాశ్వతము అయిన భగవత్ప్రేమ ఒక్కటే నిజమైన ప్రేమ అది కలిగిననాడు సర్వ జీవులను తనవలెనే ప్రేమించగలుగుతాడు. అదే విశ్వ మానవప్రేమ

రెండవది భక్తి. దైవ భక్తి. మాతృ భక్తి, గురు భక్తి. దేశభక్తి ఇవన్నీ కలిగినవాడే సంపూర్ణమానవుడు ఇటువంటి సద్గుణములవల్లనే ముక్తి లభిస్తుంది ఈ విధమైన మాటలనే స్వామి ఎల్లప్పుడు చెబుతూఉంటారు. వాటిని ఆచరించి ఆనందించమంటారు ఇంత సులభమైన మార్గమును చూపించి దుర్లభమైన స్థానమునకు నడిపించే సనాతన సారధి "మన సాయిరాముడు" ప్రస్తుత కాలంలో మనం ఏ క్షేత్రానికి వెళ్లినా, ఏ తీర్థానికి వెళ్లినా ఏ దైవాన్ని దర్శించి పూజించి అర్చించాలన్నా పైసా లేనిదే పని జరుగదు దర్శనానికి టిక్కెట్టు కొబ్బరికాయ, హారతి, ప్రసాదం వగైరాలకు విడివిడిగా టిక్కెట్లు ఇవన్నీ కొనాలంటే మధ్య తరగతి వారికి మధ్యలోనే దేముడు కనిపిస్తున్నాడు సరే ఇవన్నీ సమకూర్చుకున్నా, దైవదర్శనం ఒక సెకనుమాత్రమే. ఇక పోతే మాటలాడే స్వాములు అనేకం హారతిలో దక్షిణ, పాదపూజకు దక్షిణ, హుండీలో మీకు తోచింది వారికి నచ్చింది సమర్పించుకుంటే తప్ప, దర్శన సంభాషణలు దొరకవు ఇవన్నీ చేసినా శాశ్వతమైన ఆనందాన్ని పొందగలమా? అంటే అది ఎవరికివారు నిరయించుకోవాలి.

మన సాయిరామునికి భక్తి, శ్రద్ధ, నమ్మకం ఉంటే చాలు. ఆనాడు త్యాగరాజు రామభక్తి సామ్రాజ్యములో స్థానాన్ని సంపాదించుకున్నట్లు, ఈనాడు సాయి సామ్రాజ్యములో ఉన్నత పదవిని అధిష్ఠించవచ్చు. ఇహ, పరాలలో కూడా స్వామికి సన్నిహితంగా ఉండవచ్చు. అనంతమయిన ఆనందాన్ని పొందవచ్చు. స్వామి కోరేది కేవలం మనందరి యందు సత్ప్రవర్తన మాత్రమే. ఆయన అడిగేది భక్తి, ఇచ్చేది ముక్తి. అమృతమయిన మాటలతో మనస్సులను మార్చగల మధురమూర్తి స్వామి మన కష్టసుఖాలను విచారించి నివారణోపాయాన్ని కలలో గాని ఇలలో గాని సూచిస్తారు స్వామి. సులభమైన భాషలో భక్తిభావాన్ని పెంపొందించే మార్గాన్ని చూపించే భక్తసులభుడు సత్యసాయి రాముడు. ప్రేమయే స్వభావము, శాంతమే స్వరూపముగా గలవాడు మన ప్రేమసాయి మనకేమాత్రము శ్రమలేకుండా మనం ఎక్కడ కూర్చున్నా మనముందుకు వచ్చి, తన చల్లని చూపులతో, మెల్లని మాటలతో మన మనస్సుకు ఆహ్లాదాన్ని కలిగిస్తారు సుందరసాయి. స్వామి పూజకు బుట్టెడు పువ్వులక్కరలేదు కఠినమైన ఉపవాసములక్కరలేదు, కొబ్బరికాయలు నైవేద్యములు అక్కరలేదు ఆ కరుణామూర్తికి.

"పూవు లెన్నో తెచ్చి పూజలు చేసిన
మెచ్చబోడు తాను పుచ్చుకొనడు
హృదయ కమలమివ్వ సదయుడై గ్రహించు
సత్యసాయి ప్రేమ శాంతిదాయి,''

పిల్లలంటే స్వామికి ఎంతో ప్రేమ. పసిపిల్లలు చిన్న మొక్కలలాంటివారు. ఒక చిన్న మొక్కను నిటువుగా పెంచినా గుమ్మటంలా కత్తిరించినా పందిరికి ప్రాకించినా పసివయసులోనే, పెద్దదయితే దాన్ని త్రుంచటమూ, వంచటమూ మనవల్లకాదు. అలాగే సద్గుణములు చిన్నతనం నుండే అలవర్చుకోవాలి పెద్దవారయినకొద్దీ స్వార్థసంకుచితతత్వములు పెరిగితే వారిని మార్చటం వారిని పుట్టించిన బ్రహ్మతరం కూడా కాదు, మొక్కై వంగనిదే, మ్రానై వంగుతుందా ? అంటారు స్వామి. విద్యతోపాటు వినయం, చదువుతోపాటు సంస్కారం నేర్చుకోవాలన్నదే స్వామి ఆశయం. కాలాన్ని, డబ్బును, ఆహారాన్ని, శక్తిని, చివరకు మాటను కూడా పొదుపుగా వాడుకోవాలంటారు స్వామి. "మరల రాదు రమ్మన్నా మాయమైన మానవ జీవితం." నీ యొక్క అజ్ఞానంవల్ల దాన్ని చేజేతులా జారవిడుచుకోవద్దు అంటారు స్వామి. ఇటువంటి హితము మనకు ఏ తల్లి, తండ్రి, గురువు చెబుతారు ! మనస్సు నొప్పించకుండా మనకు ప్రియమును, హితమును చెప్పేవాడు ఒక్కడే. అతడే మాట్లాడేదేవుడు మన సాయి రాముడు.

మనస్సు పాదరసంవంటిది. క్షణక్షణానికి జారిపోతూ ఉంటుంది జీవితం కత్తిమీద సామువంటిది. సర్కస్‌లో తీగమీద నడకవంటిది. ఏమాత్రం అజాగ్రత్తగా ఉన్నా జారి అజ్ఞానాంధకారంలో పడిపోవటమే. కాబట్టి ఎప్పుడో ఏదో చేశామనికాక శరీరంలో శ్వాస ఆడుతున్నంతవరకు ఈ పోరాటం సాగిస్తూనే ఉండాలి. ఇది ఎవరికోసమో కాదు. మనకోసమే. మనం ఆధ్యాత్మికోన్నత పదవిని అందుకోవటంకోసమే ఈ విశ్వరామ కృషి కాబట్టి లేవండి! నడవండి! వడివడిగా నడవండి! అందరికన్నా ముందుండటానికి ప్రయత్నించండి! ఆత్మారాముని చేరుకోండి! మాటలాడే దేముడు, మనమధ్య తిరుగాడే రాముడు. మన సత్యసాయి రాముని చూచి తరించండి! ఆనందించండి! ఆత్మానందాన్ని అనుభవించండి !

)-◯-(

# సర్వాంతర్యామి బాబా

-డా॥ మధుసూదనరావు

1995 జూన్ 26 వ తేది రాత్రి గం. 10-30 ని. సమయము నేను నా భార్య వెంకటగిరి నుండి బెంగుళూరు చేరుకున్నాము. ఆ నెలలోనే 25 వ తేది మా వివాహము జరిగింది.

నేనూ, నా భార్య, మా అక్కా బావగార్లతో కలసి బెంగుళూరులోని అనేక ప్రదేశాలు చూచినాము. జూన్ నెల 30 వ తేది రాత్రి గం. 7-30 ని॥ ప్రాంతంలో నాకు సడన్‌గా భగవాన్ సత్యసాయిబాబావారి దర్శనము చేసుకొని వారి దివ్యాశీస్సులు పొందాలని మనసు తహతహలాడ సాగింది. నేను వెంటనే కావలికి ఫోన్ చేసి డా॥ రాధాకృష్ణమూర్తిగారికి నా కోరికను తెలియ చేశాను. నూతనంగా ప్రచురించిన సత్యసాయి సాహిత్యము, వైట్ ఫీల్డ్‌లో దొరుకునట్లయితే తేవలసినదిగా నన్ను కోరినారు.

1995 జూలై 1 వ తేదీన ఉదయం నేను నా భార్య కబ్బన్ పార్కు, విశ్వేశ్వరయ్య మ్యూజియమ్, మొదలయినవి చూడడం జరిగింది, ఆరోజు మధ్యాహ్నం 3 గంటల ప్రాంతంలో లాల్‌బాగ్, బొటానికల్ గార్డెన్‌కి వెళ్ళి, మేమిద్దరము, మా బావమరిది, దేశవిదేశాల నుండి వచ్చిన అనేకానేక పుష్పజాతులను సందర్శించి, Plant collection కూడా చేశాము. ఫోటోలు కూడా తీసుకున్నాము

సుమారు సాయంత్రం 4-30 గం॥ల ప్రాంతములో మేమిద్దరము White field కి బయలుదేరాము తిరిగి రావడానికి కొంచెము ఆలస్యమవుతుందని, స్వామి ఆశ్రమానికి వెళుతున్నామని, మా బావమరిదిని, ఇంట్లో మాతల్లిదండ్రులకు తెలుపవలసిందిగా కోరాము మేము White field చేరేటప్పటికి 5-15 గం॥ అయింది. మొట్టమొదట మేము ఆశ్రమం చూడటానికి వెళ్ళాము. ఆ సమయంలో కొద్దిమందిని మాత్రమే మేము చూడడము తటస్థించింది చిన్న క్రాఫ్‌తో, కుర్తా, లాల్చి చేసుకొని, స్ఫురద్రూపి ఐన వ్యక్తి నవ్వుతూ మమ్మల్ని సాదరంగా ఆహ్వానించి "మీరు ఆశ్రమానికి దేని నిమిత్తం వచ్చారు అని ప్రశ్నించాడు" "మేము నవదంపతులం నేను వెంకటగిరికి చెందినవాడిని, నాభార్య బెంగుళూరు వాస్తవ్యురాలు. నేను కావలిలో జవహర్ భారత్ కాలేజీలో Job చేస్తున్నాను, మేము White field రావడం ఇదే ప్రథమం'' అని చెప్పాను "బెంగుళూరు రావడం కూడ ఇదే మొదటిసారా? అని అడిగాడు ఆ వ్యక్తి" "లేదు నేను ఇదివరలో 3 సార్లు బెంగుళూరు రావడం జరిగింది'' అని సమాధానమిచ్చాను. ఆ వ్యక్తి నవ్వుతూ "నాతో రండి, నేను మీకు guideగా వుండి అన్నీ చూపిస్తాను'' అన్నాడు నేను, నాభార్య అతనిని అనుసరించి, కాలేజీకి వెళ్ళాము. ఆరోజుకు కాలేజి పూర్తవటము మూలాన అక్కడ విద్యార్థులెవ్వరూ లేరు ఆ వ్యక్తి మాకు క్లాస్ రూమ్ను, లాబరేటరీలు అన్నీ చాలా ఓపిగ్గా తిరిగి చూపించాడు. ఇక్కడ సత్యసాయి సాహిత్య సంబంధమైన పుస్తకాలు ఏమైనా దొరుకుతాయా? అని నేను ప్రశ్నించాను ఈరోజు కాలేజి మూసే టైమయింది దే టైములో మనము ఇవన్నీ

తీరికగా విచారించవచ్చు, ఇంకా 10, 15 ని॥ మాత్రమే మనకు టైముంది అన్నాడా వ్యక్తి. మీరు "అనిల్ కుమార్‌గార్ని ప్రొఫెసర్‌ను కలవాలనుకుంటున్నారా'. అని ప్రశ్నించాడు "అవును వారిని కలవాలనే మేము ఇంతదూరం వచ్చింది" అన్నాను ఆ కుర్తా, లాల్చీ వ్యక్తి మమ్మల్ని అనిల్ కుమార్‌గారు వుండే Chamber దగ్గరకు తీసుకొనివెళ్ళి, మీరు ఇక్కడ వేచి వుండండి, నేను ఇప్పుడే వస్తానని ప్రొఫెసర్‌గారి Chamber లోకి ప్రవేశించాడు. 1, 2 నిమిషాల తరువాత Full white neck కోటు కళ్ళజోడు దరించిన వ్యక్తి, కుర్తా లాల్చీ వ్యక్తి ఇరువురూ మా సమీపానికి వచ్చి, అనిల్ కుమార్‌గారు ప్రేమపూర్వక చిరు దరహాసంతో, తమ చేతులు చాస్తూ, "మధుసూదనరావూ, రా, రా" అని నన్ను ఆహ్వానించారు ఆ ప్రేమ, ఆ వాత్సల్యమంతా తండ్రి తన బిడ్డమీద చూపించే మధుర ఘట్టమని.

వారు మా ఇరువురినీ Principal chamber లోకి తీసుకొనివెళ్ళారు Chamber అంతా ఎఱ్ఱటి కార్పెట్‌తో నిండివుంది Chamber నిండా భగవాన్ ఫొటోలు మనోహరంగా అలంకరించబడి వున్నాయి సువాసనలు వెదజల్లుతున్నది. ఆ Chamber లోనే స్వామి ప్రత్యక్షానుభూతిని నేనుపొందాను ప్రిన్సిపాల్‌గారికుర్చీకి ఎదురుగా 3 కుర్చీలు వేసివున్నాయి. నన్ను ఒక స్టూల్ మీద కూర్చోవలసిందిగా వారు ఆదేశించారు ఆ Chamber లో భగవాన్ ఫొటోలతోపాటుగా విఘ్నేశ్వరుడు, కృష్ణుడు మొదలైన ఫొటోలున్నట్లు నేను గమనించాను.

ప్రప్రథమంగా 'మీరెలా వున్నారూ?' అని ప్రిన్సిపాల్‌గారు నన్ను ప్రశ్నించారు. నేను బాగానే వున్నానని జవాబు చెప్పాను వారు తిరిగి మళ్ళీ ప్రశ్నించారు. 'మీరు కావలిలో సుఖంగా వున్నారా?' నేను చిరునవ్వు నవ్వాను కావలిలో మీరు సౌఖ్యంగానే వున్నారనుకుంటా అన్నారు వారే తిరిగి తరువాత వారికి, నాకు కలిగిన నాలుగు అనుభవాలను వర్ణించి చెప్పాను. 'స్వామి తమ దయాదృష్టిని నా మీద ప్రసరించి, నైతికంగా నాకు అండ దండగా నిలిచి నిస్సహాయ స్థితిలో వున్న నాకు, ఎంతో శక్తిని, ప్రోత్సాహాన్ని, అందించారు' అని నేను ప్రొఫెసర్‌గారికి చెప్పాను. నేను కావలిలో భగవాన్ పేరిటనున్న గోకులము, పాఠశాలను కూడ రాధాకృష్ణమూర్తిగారితో, చూద్దామని అనుకుంటున్నాను. అని చెప్పాను. నవ్వుతూ నే చెప్పేదంతా వారు విన్నారు వారు ఒక Attender ని పిలిచి ఏదో పురమాయించారు. అటెండరు రెండు ప్లేట్లలో స్వీట్సు (Sweets, hots) హాట్సుతో 5 నిమిషముల తర్వాత మా ముందు ప్రత్యక్షమయ్యాడు.

## దొడ్డ బుద్ధి - గొడ్డు బుద్ధి

"అయ్యా! నీవు వచ్చిన స్వస్థానం మరచి పోయావు. ఎంతకాలం ఈ పరస్థానంలో ఉంటావు? ఎంతకాలం క్యాంపులో కాలక్షేపం చేస్తావు? తిరిగి నీ స్వస్థానాన్ని చేరుకో" అనే మహామంత్ర ఉపదేశమే "త్రోవ వెదుకు కొనుట దొడ్డ బుద్ధి" అనేది. త్రోవ మరచేది 'గొడ్డు బుద్ధి' ఈనాడు మనం గొడ్డు బుద్ధిలో జీవిస్తున్నాం. దొడ్డ బుద్ధికి మనం ప్రయాణం కావాలి. పురందరదాసు ఇలా అన్నాడు. "స్వామీ! నిన్ను మరచిపోవటంచేతనే ఈ ప్రకృతిలో పుట్టవలసి వచ్చింది. చిన్మయ రూపుడవైన నిన్ను మరచిపోయి మృణ్మయ రూపంలో చిక్కుపడ్డాను. ఈ మృణ్మయ లోకానికి వచ్చిపడ్డాను.

- బాబా

ప్రిన్సిపాల్‌గారు ఎంతో ప్రేమతో తీసుకోండి అని చెప్పారు నేను ఒక లడ్డూ నా భార్య ఒక లడ్డు తీసుకున్నాము. తిరిగి ఇంకా స్వీట్లు తీసుకోవాల్సిందిగా వారు మమ్మల్ని కోరారు నా భార్య ఒక జాంగ్రీ తీసుకున్నది. అనిల్‌కుమార్‌గారు ఇదంతా నవ్వుతూ పరివేక్షిస్తూ వున్నారు. మంచినీరు ఒక గ్లాసులో, రెండు వెండి గ్లాసులలో పాలు attender తీసుకొచ్చి మా ముందర పెట్టి వెళ్లిపోయాడు అంత రుచిగల పాలు మా జీవితంలో ఎప్పుడూ మేము త్రాగలేదు

ప్రొఫెసర్‌గారు 'స్వామి మీతోనే వున్నారు మీలోనే వున్నారు' అని ప్రప్రథమంగా మాకు శెలవిచ్చారు. మీరు చాలా అదృష్టవంతులు. మీరు ఎవ్వరితో నయినా మాట్లాడేటప్పుడు, ప్రేమతో, దయతో, మాట్లాడండి. నీతి, నియమాలు పాటించండి. ప్రతిఫలాపేక్ష లేకుండా ప్రేమతో సమాజానికి సేవచేయండి బాహ్యాడంబరానికి విలువ యివ్వద్దు మానవుని లోపలి అసలైన వ్యక్తిత్వానికి గౌరవమియ్యండి. మానవుడు జీవించడానికి, ధనం కావలసిందే, కాని ధనమే ప్రధానం కాదు. ధనాన్ని కాలాన్ని వృథాచేయకండి ధన మెక్కువగా వుంటే నిరుపేదలకు నిస్సహాయులకు ప్రేమతో పంచండి. తెలిసి తెలిసి ఏ జీవికీ హాని కలిగించవద్దు. స్వామి తరచూ ఈ విషయాలు తమ ఉపన్యాసాలలో శెలవిస్తూ వుంటారు మీ తల్లిదండ్రులను గౌరవించండి ఒకవేళ అభిప్రాయ భేదమొస్తే వారిని ప్రేమతో కన్విన్స్ చేయండి. వారిని మీరు బాధించరాదు

స్త్రీలకు విశిష్టమైన గౌరవాన్ని ఇవ్వాలి నా దృష్టిలో వారంతా ఆదిపరాశక్తి అవతారాలు స్త్రీల నెప్పుడూ నిరాదరించవద్దు, అవమానపరచవద్దు మీ పొరుగువారికి ఏ విధమైన బాధ కలిగించక, మీ పరిసరాలను శుభ్రంగా వుంచుకోండి భౌతిక సుఖాలకు ఆశపడక అతీతంగా వుండండి అవినీతిని సహించకండి, ప్రోత్సహించకండి అధ్యాపక వృత్తి చాలా పవిత్రమైనది ఎక్కువకాలము మీవృత్తిపైన కేంద్రీకరించండి విద్యార్థుల భవిష్యత్తును తీర్చిదిద్ది, వారి జీవితాలకు, బంగారు బాట వేసి, వారిని భారతరత్నాలుగా, ఆదర్శపౌరులుగా తయారుచేయటము మీధర్మము మీబోధనలవల్ల విద్యార్థినడవడికను ఉత్తమ ప్రతీకలుగా తయారుకావాలి. ఇదే మీ ఆశయంగా ఉండాలి. నైతిక విలువలను ప్రేమించండి పోషించండి విద్యావిధానంలో కానీ, ఆశయాల్లో కానీ, ప్రక్కదారులను ప్రోత్సహించవద్దు ఎప్పుడూ సత్యాన్నే పలకండి. మీ మీ అభిప్రాయాలను మీ ధర్మపత్నితో పంచుకోండి. మీ ఇద్దరి మధ్య, ప్రేమ, సదవగాహన, నిరంతరంగా వుండాలి ఎవరిపట్లా భయంతో కూడిన భక్తి గౌరవముండకూడదు పెద్దలను, వృద్ధులనూ, వృద్ధాప్యంలో ఆదుకోండి సహృదయముతో, ప్రేమతో వారి సమస్యలను, పరిష్కరించండని చెబుతూ తరువాత అనిల్‌కుమార్‌గారు, అటెండరుతో ఏదో సైగచేశారు. అటెండరు ఒక gift తెచ్చి వారి చేతిలో పెట్టాడు వారు ఎంతో ప్రేమగా ఆ గిఫ్ట్‌ప్యాక్‌ని మాకు బహూకరించారు. వారు మావైపు చూస్తూ 'ఇక వేద్దామా' అన్నారు వారు కూడ మాతోపాటు బయటికి వచ్చారు 'నా భార్య ఆటో కోసం చూడటం ప్రారంభించింది' ప్రొఫెసర్‌గారు ఒక White A C Ambasidor ని ఆపి డ్రైవరుని మమ్మల్ని కోరమంగలా చేర్చమని ఆజ్ఞాపించారు. ఇరువురము వారి ఆశీస్సులందుకొని, సుఖంగా కోరమంగలాలో వున్న మా మామగారింటికి చేరుకున్నాము. డ్రైవరు కూడ White dress ధరించి వున్నాడు మమ్మల్ని కోరమంగలాలో దించిన ఆ డ్రైవరు ఎంతో వినయంగా మాకు నమస్కారం చేస్తూ శలవు తీసుకున్నాడు.

ఇంటికి వచ్చిన తర్వాత మేము ఆ gift ప్యాకెట్ విప్పి చూసాం. White field లో 1979లో జరిగిన సమ్మర్ క్లాసెస్ డైరీ అది ఆ డైరీ నిండా చక్కనివి పెద్ద సైజువి స్వామి ఫోటోలు, చిన్న స్టిక్కర్లు, విభూతి పొట్లాలు వున్నాయి ఆ డైరీ నుండి, ఆ కవరునుండి

ఈనాటికీ సువాసనలు వెదజల్లబడటము ఒక ముఖ్యమైన విశేషము

కావలిచేరి ఈ సంఘటనగూర్చి డా రాధాకృష్ణమూర్తి గారికి వర్ణించి చెప్పాను, జూలై 6 న మేమిరువురము ఎ శ్రీనివాసరావుగారి దగ్గరకి వెళ్ళినాము వారు 6 వ జోను స్టేట్ కో ఆర్డినేటర్, అంతా విన్న తరువాత శ్రీనివాసరావుగారు ఈవిధంగా ప్రశ్నించారు "ఇదంతా వాస్తవమా లేక స్వప్నమా?" అని అడిగారు నేను ప్రొఫెసరు అనిల్ కుమార్‌గారిని యదార్థంగా కలుసుకున్నాను" అన్నాను. శ్రీనివాసరావుగారు తిరిగి జవాబు చెప్పారు "నాకు తెలిసినంతవరకు అనిల్ కుమార్ గారు 1st July కి ముందే పర్తి చేరుకున్నారు అని చెప్పినారు వెంటనే బెంగుళూరులో వున్న అనిల్ కుమార్‌గారి అబ్బాయికి ఫోన్ చేశారు కానీ అక్కడి నుండి యే జవాబూ లేదు. శ్రీనివాసరావుగారు పర్తివెళ్ళి జూలై 8 నుండి 10 దాకా పర్తిలోనే స్వామిదర్శనార్థము ఉన్నారు వారు తిరిగి కావలి చేరిన తరువాత అనిల్ కుమార్‌గారు జూన్ 28వ తేదీ నుండి పుట్టపర్తిలోనే వున్నారని నాతో చెప్పారు. అయితే జూలై 1వ తేదీన బృందావనం కాలేజీలో మాతో మాట్లాడిన వారెవరు? భగవాన్ తమ దయా దృష్టిని నామీద ఈవిధంగా కురిపించినారని నేను భావిస్తున్నాను. అనిల్ కుమార్ గారి రూపంలో భగవాన్ మమ్మల్ని సాదరంగా ఆహ్వానించి ప్రేమవృష్టి కురిపించారు నా జీవితంలో ఆరోజు (జూలై 1) సాయంత్రం (5-30 to 7-30 వరకు) మరుపురాని మధుర ఘట్టము ఆనాడు నేను పొందిన ఆనందానికి అవధులులేవు, భగవాన్ బాబావారు మా దంపతుల యెడల చూపిన అనుగ్రహమునకు కృతజ్ఞతాభివందనలు.



# ఓంకారము

"ఓం" మూడు పర్యాయములే ఎందుకు చెప్పాలి? "శాంతి" కూడా మూడు పర్యాయములే చెబుతున్నాం. రెండు లేక నాలుగు పర్యాయములు ఎందుకు చెప్పడంలేదు? ప్రణవం ఆధార శబ్దం, సర్వ శబ్దములకు మూలాధారము. ప్రణవములేని మంత్రం మందులేని తుపాకి వంటిది. దేహము తుపాకి (Gun) ఓం బుల్లెట్. మూడు పర్యాయములెందుకంటే- ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక శాంతి నిమిత్తం మానసిక శాంతి, దేహశాంతి, ఆత్మ శాంతి నిమిత్తం. ఆత్మ శాంతి లేనిదే, దేహశాంతి ఉండి లాభంలేదు. దేహశాంతి వున్నా మానసిక శాంతి లేనిదే లాభంలేదు. నీవనుకునే నీవు, ఇతరులనుకునే నీవు, నీవైన నీవు - ఈ మూడు స్థితుల్లోనూ శాంతి కావాలని మూడుసార్లు శాంతి పాఠము చెబుతున్నాం. త్రికాల త్రిమూర్తులవలె మూడు స్థానాలలో ఓంకారం నిలిచి ఉంటుంది. త్రికాలముల పవిత్రతను, త్రిలోకముల దివ్యత్వమును ఉచ్చరించడానికి ప్రణవం చేర్చాలి. ప్రణవం పవిత్రజ్యోతి వంటిది. మనం ఏది మొదలుపెట్టినా ఓంకారంతో ప్రారంభిస్తాం. ఇదే ప్రణవం, ప్రణవము అనేటటువంటిది ముందు ఇంజను వంటిది. ఈనాడు ప్రణవం లేకపోవటంచేతనే ప్రళయము వచ్చిపడిపోతున్నది. కనుక మొట్టమొదట ఓంకారతత్త్వమును మనం అర్థం చేసుకోవాలి.

- బాబా

# కరుణామూర్తి - బాబా

-వి. ఎమ్. ఆర్. శర్మ

స్వామి ఇరవై రెండు పి. హెచ్.డి., పోస్టుగ్రాడ్యుయేట్ స్టూడెంట్లతో, వార్డెనుతో సహా ఊటికి ఏప్రియల్ మొదటివారంలో వెళ్ళినారు. దానికి పూర్వము ఒక్కొక్కరికి 500 వందల రూపాయలిచ్చి బెంగుళూరు సిటీలో మంచి స్వెట్టర్లను కొనుక్కొని రమ్మని పంపిరి. దానికి తగినట్లు మఫ్లర్లు కూడా కొనుక్కొని వచ్చినారు. ఊటి చేరిన తర్వాత వారికి కొన్ని సలహాలిచ్చినారు. "ఇది పుట్టపర్తి లేదా బెంగుళూరు కాదు. తెల్లవారి 4 గంటలకు లేచి స్నానాలు చేసి తయారుకావలసిన అవసరంలేదు. 6 గంటలకు ముందు ఎవరూ నిద్రనుంచి లేవరాదు. లేచిన తర్వాత ముఖప్రక్షాళనము గావించి, బ్రష్ చేసుకొని, కాఫీ టిఫిన్లు సేవించిన తర్వాతనే, తీరికగా 8 గంటలకు వేడి నీళ్ళతో స్నానంచేసి 9 గంటలకు జనానికి దర్శనమిచ్చే సమయానికి మీరు అక్కడ వుండాలి. ఇక్కడ చలి జాస్తి కాబట్టి స్వెట్టర్లు ధరించుండి. నిండుగా రగ్గులు కప్పుకొనండి- హాయిగా నిద్రపోండి" అని చెప్పి స్వామి తన రూములోకి వెళ్ళినారు.

అది ఊటీలో స్వామి భవనంలో మేడమీద పెద్ద హాలు. ఆ హాలును అనుకొని స్వామివారి గది. ఆ హాలులోనే విద్యార్థులు, వార్డెను పడుకొనడానికి పరుపులు ఏర్పరచబడినాయి. హాలు తలుపులు మూసివేసి అందరూ పడుకొన్నారు. ఒక మూలలో భగభగమండుతున్న కట్టెలున్న "హర్తు" (Hearth) నుంచి వెచ్చని గాలి వీస్తున్నది కొద్దిసేపైన తరువాత ఒకతను ఆ చలికి తట్టుకోలేకనో ఏమో, అక్కడున్న నాలుగుకిటికీలు మూసివేసినాడు మరి వచ్చిపడుకొన్నాడు. హాయిగా నిద్రపోయినాడు అర్ధరాత్రికి స్వామి ఆ హాలులోకి నిశ్శబ్దంగా వచ్చి మూసివున్న 4 కిటికీలు మరీ తెరచి అస్తవ్యస్తంగా పడుకొనివున్న పిల్లలపై రగ్గులు సరిగ్గా కప్పి, హర్తులో మరికొన్ని కట్టెలువేసి బాగా వెచ్చదనం కలిగేటట్లుచేసి, తన రూములోకి వెళ్ళినారు ఇది ఎవరూ గమనించలేదు

స్వామి తెల్లవారి 6 గంటలకు హాలులోకి వచ్చిచూస్తే అందరూ మేల్కొని పడకలమీదనే కూర్చొన్నారు రగ్గులు, మఫ్లర్లు కప్పుకొని స్వామికి అందరూ ప్రణామములు చెప్పినారు. అప్పుడు స్వామి తెలిపినారు. "అరే ఇక్కడ ఇప్పుడు 23 శవాలుండేవి నేను కనుక అర్ధరాత్రి హాలులోకి వచ్చి కిటికీ తలుపులు తెరువకుండా వుంటే ఆ మూలలో వున్న హర్తు నుంచి కార్బన్ మోనాక్సైడ్ జనిస్తుంది ఆ కిటికీ తలుపుల ద్వారా అది బయటికి పోయి చల్లని గాలి వేస్తుంటే సరిగ్గా ఉంటుంది కానీ ఆ కిటికీలు మూసివేస్తే ఈ హాలులో ఫ్రెష్ గాలి లేక కార్బన్ మోనాక్సైడ్ వల్ల మీరందరూ రాత్రికి రాత్రే చచ్చిపోయి వుండేవారు. మీలో ఎవరో ఒకరు నిన్న రాత్రి చలికి తాళలేక కిటికీలు మూసినాడు. అందుకే నేను ముందుగానే మీకు హెచ్చరించాను స్వెట్టర్లు వేసుకొని, రగ్గులు కప్పుకొని పడుకొనమని. ఇకమీదనైనా జాగ్రత్త పడండి పై చదువులు ఎన్ని వున్నా కామన్‌సెన్సు ముఖ్యంగా వుండాలి. పదండి, లేచి బ్రష్ చేసుకొని వచ్చి బ్రేక్ ఫాస్టు చేయండి" అనిచెప్పి వెళ్లినారు కరుణామయుడైన స్వామి.

మరొక సంవత్సరము 20 మంది విద్యార్థులను, టీచర్లను ఎన్నుకొని కొడైకెనాలు చేరినారు స్వామివారి బంగళాకు (సాయి కృతి) ఎదురుగా పెద్ద సరస్సు కాఫీ టిఫిన్లు అయిన తర్వాత దాని చుట్టూ తిరిగి రమ్మని పంపేవారు స్వామి అది షుమారు 5 కిలోమీటర్ల నడక తిండికి తగ్గట్టు శరీర వ్యాయామము కూడా ముఖ్యమని స్వామివారి ఆదేశము.

ఒకరోజు అందరినీ పిలిచి కొడైకెనాలు గ్రామానికి వెళ్లి అక్కడ ఒక Straw Hat దుకాణానికి వెళ్ళి అక్కడున్న 20 హ్యాట్లు కొనమని, బేరం చేయకూడదని, ఆ కొట్టువాడు ఎంత అడిగితే అంత ఇవ్వవలసినదని చెప్పి వారిలో ఒకరికి రూ 500 లు ఇచ్చి పంపించినారు. వారు పరుగుపరుగున ఆ కొట్టు వెదుకుటకు గ్రామమువైపు వెళ్ళినారు. ఆ కొట్టు చేరుకొని అక్కడ కూర్చున్న 9 ఏళ్ళ బాలకుడితో-ఎవరీ కొట్టువాడు అని అడుగగా, తానే అని అతను జవాబిచ్చాడు ఈ హ్యాట్లు మాకు కావాలి, 20 తీసి ఇవ్వమన్నారు "అయ్యలారా (సర్) ఇదిగో 20-మీ సైజుకు తగినట్లు ఎంచుకొనండి. మామూలుగా ఒకటి రూ 25 లకు అమ్ముతాను కానీ మీరు 20 హ్యాట్లు కొంటున్నారు కాబట్టి మీకు కన్సెషన్‌గా రూ. 20 లకే ఇస్తాను తీసుకొనండి" అని అన్నాడా బాలకుడు "లేదు-లేదు మాకు 20 హ్యాట్లు కావలసిందే అయితే రూ. 25 కే కొంటాము-తగ్గించేది లేదు" అని విద్యార్థులన్నారు ఇదేదో విచిత్రంగా వుందే అని ఆ బాలకుడు విస్తుపోయాడు. "సర్ మీరెవరు ? ఎందుకు బేరమాడలేదు నేను తక్కువ ధరకు ఇస్తానన్నా మీరు ఒప్పుకోవడం లేదే ఏమిటీ విశేషం" అని ప్రశ్నించాడా బాలకుడు "మేము శ్రీ సత్యసాయిబాబావారి స్టూడెంట్లము బాబా అంటే ఎవరో నీకు తెలుసా ?" అని ఎదురు ప్రశ్న వేశారు ఓ తెలియకేం ఇదుగో చూడండి అని తన ప్యాంటు జేబులో ఒక వారం కిందట తమిళ వార్తాపత్రికలో బాబా ఫోటో వేస్తూ కొడైకెనాలు వస్తున్నారని సమాచారము నలిగిన న్యూస్ పేపర్‌లో బాబా చిత్రం వెంటనే ఒక సెకెంటు తన జేబులోని బాబా ఫొటోకల క్యాలెండరును ఆ అబ్బాయి కిస్తూ, "ఇదో ఇది తీసుకో" అని చెప్పినాడు. వెంబడే ఇరవై జేబులలోంచి 20 ఫొటోలు బయటికి వచ్చి ఆ అబ్బాయి చేతిలో పెట్టినారు. అతను ఉక్కిరిబిక్కిరైనాడు బంగళాకు వాపసు వచ్చిన తర్వాత జరిగినదంతా స్వామికి వివరించినారు.

అప్పుడు స్వామి తెలిపినారు "ఆ అబ్బాయికి తండ్రి లేడు తల్లిని పోషించే భారము ఈ అబ్బాయిపై వుంది. ఆ కొట్టు నడుపుతూ తీరిక సమయాల్లో బూట్ పాలిష్ చేస్తూ డబ్బు గడిస్తున్నాడు. కష్టార్జితమే, దొంగతనము చేయడు. తన తల్లిని శ్రద్ధాభక్తులతో సేవిస్తాడు రోజూ నేను ఆ సరస్సువైపు కార్లో వెళ్ళుతూంటే ప్రక్కన నిలబడి చేతులు జోడించి మనసారా ప్రార్థించి నమస్కరిస్తాడు. అందుకే అతనికి ధనసహాయము చేయ

## పుట్టపర్తి

సత్యధర్మ స్థాప సంస్థాపనంబునన్  
ముగ్ధతల్ చిందు నీ పుటపర్తి  
చిత్రావతీ తోయ శీకరమ్ముల చెమ్మ  
మురిపెమ్ముగూర్చు నీ పుట్టపర్తి  
సాయీశు వాక్సార సార పంక్తులతోడ  
పొలువారుచుండు నీ పుట్టపర్తి  
సర్వతైర్థిక పుణ్య జన సంతతుల తోడ  
పోడిమి మీరు నీ పుట్టపర్తి

వేనవేలగు విద్యార్థి బృందములకు  
మురువు తెరవయి నిలిచె నీ పుట్టపర్తి  
అతుల భూలోక నాకమియ్యది యనంగ  
పుణ్యభూమిగ వెలసె నీ పుట్టపర్తి.

– తాళ్లూరి సత్యనారాయణ

వలెనని నా సంకల్పమైనది. ఊరికే రూ. 500 లు ఇస్తే అతను తీసుకొని వుండడు. అందుకే హ్యాట్లు కొనమని, బేరం చేయవద్దని చెప్పి మిమ్మలను పంపించినాను అని అన్నారు – కరుణామయుడు – బాబావారు.

మరొకనాడు కొడైకెనాలులో స్వామి, విద్యార్థులున్న హాలులోకి వచ్చి, 'లేవండి, త్వరగా బ్రష్ చేసుకొని రండి' అని ఆదేశించిన పిమ్మట, గబగబ అందరూ తయారై వచ్చి కూర్చున్నారు. అందరూ బ్రేక్‌ఫాస్టుకై ఎదురుచూస్తున్నారు. మామూలుగా 7–15, 7–30 సమయంలో తెల్లవారి బ్రేక్‌ఫాస్టుకై స్వామి విద్యార్థులను వెంటబెట్టుకొని క్రిందికి డైనింగ్‌హాల్లోకి వచ్చేసేవారు. కానీ ఆ రోజు వాళ్ళని పై హాల్లోనే కూర్చోబెట్టి ఏదో చర్చ ప్రారంభంచేసి తమ దివ్యోపన్యాసము చేసినారు. సుమారు ఒక గంటసేపు, తదుపరి 8 గంటలకు క్రిందికి వచ్చారు. క్రింద చేరిన భక్తజనము, పెద్దలు స్వామి రాకకై నిరీక్షిస్తూ ఎందుకింత ఆలస్యమైనదని విస్తుపోతున్నారు. అందరూ కాఫీ టిఫెన్లు సేవించిన తర్వాత స్వామి విశదీకరించినారు.

క్రిందట రాత్రి పెద్ద వర్షం కురిసి, వంటకట్టెలన్నియూ బాగా తడిసిపోయినాయి. అక్కడ గ్యాసు పొయ్యి సౌకర్యము అమర్చబడలేదు వంటవాడు కట్టెలను అంటించే ప్రయత్నములో ఎంతో ప్రయాసపడినాడు. కాని కట్టెలు మండలేదు. ఉన్న రెండు కిరోసిన్ బాటిల్సును పోసినా ప్రయోజనములేదు. దగ్గరగా అంగళ్లు లేవు, కిరసనాయిలు తెద్దామంటే 5 కిలోమీటర్లు వెళ్ళాలి. అప్పటికింకా ఎవరూ దర్శనార్థమై రాలేదు. కారుకాని, సైకిల్‌కాని అందుబాటులోలేదు. అప్పుడు మనసారా స్వామిని వేడుకొన్నాడు. స్వామి, మీరు మామూలు సమయానికే క్రిందికి దిగి బ్రేక్‌ఫాస్టుకు వస్తే, ఇంకా ఏమి తయారవలేదు కాబట్టి అందరూ నన్ను తిట్టిపోస్తారు – దయచేసి ఒక గంటసేపు ఆలస్యంగావస్తే నేను రక్షింపబడతాను – అంతలోపల కట్టెలు మండించి వంటచేసేస్తాను. రక్షించండి అని మనసులోనే ప్రార్థించినాడు ఆ ఆర్తనాదము స్వామి విని పట్టించుకొని, పైనహాల్లోనే ఒక గంటసేపుకాలక్షేపం చేసి, బ్రేక్‌ఫాస్టు తయారైనది అని తెలిసినతర్వాతనే క్రిందకి దిగివచ్చారు ఆ వంటవాని పరువు కాపాడినారు.

ఇది స్వామి వెల్లడి చేస్తేనే అందరికీ తెలిసింది కరుణామయుడు – బాబావారు.

## చదువు . విద్య

చదువు అంటే ఏమిటి ? కేవలం గ్రంథ పరిచయం మాత్రమే చదువు కాదు శబ్దములకు అనేక అర్థములు బోధించేది చదువు కాదు. హృదయ తలుపులను తెరిపించేటటువంటిది చదువు. హృదయ విశాలతను కలిగించేది చదువు. ఇంద్రియ నిగ్రహములను కలిగించేది చదువు. లోకహితాన్ని కోరేటటువంటిది చదువు. సమస్త సద్గుణములను పోషించేటటువంటిది చదువు. చదువుతోపాటు సంస్కారముకూడా ఉండాలి.

విద్యతోపాటు వినయమును పోషించుకోవాలి. వినయముతోపాటు విచక్షణను పెంచుకోవాలి. ఈ విచక్షణతోపాటు విజ్ఞానముకూడా పెరగాలి. ఈ విజ్ఞానము వివేకముతో కూడి ఉండాలి. అయితే ఈనాడు విజ్ఞానం ఉంటున్నది. వివేకం మాత్రం కనిపించటంలేదు. వివేకముతో కూడిన విజ్ఞానం కావాలి. ఆ వివేకముతోనే ఆధ్యాత్మికము మనకు ఆరంభమవుతుంది. – బాబా

# భగవాన్ బాబా మహా మహిమాన్విత శక్తిసంపన్నులు

- ఘుండికోట వెంకట సుబ్బారావు

మా ఘుండికోట వారి కుటుంబం 1961 నుండి నాలుగు తరాలుగా బాబావారి అనుగ్రహాన్ని, అనుభూతులను, మహిమలను, ప్రేమామృతాన్ని పొందుచూయున్నది. వాటిలో మచ్చుకు కొన్నింటిని పేర్కొంటున్నాను.

"స్వామి వైద్యులలో వైద్యులు" మా మూడవ పుత్రవాడు 20 వ ఏటన అతని చిన్న ప్రేగుల మడతపులో తూట్లుపడుటవలన తీవ్రజ్వరం, నొప్పులతో అనేక మార్లు బాధపడుతూ యుండడంవల్ల న్యూయార్కు ఆస్పత్రులలో చేర్చవలసివచ్చింది ప్రఖ్యాత వైద్యులు పెద్ద శస్త్రచికిత్స తప్ప వేరే మార్గంలేదనడం, అది జరుగు లోపుగ కేవలం జావ తప్ప తినకూడదనడం జరిగింది. అతడు చాలా చిక్కిపోయి, తాత్కాలిక ఉపశమనానికి ఇచ్చే మందుల మాత్రలతో విసిగిపోయిన పరిస్థితిలో ఇంకో గత్యంతరంలేక బెంగుళూరులో ఉన్న స్వామి వద్దకు వచ్చాము. స్వామి అపార కృపాకటాక్షంతో మమ్మల్ని లోపలికి పిలిచి, వానికి వారు అపుడే సృష్టించిన విభూతిని నోట్లో వేసి, కడుపు బాగా తడిమి ఇకనుంచి ఆ బాధ ఉండదని మామూలుగా ఆవకాయతో సహా భోజనం చెయ్యవచ్చునని నొక్కి చెప్పారు ఆ రోజునే వారిచ్చిన సంతర్పణలో, స్వామియే స్వయంగా వడ్డించిన పదార్థాలను తినిపించినారు. ఇది జరిగి ఇరువది ఏళ్ళయినది అటువంటి బాధ మరెప్పుడూ రాలేదు.

"బాబావారు అసంభవాన్ని సంభవం చేయు మహా మహిమాన్వితులు" మా పెద్దబ్బాయికి - వివాహం జరిగి పదిహేడు ఏళ్ళయినా సంతతి కలుగలేదు ఒకసారి దంపతులిద్దరు బెంగుళూరు స్వామి దర్శనానికి వచ్చినపుడు, స్వామి నన్ను వాళ్ళతో లోపలికి పిలిచి ప్రత్యేకమైన సుగంధ విభూతిని సృష్టించి వారిద్దరిచేత ఆ విభూతిని స్వామియే తినిపించినారు. "ఇంకొక ఏడాదిలో మీకు కొడుకు పుట్టగలడని గ్యారంటీ ఇస్తున్నాను" అని స్వామి మా అందరి ముందు ఘంటాపథంగా చెప్పారు సరిగ సంవత్సరం తిరగగానే నన్ను నా భార్యను న్యూయార్కు వెళ్ళి, మొదటి మనవడి ప్రసవ సమయమందు కోడలికి వారు సృష్టించిన పటికిబెల్లం ముక్క పెట్టమని ఇచ్చారు. మేము మర్నాడు న్యూయార్కు చేరాము. ఆ రాత్రే పురిటి నొప్పులు రావడం, మొదటి కాన్పు అయినా సుఖప్రసవం అవడం, మనుమడు పుట్టడం జరిగింది. పుట్టిన కొన్ని గంటల లోనే స్వామి వాడికి "జయవర్థన్" అని పేరు పెట్టి, తక్షణమే మాకు న్యూయార్కుకు టెలిఫోను కూడా చేయించారు ఆహా! మాకు వంశవర్ధనుని ప్రసాదించిన స్వామిని మరువగలమా! జై సాయిరామ్.

'స్వామి మృత్యుంజయుడు అన్నదానికి తార్కాణం': వయోవృద్ధులైన మా నాన్నగారికి చట్ట ఎముక విరిగి మంచంపట్టి తీవ్ర అస్వస్థతలో స్పృహపోయి, వైద్య బృందం ఇక లాభం లేదని చెప్పడం, బంధువర్గం కంట తడి పెట్టుచూయున్నప్పుడు స్వామి నాకు పంపించమన్న

తంతి అందినది. "అందులో అంతా బాగుందును. నాన్న గారితో కలిపి, మీరంతా నవంబరు మధ్య ప్రాంతంలో పుట్టపర్తికి స్వామి 65-వ జన్మదినోత్సవాలకు రావలసిన దని చెప్పమన్నారట. ఆ తంతి చదువుచూయుండగానే మా నాయనగారు కళ్ళు తెరవడం, నాతో మాట్లాడుతూ, "స్వామి ఇంతవరకూ నాతో మాట్లాడుచునేయున్నారు. తన 65వ జన్మదినోత్సవానికి మమ్మందరిని రమ్మను చున్నారు." అంటూ ఆ నాలుగు గంటల 'కోమాలో' స్వామి ప్రక్కనే కూర్చొని వేద విషయక సంభాషణ చేస్తూ యున్నారని, బాబావారు చెప్పుచూయున్న ప్రతి వాక్యానికి దానికి సంబంధించిన శ్రుతివాక్యం తన మనో వేదిలో స్పష్టంగా మెదులుచూ యున్నదని నాతో చెప్పి నారు ! మృత్యు కుహరంలోంచి నాన్నగారిని పైకి లాగుతూ వేదవిజ్ఞాన ప్రసారాన్ని కూడ స్వామి చేశా రన్నమాట. స్వామి వేద పురుషుడనియే మా నాన్న గారి గాఢ విశ్వాసం

నాన్నగారు, మేమంతా కలిసి పుట్టపర్తికి చేరుకున్న తరువాత, స్వామి తణుకులో నాన్నగారికి సంబంధించిన విషయాలను మాకు పూసగుచ్చినట్లు చెప్పినారు స్వామి మహిమలు అనూహ్యంగా ఉంటాయి కదా !

క్రితం సంవత్సరం బాబావారు అంతరంగిక సమావేశానికి నన్ను,నాభార్యను పిలిచి, మీరువిదేశాల లోని మీ పిల్లలతో కొంత కాలం గడపండి" అని ప్రబోధించారు స్వామీ ! తమ సన్నిధిని విడిచి పెట్టుట ఎలా అని మేమన్నాం అందులో స్వామితో కొడైకెనాల్ వెళ్ళితే వచ్చే అతి సన్నిహిత దివ్య అనుభూతులను ఎలా వదలడం అని కూడ అన్నాము స్వామి, నేను మీతో మీ జంటగా ఎపుడూ ఉంటూనే ఉన్నాను కదా అని అన్నపుడు, మళ్ళీ మా బాధను వ్యక్తంచేస్తూ వచ్చాము స్వామి ప్రత్యక్ష సన్నిధియే పెన్నిధి కదా అపుడు స్వామి వియోగాన్నే యోగం క్రింద చేయమని, దాని ద్వారా భక్తి ప్రపత్తులను ఇనుమడించుకొనమని, కుటుంబ వ్యవహారాలను చూసు కోవాలి అని, పైగా కుటుంబ సభ్యులతోను కొంతకాలం గడపుట చాలా మంచిదని ఎంతో అనునయంగా బోధించారు. మరి నాభార్యకు మోకాళ్ళు, వీపు నొప్పితో ప్రయాణం ఎలా అని అనుకొంటూంటే స్వామి ఆమెకు ధగధగ మెరిసే రత్నముఉన్న ఉంగరం సృష్టించి, ఇది ప్రయాణంలో ఆమె రక్షణకు, అన్ని నొప్పులు పోవు టకు ఉపయోగపడునని చెప్పి ఇచ్చినారు తరువాత స్వామి అపార దయా కటాక్షవీక్షణములతో నాహృదయ ప్రదేశాన్ని వారి దివ్య హస్తంతో రాసి, ఇక నీకు రక్తపుపోటు దానికి సంబంధించిన సమస్యలు ఉండవని, ఇక మందులవసరం లేదని చెప్పినారు

మేము స్వామి ఆదేశం ప్రకారం వియన్నా (ఆస్ట్రియా దేశం) వెళ్ళితిమి అచ్చట మా రెండవ కుమారుడు అంతర్జాతీయ అణుశక్తి సంధాయక సంస్థలో పనిచేస్తున్నాడు ఒకరోజు వాని కచేరీ భవన ప్రవేశ ద్వారం దగ్గర ఉన్న విద్యుత్‌శక్తితో నడిపే మెట్లు ఎక్కుచూ నా భార్య తూలిపడి మోకాళ్ళ కీళ్ళమీదపడింది. గట్టిగా 'సాయిరామ్' అంటూఉన్నది. అక్కడే ఉన్న రక్షణ బృందం లేవనెత్తి చక్రాల బండిపై ఆస్పత్రికి తీసుకొని వెళ్ళి పరీక్షలు జరిపించారు. అంత ప్రత్యక్ష ప్రమాదం జరిగినా, X - ray పరీక్షలలో ఏ రకమైన గాయం లేదు. ఆ పెద్ద నొప్పి మటుమాయమయినది. ఇది మాకందరకు ఒక అత్యద్భుత సంఘటన అది కేవలం బాబా కృపయే అని, వారు ముందుగనే రక్షణ కిచ్చిన అంగుళీయ ప్రభావమని తేటతెల్లమయినది. ఆ సందర్భంలో నా రక్తపుపోటు పరీక్షలు జరిగినవికూడాను. మందు తీసికొనడం మానేసి ఒక నెలరోజులైనా, రక్తపు పోటు సమానతౌల్యంలోనికి వచ్చి ఉంది. ఆ తరువాత పరీక్షలలో కూడా అదే నిర్ధారణ అయినది న్యూయార్కు వెళ్ళిన తరువాత కూడ అచటి పరీక్షలలో యధావిధిగానే ఉన్నది. ఇదంతా స్వామి కరుణాకటాక్షమని, ప్రయాణానికి ముందు వారిచ్చిన హామీ అప్రతిహత మనీ తేలింది ○

# విదేశాలలో సత్యసాయి సేవాసంస్థల ప్రగతి

—ఎన్. వి. ఎస్. రామారావు

1994 సం॥ మార్చి నెలలో రష్యాలోని "సెంట్ పీటర్సు బర్గ్" నగరములో శ్రీ సత్యసాయి సేవా సంస్థలవారు E H.V. (Education on Human Values) "మానవతా విలువలు" పై సదస్సు జరిపిరి ఇందు సుమారు 100 మంది అధ్యాపకులు; మలేసియా, హాలెండు దేశాల సాయి సంస్థలలో కో-ఆర్డినేటర్సు పాల్గొనిరి.

1993 నవంబరు 23న రష్యా దేశమంతటా "Fifteen wheel" అనుపేర టి. వి. లో సత్యసాయి బాబా వారి బోధలు, సత్యసాయి సేవా సంస్థల సేవా కార్యక్రమములు ప్రదర్శింపబడినవి రష్యాలోని "పీటర్సు బర్గు" అను నగరములో సాయి సంస్థలు ఏర్పాటుచేసిన సేవా కార్యక్రమములు ప్రజలను బాగా ఆకర్షించి, అందు బౌద్ధులు, హిందువులు, క్రైస్తవులు, పీటర్సు బర్గులో నివసించు ముస్లిములుకూడా పాల్గొనిరి వీరందరికి "Inter faith" ఏర్పడి - సర్వమతసారమే సాయి మత మను విశ్వాసమును పెంచుకొనిరి. రష్యాలో "పెరిస్త్రోయికా" తరువాత "సాయిబాబా" వారే జగద్గురు వని వీరందరూ తీర్మానించిరి. బాబావారి కరుణ అను పూల తోటలను రష్యాలో పెంచవలయునని, అందుకు అవసరమగు వ్య వ సా య ము ను చేపట్టవలయునని వీరందరూ నిర్ణయించి, "వేద ప్రచారము"ను విరివిగా నొనర్చుచున్నారు.

ఈ పై విషయములను రష్యాలో లెనిన్ గ్రేడ్ నుండి సెర్జీ నెపోలిటన్‌స్కీ "యునైటెడ్ కింగ్‌డమ్" అను అమెరికను సాయి మాస పత్రికలో ప్రచురించవలసినదిగా పెగ్గీమేసనుకి వ్రాసిన లేఖలోని వివరములు జపాను నుండి కాన్‌సాయిలైట్ వారు ప్రకటించిరి

1994 సం॥ నవంబరు నెలలో శ్రీ సత్యసాయిబాబా వారి జన్మదిన సందర్భంగా అమెరికాలోని "లాస్ ఏంజిల్స్" సిటీలోని సాయి సంస్థలు - సిగరెట్లు త్రాగుట హానికరమని-సంఘములో సంస్కృతిని పాడు చేయుచున్న "సెక్సు" సినీమాలు చూడరాదని ఒక ప్రత్యేక కార్యక్రమ ప్రచారము నిర్వహించారు. అమెరికా నుండి ప్రచురించబడు "లా స్ ఏంజిల్సు టైము" అను వార్తా పత్రిక ఈ విశేషాలను జపానులోని "కాన్ సాయి లైట్"కు అందించినది. ది 23-11-94న పుట్టపర్తిలో భగవాన్ బాబావారు కూడా తమ దివ్యోపన్యాసములో "పొగ త్రాగుట" నిషేధింపమని ప్రవచించారు. ఈ విషయములో బాబావారు "లాస్ ఏంజిల్సు టైమ్సు" అనే పత్రికకు ఒక సందేశమిచ్చారు.

## బాబావారి సందేశము

తరతరాల నుండి అనుసరింపబడుచున్న చెడ్డఅలవాట్లు క్షణములో మానుకొనుట కష్టమే. కనుక మంచి మనుషుల సంఘములతో కలసి మెలుగుచు, మంచి అలవాట్లు అలవరచుకొనుచు, మంచి ఉద్దేశ్యములు కలిగి జీవించుచూ, మంచి పనులలోనే మునిగి తేలుటద్వారా దురలవాట్లను మానుకొనవచ్చును.

చాలామంది జనులు పర్వతములవంటి తమ కష్టములను తొలగించమని దైవమును ప్రార్థిస్తారు. కానీ వారు చేయవలసిన దేమనగా అటువంటి పర్వతములను అధిరోహించుటకు ప్రయత్నించటమే.

## సాయి మహిమ

కనుచూపు తాకిన ఘన తాపములు వీడు
    పేరు తలచినంత ! పేర్మి కలుగు !
మాట విన్నంతనె ! మరుగుపడును దుఃఖ
    మలికిసైన పెతలు తొలగునయ్య !
నగవు లొలికినంత ! నయమౌను రోగాలు !
    పదము పట్టిన చాలు ! పాపమణగు
సాయి చేర పిలువ సర్వంబు చేకూరు !
    భజన చేసిన భవ బంధమణగు !

ఇట్టి దేవ విభుని ! యిలలోన గాంచము !
ధరణి ప్రజల గావ తరలి వచ్చె !
భక్తినిచ్చి దివ్య ముక్తిమార్గము చూప
పుట్టినాడు పర్తి పురమునందు !

-రాయవరపు రవి

అనగా పర్వతమంతటి పెద్ద కష్టములను కూడా ఎదుర్కొని జయించుటకు ప్రయత్నించవలెను

స్వామి లాస్ఏంజిల్సు టైములో ఇచ్చిన సందేశ మును కూడా 1994 న నవంబరు 'కాన్సాయిలైట్' ప్రకటించినది

'సాయిన్యూస్' అనబడు సత్యసాయి సంస్థల త్రైమాసిక పత్రిక (సెప్టెంబరు 94) 'స్ట్రాత్‌ఫీల్డు' పట్టణము - ఆస్ట్రేలియా నుండి వెలువడుచున్నది ఈ పత్రికకు భగవాన్ బాబావారు 'Why Avatharas Come?' "అవతారపురుషులెందుకు ఉద్భవిస్తారు" అన్న అంశముపై వ్రాసిన వ్యాసము

'భగవంతుడొక ప్రత్యేకమైన వ్యక్తికాడు మనుష్యుడు భగవంతుని ప్రతిబింబమే అని వేదములు, శాస్త్రములు చాటుచునేయున్నవి అనగా భగవంతుడు మానవరూపములోనే దర్శనమొసగునని తెలియు చున్నది. కనుక భగవంతునికొక ప్రత్యేకమైన రూపములేదు. మానవజీవితమెట్లు దివ్యజీవనముగా తీర్చిదిద్దుకొనవచ్చునే ఈ మానవ సమాజమునకు చూపించుటకే కాలచక్రములో అవసరమైనపుడు అవతారపురుషులుద్భవించుదురు.

మానవుల దుఃఖములను పోగొట్టి వారికై సుఖ సంతోషములను కుమ్మరించుటకు అవతారములు దిగి రావని నేననేకసార్లు ప్రకటించితిని దుఃఖములు, కష్టములు, బాధలు కాలచక్రములో మీమీ పూర్వజన్మ లలో మీరొనర్చిన కర్మఫలితములను బట్టి వచ్చు చుండును మానవజన్మ యను నది కర్మఫలితమే కనుక కర్మబారినుండి మీరు తప్పించుకొనలేరు

కానీ భగవంతుడు మానవాకారములో దిగివచ్చుట కనేక కారణములు గలవు మానవ జన్మకు మాత్రము అతని పూర్వజన్మ కర్మయే మూలము ప్రతిఒక మానవుని జీవితము కూడా అతని పూర్వజన్మ కర్మ పైననే ఆధారపడియుండును దుష్టులు చేసిన చెడు కార్యములు, సాధుసత్పురుషులొనర్చిన మంచి కార్యములే అవతార పురుషుల ఉద్భవమునకు కారణమగుచున్నవి.

పంటలు పెరిగి, నేలలో నీరు లేనపుడు ఆకాశము వైపుకు చూచును ఆ పైరులు ఆకాశములోని మేఘ ముల వరకూ నీటి కొరకు ఎగురలేవు. కనుక, మేఘములే నీరుగా మారి వర్షించి, పైరుకు నీరందించు టకు భూమిని చేరును

భారతీయ ఆధ్యాత్మిక తత్త్వ శాస్త్రములో పునర్జన్మ కర్మసిద్ధాంతములు, అవతార పురుషులుద్భవించుట అను మూడు మౌలిక సూత్రములు. భగవదశ్శక్తి అనునది కొంత భాగము మానవునిలో అంతర్గతముగ వస్తున్నది. కానీ అంత మాత్రముచే మానవుడు తన భూత, భవిష్యద్వర్తమానములను తెలిసికొనలేడు. భూతకాలమును నెమరువేసికొనగలడు భవిష్యత్తును వూహించగలడు, వర్తమానమును అనుభవించగలడు. వర్తమానము, భూతకాలములోనొనర్చిన కర్మఫలితమే.

కానీ మానవునికి భూతకాలము పూర్తిగా జ్ఞాపకమునకు రాదు కొంత మాత్రమే. పూర్వజన్మ తెలియదు భవిష్యత్తును సరిగా వూహించలేడు. కనుక మానవుడు వర్తమానమునే అనుసరించవలసియున్నది. ఇది చాలా క్షణికమైనది కానీ దైవమునకు వర్తమానము విశ్వ వ్యాప్తమైనది For the Divine however, the "present" is, "Omni present". అనగా వర్తమానము, భూతకాలముయొక్క ఫలితము, మరియు భవిష్యత్తునకు విత్తనము అయి వున్నది.

ఈ భూతకాల, వర్తమాన, భవిష్యత్తులను మూడు సమయములూ కూడా దైవమునకు ఉండవు దైవము దేశకాలములకు అతీతుడు అవతార పురుషులు, స్వచ్ఛంద ప్రవర్తన కలవారిని ఉద్ధరించుటకు, ఏ విధమైన ద్వేషము లేకుండా నిస్వార్థమైన ప్రేమతత్వముతో జీవించువారిని దైవమును చేర్చుటకు ఉద్భవించు చుందురు.

మానవుని ఊహాశక్తిలో, ఆలోచనలలో, అవతార పురుషులు దుష్ట శిక్షణకు శిష్టరక్షణకు అవతరించెదరని చెప్పుకొనుచుందురు.

కానీ భగవంతుని దృష్టిలో "చెడు" అన్నదే లేదు. కనుక దైవమునకు ఎవ్వరిపైననూ చెడు భావము కానీ అసహ్యము కానీ లేదు. నీవు అందరినీ ప్రేమించినపుడే నీవు దైవమును ప్రేమించితివని చెప్పుకొనదగును. నీవు ఎవరిని ద్వేషించినా కూడా దైవమును ద్వేషించినట్లే.

భగవంతుని పూర్ణస్వరూపమును ఏ ఒక్క మానవుడు కూడా పూర్తిగా చూడలేడు దీనికి కారణము మానవుడు ప్రాపంచిక తత్వము, వాదన, మొ॥ కారణములచే భగవంతునిపై తక్కువ దృష్టి ప్రసరించుటయే మానవుడు ధ్యాన అవస్థలో యోగాభ్యాసపరులైనపుడు మాత్రము భగవంతుని కొంతవరకు తిలకించుచూ, తిరిగి జాగ్రతావస్థలోనికి రాగానే ప్రపంచ విషయ వాసనలకు లోనగుచున్నారు కనుక ఎల్లపుడు భగవధ్యానములోనే గడుపుటకు ప్రయత్నించండి. ○

# ధనం - ధర్మం

ధనమే మానవుని ఉద్ధరించుచున్నదనే భావం ఈనాడు ప్రజలలో అమితంగా పెరిగిపోతున్నది అదియే మానవత్వ నిర్మూలమునకు ముఖ్యకారణం. ధనము అవసరమే గాని మితమైన ధనముతో హితమైన జీవితాన్ని గడపాలి. దానికి ఒక హద్దు ఉండాలి. మితిమీరిన ధనం మతి హానిచేస్తుంది. ధనం సంపాదించటం కంటే, సంపాదించినదానిని ఖర్చుపెట్టటం కష్టం. మిగిలిన ధనాన్ని దాచటం మరీ కష్టం. ఈ కష్టాలలో కొన్ని సుఖాలు కూడ లేకపోలేదు. కనుక ఈ ధనాన్ని పల్లెసీమల వారికి, దీనులకూ వెచ్చించి సద్వినియోగం చేయండి. ధనం పెరిగితే పశువుకు కొమ్ములు పెరిగినట్లు అశాంతి. ధనం వెంట దుఃఖం కూడా పెరుగుతుంది. ధనమున్నవానిని ఒకవైపు ప్రభుత్వం, మరొకవైపు బంధువులు, ఇంకొకవైపు దొంగలు బాధిస్తారు. ధనమున్నవాడు పడే బాధ వైవానికి తెలుసు. పుత్రులకోసం ధనమునుప్రోగుచేసినవారు పుత్రుల మూలంగానే బాధపడుతున్నారు. కనుక దానధర్మాలుచేసి మీ ధనమును సార్థకం చేసుకొనండి. "ధనమూలం ఇదం జగత్ కాదు. ధర్మమూలం ఇదం జగత్" అనేది విస్మరించరాదు.

—బాబా

# భగవాన్ సాయి సర్వజ్ఞులు

—— ఎస్. బి. శ్రీధర్

అనుమానమనే నల్లని మేఘాలు సత్యసాయి దివ్యానుగ్రహమనే సూర్యోదయంతో పటాపంచలై 'ఇది కలా ? నిజామా ?' అని నన్ను నేను ప్రశ్నించుకున్న వేళ. మా అన్నగారు డా॥ రఘునాథాచార్య (తిరుపతి సంస్కృత విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్) గారి కుటుంబంతో కలిసి మొదటిసారిగా ప్రశాంతినిలయం నిలకడలేని, సడలిపోయే నమ్మకంతో చేరినవేళ. ప్రశాంతి మందిరం ముందు వరుసలో కూర్చున్నాం. ముందుగా టోకెన్ తీస్తుంటే నాకనిపించింది. 'ఇంత మందిలో కొత్తగా వచ్చిన నన్ను దగ్గరగా రానిస్తే ఈయనలో కొంత శక్తి ఉన్నట్లే' అని అనుకుంటుండగా టోకెన్స్ తీసే సంచీ నుంచి చెయ్యి బైటికి వచ్చింది. ఆశ్చర్యం ఒకటో నెంబర్.

లోపలకు వెళ్ళి నిలయం ముందు వరుసలో కూర్చున్నాం. నా చేతిలో నేను బాబావారిని గురించి విన్న మహాత్మ్యం గురించి, తెలుగు, సంస్కృతంలో వ్రాసుకున్న స్తోత్రం పెట్టుకున్నాను మందిరం గది తలుపు తెరుచుకుంది 'దివ్య కాషాయ పరివేష భవ్యమూర్తి' అడుగులో అడుగువేస్తూ, క్రమంగా మహిళల వైపు నుంచి మా వైపుకు వచ్చారు. మా అన్నగారిని పలకరించారు 'నిన్న వస్తానన్నావ్?' అన్నారు స్వామి. 'ప్రయత్నించాను స్వామీ! ఫలించలేదు అన్నారు అన్నగారు "మీరు నన్ను చూడాలను కుంటం కాదు. నేను మిమ్మల్ని చూడాలనుకుంటేనే మీరు నాదగ్గరకు రాగలరు" అన్నారు స్వామి. ఈ కొంచెం సమయములో నాకు పాద నమస్కారం చేసుకునే అవకాశం దొరికింది సమస్త లోకభవతరణాలైన సాయి దివ్య శ్రీ చరణాలపై వ్రాలాను. కళ్ళవెంట ధారాపాతంగా నీళ్ళు ఆనందార్ణవంలో మనసు తేలి పోతున్నది

ఈవిధంగానే మరునాడూ, ఉదయ సాయంత్రాల్లో మొదటి వరుసలోనే దర్శనం లభించింది. ఇక మనస్సులో 'స్వామితో మాట్లాడాలి. నాతో మాట్లాడతారా? మాట్లాడితే ఎంత బావుంటుంది" అనుకున్నాను.

మరునాడు ఉదయం నగర సంకీర్తనలో పాల్గొనటం వల్ల ఉదయం కేంటిన్‌లో టిఫిన్ తినకుండానే దర్శనానికి వెళ్ళాము మందిరం ముందు కూర్చున్న తరువాత "స్వామి త్వరగా వస్తే బావుణ్ణు, ఆకలిగా ఉంది. కేంటిన్ మూసేస్తే బయట హోటల్స్‌లో టిఫిన్ ఎలా ఉంటుందో?" ఈవిధంగా నాలాగా మొదటిసారి నిలయానికి వచ్చిన మా బృందంలోవాళ్ళం చర్చించుచుండగా స్వామి బయటకు వచ్చారు 'సాయిరాం' అని తలచుకుంటూ కూర్చున్నాము మొదటి వరుసలో మహిళల వైపునుంచివస్తున్న స్వామి మా వదినగారిని ఇంటర్వ్యూకు పిలచి, మా అందరినీ రమ్మని ఆదేశించడంతో నా ఆనందానికి అవధులు లేవు

ప్రశాంతి నిలయం వరండాలో కూర్చున్న మమ్మల్ని 'రండి' అని మందిరంలోకి స్వామి వెళ్ళారు. మేము అనుసరించాం. మా బృందంలో అనేక రకాలవాళ్ళు ఉన్నారు ఒక బ్యాంకు ఆఫీసర్, ఒక డాక్టరు, మొ॥ వాళ్ళు. వాళ్ళందరితో ఆ చిన్న గదిలో సర్దుకున్నాం "చెప్పు బంగారూ! ఏమి సమాచారం!' అన్నారు స్వామి.

తిరుపతిలో నిర్మాణంలో ఉన్న మందిరం విషయాలు స్వామికి వివరించారు అన్నగారు తరువాత బ్యాంకు అధికారి 'స్వామి ! ఏ పని చేయాలన్నా అది సక్రమంగా పూర్తి అవుతుందో లేదోనని భయం కలుగుతున్నది భయం పోయేదెలా ?' అన్నారు దానికి స్వామి చిరునవ్వుతో నావైపు చూశారు "భగవద్గీతలోని మొదటి శ్లోకం ఏమిటి ? అన్నారు నాకు అప్పటికి 'ఆ జ్ఞానం' లేదు కేవలం 'అజ్ఞానం' తప్ప 'నాకు తెలియదు స్వామీ!' అన్నాను 'ఏం తెలుసు మీకు? ఏ హోటళ్లలో ఏం టిఫిన్స్ ఉంటాయి? ఏ హాల్లో ఏ సినిమా ఆడుతున్నది ? ఇదేగా!' అన్నారు ఈ మాట నాకు చెంప ఛెళ్ళుమనిపించినట్లు అన్పించింది అందుకు కారణం ప్రశాంతి నిలయం ముందు టిఫిన్ గురించి, ఇక్కడ సినిమా హాల్ అన్నా ఎవరూ కట్టలేదే ?' అని మా బృందంలో సాగిన చర్చలకు స్వామి చెప్పిన గుణపాఠం గట్టిగా లెంపలు వేసుకున్నాను స్వామి చెప్తున్నారు 'ధర్మక్షేత్రే.... . సంజయ' శ్లోకం మొదటిది. మొదటి పదం 'ధర్మ' ఇక చివరి శ్లోకం ఏమిటి ?' అన్నారు స్వామి నాతో 'స్వామీ ! నా విషయం తమకు తెలిసీ ఇంకా....' అని మనసులో అనుకుంటుండగా "యత్ర యోగీశ్వరః....మతిర్మమ" అన్నారు స్వామి. ఇక్కడ చివరిపదం 'మమ' మమ=నాయొక్క, ధర్మః=ధర్మము 'నాయొక్క ధర్మము' అని ప్రతి పని నీవు చేసినట్లైతే నీకు భయం ఎందుకు కలుగుతుంది ? నీవు వృత్తిరీత్యా ప్రజల డబ్బును నీ Bank లో భద్రపరచటం చేస్తుంటావు అది నీ ధర్మం (Duty). కానీ ఒకరోజు 'ఇంత డబ్బులో ఒక 10 వేల కట్ట పోతే ఎవరు చూశార్లే' అనుకుని నీ జేబులో పెట్టుకున్నావు. అప్పట్నించి 'నన్ను ఎవరైనా చూశాడేమో, ఈరోజు ఎలా ఇక్కడ నుంచి బయట పడటం' అన్న భయం నీకు పట్టుకుంది చెమట పట్టింది. కాళ్ళు వణికాయి నీవు నీ వృత్తి ధర్మాన్ని వదలి దొంగ ధర్మం (Duty) చేశావు నీవు దొంగతనం చేయనంతవరకు నిర్భయంగా నీ ధర్మం నెరవేర్చావు, నీ ధర్మం ఎప్పుడైతే తప్పావో నీకు భయం కల్గింది. ఇదే-

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః । పరధర్మో భయావహః ॥

నీవు నీ ధర్మాన్ని చక్కగా అనుసరించినంతకాలం నీకు మంచి జరుగుతుంది. నీవు పరధర్మాన్ని ఎప్పుడు ఆశ్రయించావో, ఆ పరధర్మం నీకు భయాన్ని కల్గిస్తుంది. ఇక్కడ నీ స్వధర్మం Bank లో డబ్బు రక్షించడం, పరధర్మం డబ్బు దొంగిలించటం కనుక నీవు ఏ పని చేసినా ఇది 'నా ధర్మము' అని అనుకుని చేస్తే నీవుచేసే ఏ పనిలోనూ భయం కలగదు' అని ముగించారు స్వామి "ఆహా ! ఎంతటి చక్కటి సమన్వయం' భగవద్గీతను నిత్యజీవితానికి అన్వయించటం అంటే ఇది 'నాజన్మ తరించింది' అనుకున్నాను మరో ఆశ మనసులో తలెత్తింది స్వామి సృష్టిచేసే అద్భుతదృశ్యంచూడాలి. ఆ భాగ్యం నాకుందో ? లేదో ? అనుకుంటుండగా - గదిలో ఒకపక్క ఉన్న ఒక అతనిని ఉద్దేశించి What do you want ? అన్నారు 'I want siva' అని అతని సమాధానం మొదట నీవు I = అహంకారం want = కోరిక, ఈ రెంటినీ వదులుకుంటే నీకు శివుడు దొరుకుతాడు 'శివం' అంటే శుభము, మంగళము అని అర్థం అని అతనిని ఆశీర్వదిస్తున్నట్లు గాలిలో చేయి కదల్చారు ఆశ్చర్యం ! బంగారు డాలర్ మీద శివుని ఆకృతి ఉన్న పతకం వెళ్లి ఆ వ్యక్తి దోసిలిలో పడింది అంతలో మా అన్నగారి వైపు తిరిగి, 'బంగారూ ! ఇదేమిటి ? నా కంకణం ఇలా మట్టికొట్టుకుంది ఇటివ్వు నేను wash చేసి ఇస్తాను' అన్నారు. కంకణం తీసుకుని గుప్పెట్లో ఉంచుకుని 3 సార్లు గాలిలో తిప్పి 'ఉఫ్' మని ఊది గుప్పిట తెరిచారు. ఇంతకు ముందున్న కంకణం కాదు వేరే కంకణం వచ్చింది. దాన్ని మా అన్నగారికి ఇస్తూ 'పెట్టుకో' అన్నారు. దానికి ఇంతకు ముందున్న 'కొక్కెం' పోయి 'స్క్రూ' వచ్చింది ఆ 'స్క్రూ' తీయడానికి దాదాపుగా మేము అందరం ప్రయత్నించాము రాలేదు కాసేపటి తరువాత

స్వామి చిరునవ్వుతో దాన్ని చేతుల్లోకి తీసుకున్నారు. వెంటనే తిరిగి ఇచ్చారు ఆశ్చర్యం! 'స్క్రూ' తేలికగా వచ్చింది

వేదపండితులు ఒకరు తమ ఇరువురి మనుమరాళ్ళకు స్వామిచేత పోగులు కుట్టించే నిమిత్తం వచ్చారు. స్వామి హస్తచాలనంతో రెండు జతల బంగారుపోగులు సృష్టించి స్వయంగా చెవులకు కుట్టారు. ఆశ్చర్యం! ఆ చిన్నారులకు నొప్పి లేదు చిరునవ్వులు నవ్వుతూ స్వామి ఆశీస్సులు అందుకున్నారు తరువాత విభూతి సృష్టించడానికి స్వామి హస్తం త్రిప్పుతున్నారు. నేను తదేకంగా స్వామి హస్తం వైపు చూస్తున్నాను. 'చిటచిట' శబ్దంతో విభూతి వచ్చింది. అందరికీ ఇచ్చారు. స్వామి పాదాలపై వాలాను. నా భుజంపై చేయివేశారు. నా ముఖంలోకి చూస్తూ 'లైట్ వెలగాలంటే లోపలున్న 'ఫిలమెంట్' జాగ్రత్తగా కాపాడుకోవాలి. 'ఫిలమెంట్' పోతే ఎంత విలువైన దీపమైనా వ్యర్థం అలాగే జీవితం అనే లైటు ఎక్కువకాలం ప్రకాశించాలంటే 'యౌవనం' అనే 'ఫిలమెంట్' ను జాగ్రత్తగా కాపాడుకోవాలి. సమాజసేవలో జీవితం సార్థకం చేసుకో!' అన్నారు. మళ్ళా పాదనమస్కారం అనుగ్రహించారు. అనిర్వచనీయానందంతో బయటకు వచ్చాము. సహజమైన స్వాతిశయం ఆవరించింది 'స్వామి ఇక్కడ ఉన్న 3 రోజులు మొదటి వరుసలో దర్శనం ఇచ్చారు రేపు ఉదయం దర్శనం తరువాత తిరుపతి వెళ్తాం కనుక రేపు కూడా స్వామి మొదటి వరుస దర్శనం ఇవ్వాలి' ఇది కోరికలా లేదు అదో రకమైన ధీమా సరే? మరునాడు మాకు దొరికిన టోకెన్ 7 చెంపలు గట్టిగా వేసుకున్నాను స్వామి దర్శనానికి వచ్చారు మా ముందు నుంచి కదులుతూ గట్టిగా నవ్వారు గాలిలో చేతులు ఊపుతూ ... భగవాన్ సాయి సర్వజ్ఞులు వారికి తెలియనిది అంటూ ఏమీ లేదనే విషయం నాకు ఆనాడు అర్థమైంది.

000

# నిష్కామత

కూలి కోసం నౌకరి చేసే సేవకుడి లాగ దేవుని కొలువు చేయకండి. మీరు చేసిన ప్రశంసలకు, త్యాగాలకు ప్రతిఫలం ఆశిస్తే- మీరు జీతం కోసం ఉద్యోగం చేస్తున్న సేవకులుగా తయారవుతారు. "భగవంతుని సంతోషపెట్టడానికి, ఆయన ఆజ్ఞను అనుసరించడానికి ఎన్నో తిప్పలు పడినప్పటికీ, భగవంతుడు నాకు ఏ లాభమూ సమకూర్చలేదే" అనే నిరాశ, చింత మనసులో ఉంటే- అది లాభనష్టాలు బేరీజువేసే వ్యాపారదృష్టి అవుతుంది. లాభం కోసం, ప్రతిఫలం కోసం దేవుని సేవించవద్దు. దేవుని సేవించడం నీ సహజగుణం కావాలి. అది నీ కర్తవ్యం. అదే నిజమైన పూజ. కర్మఫలమును దైవానికే సమర్పించు. అప్పుడు నీవు కూలి కోసం సేవించే నౌకరువు కావు. అప్పుడు దేవుడు నీవాడే అవుతాడు. సాధన మూలంగా భక్తుడు పొందగల ఉత్తమస్థితి ఇదే. కనుకనే శ్రీకృష్ణుడు భగవద్గీతలో "నిష్కామకర్మ"ను అంతగా ప్రశంసించాడు.

- బాబా

# శేషసాయి లీలలు - అనుభూతులు

-లోలభట్టు శ్రీనివాసరాజు

రాజమండ్రిలో యున్న మా పిన్నిగారైన నాగరాజు అన్నపూర్ణగారి శరీరంలో సాధారణంగా యుండవల్సిన ఎంజైములు, పోషక పదార్థములు ఎదుగుదల లేకపోవడంవల్ల ఎప్పుడూ విపరీతమైన గుండె నొప్పితోను ఇతర శారీరక అనారోగ్యంతోను బాధపడుతూ వుండేవారు. అనేక డాక్టర్లచే పరీక్షలు చేయించి మందులు వాడినా ఫలితం కనిపించలేదు.

నేను, మా అమ్మగారు 1993 జనవరి నెల ప్రశాంతి నిలయ సేవలకు పర్తికి వెళుతూ మా పిన్నిగార్ని కూడా తీసుకువెళ్ళాము అచ్చట బాబావారి జనరల్ ఆసుపత్రిలో రిపోర్టు చూపించి పరీక్ష చేయించగా మార్చి 23 న రమ్మని చీటీ వ్రాసియిచ్చారు.

జనవరి 13 భోగిపండుగరోజున ఉదయం పిన్నిగారికి శరీరమంతా పొక్కులు రావడం, ఉబ్బటం కన్పించింది. ఆ రోజు స్వామి దర్శన సమయంలో లైనులో కూర్చొని వుండగా బాబా అనుగ్రహం చాక్‌లెట్ రూపంలో ఆమె గుండెను తాకింది.

ఆ క్షణంలో ఒళ్ళంతా జలదరించి ఒక దివ్యాను భూతిని పొందారు సంక్రాంతి పండుగరోజు ఆమె శరీరమంతా ఉబ్బి, అనేక మార్పులు సంభవించి, ప్రాణాపాయం కలిగి పర్తినుండి సజీవంగా తీసుకు రాగలమా యని మేమంతా భయపడ్డాము. మేము సాయి మీద భారంవేసి సేవలో పాల్గొన్నాము.

ది. 15-1-95 మధ్యాహ్నం 1-15 ని॥ లకు వెస్ట్ బ్లాక్ III వరండాలో యున్నాము అప్పుడు మా జీవితంలో ఊహించని రీతిగా సాయినాధుని అనుగ్రహం లీలద్వారా జరిగింది.

మా అమ్మగారు, పిన్నిగారు భోజనం చేస్తూవున్నారు. ఒక తెల్ల చెంబులో మజ్జిగ పోసి యుంచారు. ఒక స్టీల్ గ్లాసులో పాలు పోసి, ఈ గ్లాసును మజ్జిగ చెంబులో దిగ వేసి, గ్లాసుపై మూత వుంచారు పిన్నిగారు భోజనం చేస్తూ, విషమించిన తన అనారోగ్యం గూర్చి, అస్త వ్యస్తంగా యున్న కుటుంబ పరిస్థితుల గురించి తన వేదనను అంతరంగంలో స్వామికి తెలుపుకుంటూవుండగా ఒక్కసారిగా పెద్ద శబ్దం వినవచ్చింది

ఆశ్చర్యపోతూ అటూ ఇటూ చూడగా పెరుగు చెంబులో యున్న పాల గ్లాసు పై భాగం అష్టదళరేకు లుగా చీలిపోయి క్రిందమట్టు భాగం శేషుని పడగలాగ నిలిచింది వెంటనే ఆమె గ్లాసును చెంబు నుండి పైకి తీసారు. అచ్చట యున్న భక్తులు చూసి స్వామి ప్రదర్శించిన నిదర్శనమని విశ్వసించారు.

ఇంతలో పిన్నిగార్కి ఉన్నట్లుండి విరేచనాలు ప్రారంభమై అనేకమార్లు పోయి వచ్చారు ఆ విధంగా విరేచనాలు అవడంతో, ఆమె శరీరంలో అనేక మార్పులు కన్పించాయి. ఉబ్బిన శరీరం క్రమంగా తగ్గి ఆ క్షణం లోనే యధాస్థితికి చేరుకొంది దీనితో ఆమె అనారోగ్యం చేతితో తీసివేసినట్లుగా మాయమై ఆమె ఎంతో మానసిక ఉల్లాసం పొందింది

వెంటనే చీలిన గ్లాసును స్టీలు పళ్లెంలో యుంచి స్వామి ఆశీస్సులను కోరుచూ, సాయంత్రం దర్శనార్థమై లైనులో కూర్చున్నారు.

## కర్మ ధర్మమయం కావాలి

ఎవ్వరి దుఃఖానికి ఎవ్వరూ కారకులు కారు. ఎవరి కర్మ వారు అనుభవించవలసిందే. అయితే కర్మను పరిహారం గావించుకోవటానికి భగవంతుని ప్రార్థించాలి. ముఖ్యంగా మన కర్మ ధర్మమయం కావాలి. ధర్మం బ్రహ్మమయం కావాలి. బ్రహ్మమయమైన కర్మే ఉత్తమ జన్మగా రూపొందుతుంది. అసలు జన్మే లేకుండా పోవచ్చు. కనుక జన్మ, కర్మ, ధర్మ, బ్రహ్మ— అనే నాలుగు స్తంభాల పైన జీవితం ఆధారపడి ఉందన్న విశ్వాసాన్ని మరువకుండా ఉంటారని ఆశిస్తున్నాను.

— బాబా

---

యుగావతారి మందహాస గమనంతో నేరుగా పిన్ని గారి వద్దకు వచ్చి, ఈ లీలా విశేషాన్ని తెల్పమని వ్రాసియిచ్చిన లెటరును తీసుకున్నారు ఆ గ్లాసును తమ దివ్య హస్తంతో స్పర్శించి, 'ఇది శేషసాయి' అని ప్రకటించి దగ్గరలో యున్న మా అమ్మగార్ని చూపుతూ "బంగారుకు ఇవ్వు" జాగ్రత్తగా పూజ చేసుకో అని చెప్పి, మేము షెడ్‌లో మరచిన తెల్ల చెంబు గుర్తుచేసి పూజారూమ్‌లో ఉంచమని చెప్పి ఆశీస్సులు అందజేసి ముందుకు నడచారు.

అప్పటినుండి మేము బాబా 'శేషసాయి' అవతారంగా మా ఇలవేల్పుగా భావించి, విశ్వసించి ఉదయం, సాయంత్రం అభిషేక, అర్చనాదులు చేస్తున్నాము రంగంపేట శ్రీసత్యసాయి భవన్‌లో ప్రతిష్ఠచేసి పూజలు జరుపుచున్నాము

ఆరోజునుండి పిన్నిగారి అనారోగ్యమంతా మాయమై మునుపటికంటే బలంగా ఆమె పనులు చేసుకుంటూ, మరెన్నో దివ్యానుభూతి పొందుతూ వున్నారు ప్రాణా పాయ స్థితి నుండి తప్పించి పునర్జన్మను ప్రసాదించిన అద్భుతమూర్తికి ప్రణామములు తప్ప ఏమివ్వగలమని సాయినామ స్మరణతో దివ్య జీవన గమనాన్ని సాధన చేస్తూ వున్నారు.

మరొక (స్వప్నసుందరం) సంఘటన ఏమిటంటే, మా అమ్మగారు 10 సంవత్సరములనుండి ఆయాసముతో బాధపడుతూ వుండేవారు విపరీతమైన బాధతో ఎన్నో రాత్రులు నిద్ర లేకుండా, మరే యితర మందును గ్రహించక, స్వామి విభూతి ప్రసాదాన్నే స్వీకరిస్తూ వచ్చారు.

ఒకనాటి తెల్లవారుఝామున స్వప్నంలో బాబా ప్రత్యక్షమై మా అమ్మగార్ని 'నీకు ఆరోగ్యం బాగా లేదా?' అని ప్రశ్నించగా 'బాగాలేదు స్వామీ' అని చెప్పగా, సాయి చిరుదరహాసంతో నోటిలో తీర్థాన్ని తీసుకుని మా అమ్మగారి నోటిలో పోశారు. ఆ జలమే దివ్యఔషధమై నాటినుండి నేటివరకు ఆయాసమొకటే కాక, మరే యితర వ్యాధులు ఆమె శరీరాన్ని తాకలేక పోయాయి.

ఈ విధంగా అనుక్షణం, ఆర్తులకు అండగా యుండి ఆపదలనుతొలగిస్తూ, ఆశ్రితులనురక్షించే ఆపద్బాంధవుడు శ్రీ సత్యసాయి బాబావారి సమకాలీనులుగా జన్మించిన మన అదృష్టము ఏమని చెప్పగలము.

'విశ్వాసమే విష్ణువై రక్షిస్తుంది' అనే సాయివాణి అనుభవ సత్యమై నిలిచింది సాయినామ స్మరణతో బోధనలను ఆచరణలో పెడుతూ, సాయి సేవలో జీవితాన్ని గడుపుతూ దివ్యపథాన్ని చేరుటకు ఈ క్షణం నుండే కార్యోన్ముఖులవుదాం మా నవ జీవితానికి ధన్యత గావిద్దాం

( 8 వ పేజీ తరువాయి )

అసలు కర్మలను ఆచరించనవసరమేలేదని కొందరు వాదిస్తుంటారు. ఇది సరియైన అవగాహనకాదు. శ్రీకృష్ణుడు ఆయా స్థాయినిబట్టి బోధలు సలుపుతూ వచ్చాడు. ప్రతి మానవుడు ప్రథమస్థాయిలోవల కర్మలనాచరించాలి. కర్మలు ఆచరించకుండా సోమరి తనములు అభివృద్ధిపరచుకోరాదు సోమరితనమును అభివృద్ధిపరచుకోరాదు సోమరితనమును దైవము అంగీకరించడు, మెచ్చుకోడు. కనుక కర్మలనాచరిస్తూ నిష్కామకర్మలో ప్రవేశించాలి. అది క్రమక్రమేణ యోగముగా మార్చాలి. యోగమును యజ్ఞముగా అభివృద్ధిపరచాలి. ఈ యజ్ఞములో సర్వమునూ త్యాగం చేయాలి. ఇదియే గీతయొక్క ప్రధానమైన అంతరార్థ మని చెప్పారు బాబా

## దోషములు-క్లేశములు

"కుల, బల, యౌవన, సౌందర్య, విద్యా ధన, తపో, రాజ్య మదములు ఎనిమిది. కామ,క్రోధ,లోభ, మోహ, మద, మాత్సర్య ములనే అరిషడ్వర్గములు ఆరు. మరియు రజో, తమో గుణములు రెండు మొత్తము 16 దోష ములు చేరటంవలన మానవుడు కళాశూన్యుడు, కళా హీనుడై పోతున్నాడు. మానవునిలో ఈ దోషములు అభివృద్ధికావటంచేతనే తాను తానుగా ప్రకాశించ లేకపోతున్నాడు. ఐదు క్లేశములు కూడా అడ్డు వస్తున్నాయి." అని బాబా చెప్పారు.

క్లేశములనగా బాధలు అవి 1. అవిద్యా క్లేశము 2. అభినవ క్లేశము 3. అస్థిత క్లేశము 4. రాగ క్లేశము 5. ద్వేష క్లేశము.

1. అవిద్యా క్లేశ మనగా నేను జీవుడను, దేవుడను కాను, స్వతంత్రుడను కాను, పరతంత్రుడను, బలహీను డను అనే భావం కలిగివుండుట ఈ భావం మానవుని బలహీనునిగా చేస్తుంది. 2. అభినవ క్లేశ మనగా సంసారమునకు హేతువైన మనస్సును త్యజించ లేక బలహీనమై ఉండటం మనస్సే మన బంధములన్నిటికీ మూలకారణం. మన సత్త్వాన్ని తెలుసుకోలేక బలహీనమై ఉంటూ అనేక దుఃఖములకు విచారములకు గురి అవుతున్నారు. 3. అస్థిత క్లేశమనగా సర్వవిషయములు, సకల సుఖములు అనుభవించాలన్న దురాశ. ఈదురాశలో విఫలమైతే లోభము ప్రారంభ మవుతుంది. తరువాత అహంకారం పెరుగుతుంది. దురాశ, జయాపజయముల వలన మానవత్వం క్షీణిస్తూ కృశించిపోతుందే గాని ఏమాత్రం వికాసం పొందదు 4. రాగ క్లేశ మనగా ధనకనకవస్తువాహనాదులు కావాలని అభిలషించడం. ఈ విధమైన వాంఛలు మానవుని వెనుకంజ వేయిస్తాయేగాని ముందుకుసాగనీయవు. 5 ద్వేషక్లేశమనగా ఉదరపోషణ నిమిత్తమై ఇతరులను ఆశ్రయించి, తాను ఆశించిన ఫలం దక్కకపోవటంచేత దూషణలకు దిగటం. ఇది మానవుని మరింత హీనస్థితికి గొనిపోతుంది. ఇది పూర్ణత్వం నుండి హీన స్థితికి దిగజారుస్తుంది

మానవుడు 16 దోషములు, 5 క్లేశములచేత కప్ప బడటం వలన తానుతానుగా ప్రకాశించలేకపోతున్నాడు. తననుతాను తెలుసుకోవటమే నిజమైనతత్త్వము. సమస్త సాధనలు సలుపుతూ 'మాయ' అనే తెరను తొలగించు కుంటే తానుతానుగా ప్రకాశిస్తాడు ఈ పరమ సత్యమును గుర్తించాలంటారు బాబా

ఎన్ని సాధనలు సలిపినా, మనస్సులో మాలిన్యం తొలగించుకొనని యెడల ప్రయోజనం లేదు మాలిన్యం పైదొలగి, మనస్సు నిర్మలంగా ఉండాలంటే సత్సంగమం కావాలి, సత్సాంగత్యం వుండాలి అప్పుడే మన మనస్సులో సత్సంకల్పాలు బయలుదేరుతాయి. "సంకల్పములే మానవుని ప్రధానమైన ఆస్తి" అంటారు బాబా. సత్సంకల్పాల వలన సంస్కారము అబ్బుతుంది. మనస్సు నిర్మల మవుతుంది హృదయం

పవిత్రమైన భావాలకు నిలయమవుతుంది అప్పుడు ఏ దోషములు, క్లేశములు మానవుని బాధించవు

## దీనత్వం - హీనత్వం

“దానములు చేయటంచేత మానవునకు తరిగి పోవునదేదియూ లేదు. దానము చేయకపోవటం చేతనే మానవుడు దీనుడై జన్మిస్తున్నాడు. ఈనాటి మానవుని యందున్న హీనత్వానికి గాని, దీనత్వానికి గాని, తనకు కలిగిన పదార్థములను అంతో ఇంతో తనవారికి అందించకపోవటమే కారణము” అని అంటారు బాబా ఉన్నవారు పూర్ణంగా భుజించి అనుభవించటం కంటే, లేనివారికి అంతో ఇంతో అందించటం మానవ ధర్మం. దానము మానవుని లౌకిక జీవితమునకు, మానసికమైన తృప్తిని అందించే ఒక మార్గము “అదాన దోషేణ భవేద్దరిద్రః” ‘దానం చేయకపోవటంచేతనే జీవుడు దరిద్రుడై జన్మించును’ అన్నారుగదా! మనపూర్వీకులు ‘దేయం దీన జనాయ చ విత్తం’ దీనులకు, దరిద్రులకు తనకున్న దానిలో కొంత ఇచ్చి సాయం చేయటం మంచి దని శాస్త్రములు కూడా చెబుతున్నాయి అటుల చేయకుండా, తాను తినక, ఇతరులకు పెట్టక యావత్ సంపదను కూడబెట్టే లోభికి ఏమాత్రం మనశ్శాంతి ఉండదు ఏదో ఒక విధంగా, ఎప్పుడో ఒకప్పుడు ఆ సంపద హరించుకుపోతుంది. తాను సంపాదించిన సంపదలో కొంత భాగమును విధిగా ధర్మకార్యములకు న్యాయసమ్మతంగా వినియోగించని పక్షంలో పన్నుల రూపంలో రాజు (ప్రభుత్వం) ఆ సంపదను కొంత స్వాధీనం చేసుకొంటాడు. అన్ని ప్రమాదములు సంభవించి దాచిన సంపద ధ్వంసమవుతుంది దొంగలు పడి దాచిన సొమ్మును దోచుకుంటారు. కనుక ప్రతి వ్యక్తి తాను సంపాదించిన సంపదలో కొంత భాగమును దానధర్మములకు, సత్కార్యములకు కేటాయించవలెను. పశుపక్ష్యాదులకు పెట్టవలెను

దానధర్మములకు వినియోగించు ద్రవ్యము ఇహమునందును, పరమునందును తిరిగివచ్చును. స్నేహితులకు వినియోగించు ద్రవ్యము ఇహమునందు మాత్రమే తిరిగి వచ్చును భోగముల కొరకు దుర్వినియోగం చేయు ద్రవ్యము ఇహమునందు గాని, పరమునందు గాని తిరిగిరాదు

“మితిమీరి దానం చేస్తే గతి తప్పి నడువ వలసి వస్తుంది, భరించలేనివానికి దానం చేసినా, లేక తనకు శక్తిలేని దానిని దానం చేసినా ఇరువురూ బాధపడక తప్పదు. భరించుకొనే శక్తి గలవారికి ఇచ్చినప్పుడే దానానికి సార్థకత” అని అంటారు బాబా. ఇది విజ్ఞులతో కూడిన హెచ్చరిక, అందువలననే మన పెద్దలు “పాత్రమెరిగి దానము క్షేత్ర మెరిగి విత్తనము” అన్నారు. అపాత్రదానం చేయకూడదు. అర్హత లేనివారికి యిస్తే, దానిని దుర్వినియోగం చేస్తారు. కనుక దానం చేసేటప్పుడు విచారించి వితరణ చేయాలి. “పిల్లవానికి బంగారు బొమ్మ నిచ్చినా, పిచ్చివాని చేతికి కత్తి నిచ్చినా ఎంత ప్రమాదమో” ఆలోచించండి అంటారు బాబా

భగవాన్ బాబావారు అప్పుడప్పుడూ ప్రసంగాల మధ్య విసిరే చమత్కారాలను కేవలం హాస్యదృష్టితో స్వీకరించక, వాటి అంతరార్థములను కూడా అవగాహన చేసుకొని నిత్యజీవితంలో వాటిని ఆచరణలో పెట్టి జీవితాలను సరిదిద్దుకొని, సార్థకం చేసుకుంటారని ఆశిస్తున్నాను.

భగవాన్ సాయి దివ్యలీలలు

# రిచర్డ్ థామ్సన్ (Richard Thompson)

—సేకరణ : కె. వెంకటేశ్వరరావు

శ్రీ రామకృష్ణ పరమహంస ఇలా చెప్పేవారు. "సముద్రం అంతటా వ్యాపించి ఉంటుంది కాని చలి బాగా ఎక్కువగా ఉన్నచోటే గడ్డకట్టి సముద్రం మంచు కొండగా ఆకారం ధరిస్తుంది అలాగే భగవంతుడు సర్వత్రా నిరాకారంగా వ్యాపించి ఉంటాడు భక్తి, జిజ్ఞాస ఎక్కువైనచోట మాత్రమే ఆకారం ధరించి ప్రత్యక్షమౌతాడు "

ఈ క్రింది సంఘటన పై వాక్యాల్లోని నిజాన్ని తెలుపుతుంది.

రిచర్డ్ థామ్సన్ ఇంగ్లండులోని లండన్ నగరనివాసి. అతడు యూదు మతస్థుడైనా క్రైస్తవ మతం స్వీకరించాడు 1957 తో ఘనా దేశం నుండి లండన్‌లో వ్యాపారం పెట్టి ధనమార్జించాడు.

వ్యాపారం అభివృద్ధి చెంది, ధనం సంపాదించిన తర్వాత థామ్సన్‌కి ఒక జిజ్ఞాస మొదలైంది. ''మనిషి ధనం సంపాదించడానికేనా పుట్టింది?'' అని

ఆ ప్రశ్నకు సమాధానం తను వారానికోసారి వెళ్ళి ప్రార్థన చేసే చర్చిలో దొరుకుతుందేమో నని అన్వేషించాడు ఆ చర్చికి యూదు మతం నుండి క్రైస్తవ మతంలోకి మారినవారే వస్తారు ప్రార్థనలలో గాని, అక్కడ చేసే బోధలలో గాని అతనికి సమాధానం దొరకలేదు అప్పుడు థామ్సన్ ముస్లిం మత గ్రంథాలు 5 సంవత్సరాలపాటు చదివాడు ముస్లింలుచేసే విధానం గానే ప్రార్థనలు చేశాడు అయినా అతనికి మనశ్శాంతి లభించలేదు. బౌద్ధ మతం, మరికొన్ని మతాల గురించిన పుస్తకాలు తీవ్రంగా అధ్యయనం చేశాడు. అయినా అతని అనుమానాలు ఎక్కువైనాయే గానీ సమాధానం లభించలేదు. ప్రతి మతం ఒక దేవుడిని గురించి చెప్తుంది. "ప్రపంచంలో ప్రజలందరికీ ఒకే దేవుడుండడా ?'' అని అన్పించింది థామ్సన్‌కి.

అది 1983 వ సంవత్సరం సెప్టెంబరు నెల థామ్సన్ తన గదిలో కూర్చుని ఏదో చదువుకుంటుండగా, ఒక వ్యక్తి నేరుగా లోపలకు వచ్చాడు అతనికి పెద్ద జుట్టు, పొడుగాటి అంగీ ఉన్నాయి నవ్వుతూ ''నా పేరు సాయిబాబా'' అని చెప్పి, నేనొక ఉపాధ్యాయుడిని, నీవు దైవాన్ని గురించి తెలుసుకోవాలని తపన పడుతున్నావు. అది తెలియజేయటానికి వచ్చాను" అన్నారు సాయిబాబా.

బైబిల్ తెప్పించి, బైబిల్‌ను గురించి, క్రీస్తు చేసిన బోధనలను గురించి చెప్పారు స్వామి. ప్రతిరోజూ అదే సమయానికి వచ్చి బోధ చేసేవారు ఒక్క థామ్సన్‌కి మాత్రమే తప్ప, ఆ ఇంట్లో ఉన్న అతని భార్యకుగాని, పిల్లలకు గానీ స్వామి కనిపించేవారుకాదు.

''సాయిబాబా అంటే ఎవరు?'' అని అనేకమందిని అడిగాడు థామ్సన్ కానీ అతని స్నేహితులు గాని, పరిచయస్థులు గాని ఎవ్వరూ సాయిబాబా అంటే ఎవరో చెప్పలేకపోయారు.

లండన్‌లో ఉన్న థామ్సన్‌కి స్వామి ప్రతి రోజూ వచ్చి బోధచేస్తూనే వున్నారు ''దైవం ప్రేమ స్వరూపుడు. మనమంతా భగవంతుని పిల్లలం మతం అనేది మనం ధరించే వస్త్రం వంటిది. మహమ్మదీయులు, క్రైస్తవులు, హిందువులు, ఈ భేదాలు మనం సృష్టించుకొన్నవే. మనం ధరించే వస్త్రాలు మన శరీరంలో

ఎలా భాగాలు కావో, అలాగే ఈ మతాలుకూడా మనలో భాగాలు కావు. మనలో ఉన్నదే ముఖ్యం. మనలో ఉన్న ఊపిరే అందరిలోనూ వున్నది. అందరూ ఒకే గాలి పీలుస్తారు" అని బోధ చేసారు.

ఈవిధంగా సుమారు నాలుగు మాసాలపాటు స్వామి లండన్‌లోని థామ్‌సన్ ఇంటికివెళ్ళి ప్రతిరోజూ బైబిల్ బోధ చేసారు. క్రీస్తు భారతదేశం దర్శించాడనికూడ చెప్పారు థామ్‌సన్‌కి స్వామి సాక్షాత్తూ క్రీస్తుప్రభువు వలె అనిపించారుగానీ ఉపాధ్యాయుడిగా అనిపించలేదు. స్వామి బోధలతో అతనిలో వున్న ఆవేదనలు చల్లారి, అతని ప్రశ్నలకు సమాధానాలు దొరికాయి స్వామి సలహాపై కొన్ని పుస్తకాలు కొని చదవటం ప్రారంభించాడు. అవి చదువుతుంటే స్వామి బోధలు ఇంకా బాగా అర్థమవుతున్నట్లనిపించింది.

స్వామి దాదాపు నాలుగు నెలలు వాళ్ళింటికి వెళ్ళినా, థామ్‌సన్ భార్యగానీ, పిల్లలుగానీ సాయిబాబా తమ ఇంటిని దర్శిస్తున్నారని నమ్మలేదు. థామ్‌సన్‌కి ఏదో దయ్యంపట్టి ఉంటుందనికూడ భావించారు, భూతవైద్యుని సంప్రదించాలనుకొన్నారు.

ఈలోగా ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. ఒకరోజు థామ్‌సన్ భార్యకి హఠాత్తుగా గుండెపోటు వచ్చింది, ఆమె చాలా బాధపడుతున్నది. థామ్‌సన్ డాక్టర్‌ని పిలవాలని ఫోన్ దగ్గరకు వెళ్ళుతుండగా స్వామి ఆ గదిలో ప్రవేశించారు. తన చేత్తో థామ్‌సన్ చేయిపట్టుకొని ఆ చేతిని ఆమె గుండెలమీద పెట్టారు. స్వామి థాంసన్‌కి మాత్రమే కనిపించారు గానీ ఆయన భార్యకు కనిపించలేదు. కానీ తన భర్త ఫోన్ వద్దకు వెళ్ళి మరలా వెనుకకు వచ్చి ఎవరివంకో చూస్తున్నట్లు చూస్తూ ఆయన చేతిని తన గుండెలమీద పెట్టడం గమనించింది, వెంటనే బాధ నివారణ అయింది.

థాంసన్ భార్యకు ఇదేదో అద్భుతంలాగా తోచింది దాదాపు నాలుగు నెలలపాటు ప్రతిరోజూ వచ్చిన స్వామి ఆ తర్వాత మరిరాలేదు సాయిబాబా. ఎవరు అనేది థాంసన్‌కి అర్థం కాలేదు. ఇది జరిగిన ఆరు నెలల స్వామి ఫోటో ఉన్న పుస్తకం ఒక పుస్తకాల షాపులో చూచాడు థామ్‌సన్. ఆ పుస్తకం చదివాక, స్వామి భారతదేశంలో పుట్టి ఇప్పుడు సశరీరులుగా ఉన్న ఒక అవతారమని అర్థమైంది. లండన్‌లో ఉన్న సత్యసాయి బాబా సెంటరు చిరునామా ఆ పుస్తకంలో ఉంది. థాంసన్ అక్కడకు వెళ్లి తన అనుభవాలను చెప్పాడు. అక్కడి భక్తులంతా ఆశ్చర్యపోయారు, వాళ్ళు స్వామిని గురించిన అనేక పుస్తకాలను ఇచ్చి, ఇతర భక్తుల అనుభవాలు చెప్పారు. థాంసన్ భార్యకు, పిల్లలకు స్వామి దైవత్వంమీద నమ్మకం కుదిరింది.

స్వామి థాంసన్‌కి బైబిల్ బోధ చేయడమే కాక, అతనికి తెలియకుండా రెండు శక్తులు ప్రసాదించారు. ఎవరికైనా ఎంత జటిలమైన సమస్య ఉన్నా, దానికి పరిష్కారమార్గం చిటికెలో చెప్పగలుగుతున్నాడు. డాక్టర్లు నయం చేయలేని జబ్బులున్న రోగులను, స్వామిని తలచుకొని ఆరోగ్యవంతులను చేస్తున్నాడు "ఇవన్నీ చేసేది స్వామియే, నన్ను కేవలం ఓ పనిముట్టుగా వాడుకుంటున్నారు స్వామి'' అని అంటాడు థాంసన్.

విచిత్రమైన విషయమేమిటంటే, స్వామితో థాంసన్‌కి నాలుగు నెలల సాంగత్యం లభించినా, భారతదేశం వచ్చి స్వామిని భౌతికంగా దర్శనం చేసుకోలేదు. థాంసన్ ఇప్పటివరకు ''సమస్యలతో నాదగ్గరకు వచ్చిన ప్రతి వాళ్ళలో స్వామిని చూసుకుంటున్నాను'' ఇంక భారత దేశం వెళ్ళటమెందుకు ?" అంటాడు థాంసన్.

)-○-(

# అద్వితీయ దివ్యశక్తి సంపన్నుడు భగవాన్ బాబా

-జొన్నా సుబ్రహ్మణ్యం

మానవజీవితం చాలా విచిత్రమైనది. జీవితంలో చిత్రవిచిత్రమైన సంఘటనలు ఊహించని రీతిలో కొన్ని జరుగుతుంటాయి. కొన్నింటినిమాత్రం ముందుగానే ఊహించగలుగుతాం. మంచి జరుగుతే సంతోషిస్తాం. చెడు జరుగుతే తమను తామే నిందించుకుంటాం, దురదృష్టవంతులమని భావిస్తాం. పరులనుదూషిస్తాం, చిట్టచివరికి భగవంతునిమీదకూడా నిందమోపటానికి ఏమాత్రం వెనుదీయం. ఇది మానవ సహజ ప్రవృత్తి. ఇది అనాదిగా వస్తున్న సహజ పరిణామమే. తరాలు తరలిపోతున్నాయి, యుగాలు దొరలిపోతున్నాయి. మనిషి బుద్ధి మాత్రం మారటంలేదు. అయినా మానవుని యొక్క భౌతిక శరీరం Physical Body మాత్రం మారుతునే ఉన్నది. శైశవము నుండి బాల్యమునకు, బాల్యమునుండి యౌవనము, యౌవనమునుండి వార్ధక్యమునకు మారుతునేఉన్నాడు. కాని మానవుని మనస్సు మాత్రం మారటంలేదు. ఇదే సృష్టి చిత్రం విచిత్రం. అయితే కొన్ని సంఘటనలు చూచినప్పుడు కొందరి మనస్సు కరిగిపోతుంది. మరికొందరి మనస్సు కఠినశిలగా మారిపోతుంది. ఎవరి మనస్సు, ఏ విధంగా, ఎప్పుడు, ఎందుకు మారుతుందో చెప్పలేం.

నా పేరు జొన్నా సుబ్రమణ్యం నా గృహలక్ష్మి పేరు జొన్నా విజయలక్ష్మి. మాది నెల్లూరు జిల్లా కోవూరు తాలూకా తలమంచి గ్రామము మాకు 1976 సం॥లో వివాహమైంది. విద్యావతి, గుణవతి అయిన విజయలక్ష్మి నా గృహలక్ష్మిగా, మా ఇంటిలో అడుగు పెట్టింది. ఆమె రాకతో నా గీత మారింది నా ఆర్థిక స్థితి మెరుగైంది నేను చేపట్టిన ప్రతిది విజయవంతమవుతుండేది. మా దాంపత్య జీవితం ఆనందోల్లాసాలతో సాఫీగా జరిగిపోతుండేది. అయితే అనుభవించడానికి కావల్సినంత భౌతిక సిరిసంపద ఉన్నప్పటికీ మనశ్శాంతి మాత్రం లేకుండా పోయింది. కారణం ? పెండ్లి అయి 12 సంవత్సరాలు కావస్తున్నా పిల్లలు లేరనే బాధ నా శ్రీమతిని కలచివేస్తుండేది. అది ఒకరు తీర్చేది కాదు, ఆర్చేది అంతకన్నా కాదు హే భగవాన్! అన్నీ యిచ్చి నాకు ఈ ఒక్కటి ఎందుకు లోటు చేశావయ్యా? అని నాలోనే బాధపడేవాడను. బయటకు నా బాధను తెలియబరుస్తే నా శ్రీమతి యింకా కుమిలిపోతుందేమోననే భయంతో లోలోననే భగవంతుని ప్రార్థించేవాడను, ఇలా కొంత కాలం జరిగింది ఎంతోమంది దేవుళ్ళకు మ్రొక్కాము, తీర్థ యాత్రలు సలిపాము పుణ్యక్షేత్రాలను సందర్శించాము. భక్తితో భజనలు చేసాము ఎన్నో పుణ్య కార్యాలు నిర్వహించాము. బీదలకు, పేదలకు వీలున్నంతగా సహకారం అందించాం. ఎన్నో పుణ్య కార్యాలను చేసాం ఏ దైవమూ మాకు వంశోద్ధారకుని ప్రసాదించి యుండలేదు చిట్టచివరకు, ఎట్టకేలకు భగవంతునిమీదనే విరక్తి జనించే సమయంలో మరొక మహనీయునకై ప్రయాణం. మద్రాసు మజిలిలో దివ్య స్వప్నం. భార్యా భర్తలు నిద్రించు సమయమున కలగన్నది కాదు, "వరం పొందినది".

కలలో వాడు కైవల్య దేముడు
ఇలలో వాడు ఈశ్వరాంబ తనయుడు

పండితుని పవిత్రుని భాసించెను. అభయ మొసగి అదృశ్యమయ్యేను. మిత్రుల సలహాలతో ముఖ్యంగా నా ఆత్మీయుడు, స్నేహితుడు, శ్రేయోభిలాషి అయిన శ్రీ లంకా వెంకట సుబ్బయ్య ప్రోద్బలంతో 'నడిచే దేవుడు' పుట్టపర్తిలో ఉన్నాడని తెలుసుకొని ఆ మహనీయుని సందర్శించడానికి పుట్టపర్తికి ప్రయాణమై వెళ్ళినాము.

ఏ జన్మలో ఏ పుణ్య కార్యాలను చేశానో నాకు తెలియదు. ఏ సత్కర్మల నాచరించానో అంతకన్నా తెలియదు, ఏ జీవికి ఏ సేవ చేశానో, ఎవరి కష్టాలను పంచుకున్నానో, ఏ అభాగ్యుని కన్నీరుని తుడిచివేశానో నాకు తెలియదు. కాని ఈ జన్మలో అందరికీ దొరకనిది మాత్రం నాకు దొరికింది. దుర్లభమైన దానిని నేను అందుకున్నాను అదే .... అదే....భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి అనుగ్రహం పొందగలిగాను వారి దివ్యాశీస్సులను అందుకోగలిగాను, మహామహులకు కూడా లభ్యం కాని భగవత్ సాన్నిధ్యం నాకు లభించింది. నా జీవితం ధన్యమైంది.

అది ప్రశాంతి నిలయం. అదే ప్రేమ సాయి మందిరం. శాంతి, ప్రేమలకు నిలయం, అదే సాయినాథుని ఆలయం సత్యధర్మములకు నిలయం. అదే సత్యసాయి నిలయం. సర్వ మానవాళికి జ్ఞాన భిక్షను ప్రసాదించు జ్ఞాన కేంద్రం. మానసిక శాంతిని ప్రసాదించు ధ్యాన కేంద్రం అదే శాంతి ప్రేమలను పెంపొందించు దివ్య ప్రేమధామం యావత్ ప్రపంచాన్ని ఆకర్షిస్తున్న కేంద్రం 'ప్రశాంతి నిలయం' ఆ మందిరం ప్రాంగణంలో భక్తులవద్దకే నడచివచ్చే దేవుడు భగవాన్ శ్రీ సత్యసాయి బాబా !

అది నవంబరు 1వ తేది, 1987వ సంవత్సరం. మా జీవితగమనం మారిన శుభదినం అదే. భగవాన్ సాయి దివ్యానుగ్రహమును పొందిన పుణ్యదినం అదే. ఎన్నో సంవత్సరాలనుండి దేనికోసం పరితపిస్తున్నామో, అమూల్య పవిత్ర పదార్థమును ప్రసాదించిన పవిత్ర దినం అదే. అతి దుర్లభమైన ప్రత్యేకమైన ఇంటర్వ్యూను మా దంపతులకు భగవాన్ బాబా ప్రసాదించిన దివ్యాతిదివ్యమైన సమయం అది. ఆ ఇంటర్వ్యూలో స్వామి మా దంపతులను చూస్తూ "బంగారూ! పిల్లలు లేరని ఆందోళన చెందుతున్నారు గదా! నేను మీకు కొడుకుని ప్రసాదిస్తాను, వాడికి నేనే పేరు పెడతాను" అని మా దంపతులను స్వామి దీవించారు. ఆనాడు మేము పొందిన ఆనందానికి అవధులు లేవు, వర్ణించడానికి మాటలు చాలవు. నా శ్రీమతి అయితే పరమానందభరితురాలైంది. నోట మాట రాలేదు. లోలోనే భగవాన్ సాయికి కృతజ్ఞతలు చెప్పుకున్నాం. నా భార్యకు 818 డైమండ్స్ కల్గిన చెవిరింగులు సృష్టించి ఇచ్చినారు ఆ తర్వాత స్వామి దివ్యరూపము కలిగిన డాలర్ చైనును సృష్టించి ఇచ్చినారు. ఇంటర్వ్యూ గది నుంచి బయటకు వచ్చాం.

"భగవాన్ సాయి అద్వితీయ దివ్యశక్తి సంపన్నుడు, సర్వజ్ఞుడు వారి శక్తి అనంతం, అనిర్వచనీయం ఈ చరాచర సృష్టిలో వారికి తెలియనిది అంటూ ఏదీలేదు వారి ఆశీస్సుల ప్రభావం అనంతం వారి మాట ఎన్నటికీ వృథా కాదు. వారి ప్రతి మాట కార్యరూపం దాలుస్తుంది. వారు చెప్పింది అక్షరాల నిజమవుతుంది వారి వాక్కు వేదవాక్కు" అని మా వెంకటసుబ్బయ్య బయటకు రాగానే చెప్పాడు ఒక చంప మిత్రుల మాటలు వింటుంటే బాబాపై పెరిగే అచంచలమైన విశ్వాసం మరో చంప బంధువర్గం విమర్శనలు వింటున్నప్పుడు కలిగే బాధ ఈ రెంటి మధ్య కొంతకాలం జీవితం గడపవలసి వచ్చింది మా బంధువర్గంలో బాబామీద నమ్మకం ఉన్నవారికన్నా అపనమ్మకం గలవారే ఎక్కువ. వారి సూటిపోటి మాటలకు నా శ్రీమతి బాధ పడుతుండేది. 'మంత్రాలకు చింతకాయలు రాలుతాయా' అని అమ్మలక్కలు అవహేళనచేస్తుంటే కుమిలిపోయేది. మానసికశాంతి కోసం తరచుగా పుట్టపర్తి వెళ్లి స్వామిని దర్శించి వచ్చేవాళ్ళం.

1989 సం॥లో మా దంపతులకు స్వామి మరల ఇంటర్వ్యూ ప్రసాదించారు. ప్రత్యేకమైన గదిలోనికి పిలిచి ''ఏదీ! నీ కొడుకు!'' అని నా భార్యను ప్రశ్నించారు, అప్పుడు నా భార్య ఏడుస్తూ 'అప్పుడు మీరు చెప్పారుగాని, ఇంతవరకూ ఏమీలేదు' అన్నది. అప్పుడు బాబా "మీరు తొందరపడవద్దు. పవిత్రమైన పదార్థమును ప్రసాదిస్తాను. ఎప్పుడు ఎవరికి, ఏది ఇవ్వాలో నాకు బాగా తెలుసు" అన్నారు. అంతా మీ దయ స్వామి అన్నది నా భార్య. నా వరకు నాకు బాబా దివ్యశక్తిమీద సంపూర్ణమైన విశ్వాసం ఉన్నది బాబాను ఎవరు ఎన్ని విధాల విమర్శించినా, చులకనగా మాట్లాడినా, నాకు బాబామీద వుండిన విశ్వాసం మాత్రం ఈషణ్మాత్రం సడలలేదు. మానవజీవితం అనేక కష్టాలతో, వేదనలతో, ఆవేదనలతో కూడుకొని ఉంటుంది ఒక్కొక్క సమయములో అపవాదులను ఎదుర్కొనవలసి వస్తుంది. అపనిందలను భరించవలసి వస్తుంది అప్పటివరకు తోడు, నీడగా ఉండినవారు సహితం దూరమైపోతారు. ఏకాకిగానే పయనించవలసి వస్తుంది వేదనలు, ఆవేదనలు, అపవాదులు, అపనిందలు— వాటికి తట్టుకొని నిలబడితే, ఒకవిధంగా వ్యక్తిత్వం యినుమడిస్తుందే గాని, అతని ప్రతిష్ఠ ఏమాత్రం తగ్గదు అదే విశ్వాసంతో, బాబా మీద వుండే భక్తిప్రపత్తులతో, ఏదో ఒక రోజున ఆయన పలికిన పలుకు వృథాకాదనే నమ్మకంతో, వంశోద్ధారకుని అనుగ్రహిస్తారనే విశ్వాసంతో సమితి సేవలతో పాల్గొంటు వస్తున్నాం.

స్వామి 65వ జన్మదినోత్సవ వేడుకలలో పాల్గొనడానికి నెల్లూరు నుండి పుట్టపర్తి బయలుదేరి వెళ్ళాం. నవంబర్ 23వ తేదీన భగవాన్ బాబావారి దివ్యసన్నిధిలో భక్తప్రహ్లాద సినిమాను అక్కడి విద్యార్థులకు చూపించగలిగాను. పిల్లలు, పెద్దలు ఆ సినిమాను చూచి తన్మయులైనారు సినిమా పూర్తి అయ్యేసరికి రాత్రిగం 9-30 ని అయ్యింది. బాబావారు నన్ను ప్రేమతో దగ్గరకు పిలిచి 28 డైమండ్స్‌తో పొదగబడిన స్వామివారి దివ్యసుందర రూపంతోవున్న బంగారు ఉంగరమును సృష్టించి అక్కడనున్న పిల్లలందరికీ చూపించి నా వేలికి స్వామియే స్వయంగా తొడిగారు ఆనాడు భగవాన్ బాబావారికి హారతి యిచ్చే మహద్భాగ్యం కూడా నాకు కల్గించి జన్మదిన వేడుకలు తరువాత వెంటనే బయలుదేరి నెల్లూరుకి వచ్చాం కొంతకాలం తరువాత నా శ్రీమతి హాస్పిటల్‌లో పరీక్ష చేయించగా 'గర్భవతి' అని డాక్టర్లు చెప్పారు. ఆనాడు మేము ఆనందంతో భగవానుని ప్రార్థించాం, కృతజ్ఞతలు మనసులోనే చెప్పుకున్నాం

వైట్ ఫీల్డులో నున్న స్వామి కాలేజీ పిల్లలకు చూపించడానికి భక్త ప్రహ్లాద సినిమాను తీసుకొని రమ్మనమని కబురు వచ్చింది. అన్నీ సిద్ధం చేసుకొని అక్కడకు వెళ్ళాను ఆ రోజు జనవరి 28 స్వామి దర్శన కోసం నిరీక్షిస్తున్నాము. అడుగులో అడుగు వేసుకుంటూ, పరిసరాలలో నున్న భక్తులను పరికిస్తూ, సరాసరి స్వామి నావద్దకు వచ్చి ''ఎన్నో మాసం?....ఎన్నో మాసం?"...అని అడిగారు 'నాల్గవ మాసం స్వామీ!' అన్నాను కాదు....కాదు... ఐదవ మాసం అంటూ విభూతి ప్రసాదమును సృష్టించి నా చేతిలో పోసి 'నీ భార్యకివ్వు' అని నవ్వి వెళ్ళిపోయారు. డాక్టర్ల లెక్క ప్రకారం నా శ్రీమతికి నాల్గవ నెల బాబావారి ఆజ్ఞ ఐదవ నెల 'బాబావారి వాక్కే వేదవాక్కు' అనే నమ్మకంతో అప్పుడప్పుడు బాబా దర్శనం కోసం వెళ్ళుతుండేవాడిని స్వామి నా భార్య యోగక్షేమములను విచారించి విభూతి ప్రసాదం యిచ్చి పంపుతుండేవారు 9 నెలలు నిండటానికి 15 రోజులు ముందుగానే మద్రాసు అపోలో హాస్పటల్‌లో చేర్పించి అప్పుడప్పుడు నా శ్రీమతి పరీక్షకోసం సర్జన్ స్వర్ణకుమారికి చూపించాం అప్పుడే ఎందుకు తొందర. ఎనిమిదవ నెలయే గదా! అన్నది అప్పుడు బాబా చెప్పిన విషయాన్ని చెప్పాను నా మాటను కాదన

లేక స్కానింగ్ వగయిరా పరీక్షలు చేసింది బిడ్డ ఆరోగ్యంగానే ఉన్నాడని చెప్పింది. జూన్ 28వ తేదీకి (1991 సం॥) 9 నెలలు పూర్తి అయినవి బాబా చెప్పిన ప్రకారము సరిగా అదే రోజున నా శ్రీమతి ప్రసవించింది డాక్టర్లు అందరూ ఆపరేషన్ థియేటర్ నుండి బయటకు వచ్చి 'Your BABA is Great అన్నారు నా కళ్ళ వెంబడి ఆనందభాష్పాలు జలజలరాలాయి. హృదయం లోనే బాబాకు కృతజ్ఞతలు చెప్పుకున్నాను

భగవాన్ బాబావారి అనుజ్ఞతో, బాబావారి జన్మ దినోత్సవం రోజున అనగా ది 23-11-1991 న హిల్ వ్యూ స్టేడియంలో బాబావారి దివ్యసన్నిధిలో హరిశ్చంద్ర నాటకమును ప్రదర్శించినాము భక్తులు చూచి ఆనందించారు ది 24-11-91న మా అందరికి (20 మందికి) స్వామి ఇంటర్వ్యూ ప్రసాదించారు ఆసందర్భంలో స్వామిషిర్డీ సాయి జన్మ వృత్తాంతమును గురించి వివరించారు మా అందరికి వస్త్రములు ప్రసాదించారు పాద నమస్కారములు యిచ్చారు, మావారంతా పరమానందభరితులైనారు బయటకు వచ్చేటప్పుడు 'స్వామీ ! నాకు ఒక రూం ప్రసాదించండి !'' అన్నాను "ఇదిగో నీ రూం యిక్కడ ఉన్నది" అని స్వామివారి వక్షస్థలమును చూపించారు ఈ మాటను మనం అర్థంచేసుకుంటే స్వామి తాత్విక చింతన మనకు బోధపడుతుంది ''భక్తుని స్వస్థానం భగవంతుని హృదయమే గదా ! అట్టి స్వ స్థా న ము ను చేరుకోవటంకోసమే భక్తులు తాపత్రయపడుతుంటారు అట్టి పరమోత్కృష్టమైన స్థానమును నాకు స్వామి ప్రసాదించినందులకు నాజీవితం ధన్యమైంది.

''స్వామీ ! బాబుకు 5 నెలలు పూర్తి కాబోతున్నవి వాడికి నామకరణం చేయండి స్వామి!'' అన్నాను ''ఎప్పుడు తీసుకుని వస్తావ్?'' అని అడిగారు స్వామి. 2.వ తేదీ వస్తున్నారు స్వామీ!' అన్నాను 'రమ్మను! రమ్మను!' అని సెలవిచ్చారు 26 రాత్రికే నాశ్రీమతి వాళ్ళు వచ్చారు ఆ ఉదయం బాబుని తీసుకుని దర్శనం కోసం కూర్చున్నది నా శ్రీమతి స్వామి వచ్చి బాబును చూచి 'చలి! చలి!' అంటూ వస్త్రము సరిగా కప్పి వెళ్ళారు. నావద్దకు వచ్చి 'చూచాను! చూచాను! అన్నారు "ఈరోజు, రేపు అష్టమి, నవములు గదా! దశమిరోజున పిలుస్తానులే ! అనిచెప్పి వెళ్ళారు సరిగా 30వ తేదీ సాయంకాలం మా దంపతులను ఇంటర్వ్యూకు పిలిచారు బాబును తీసుకొని వెళ్ళాం. ఆ ఇంటర్వ్యూలో అప్పటి అనంతపూర్ జిల్లా కలెక్టర్ శామ్యూల్, IAS మరియు సూపర్ స్పెషాలిటీలోని ప్రముఖ డాక్టర్ భట్ గార్లు కుటుంబంతోసహా వున్నారు మేము లోపలికి పోగానే Oh! Boy; How are you, How are you అని Good boy, Good boy అని, "వీళ్లకు 15, 16 సం॥ల నుండి పిల్లలు లేరు వారి బంధువులకు ఈబాబా మీద విశ్వాసం లేదు. నేను ఎప్పుడో చెప్పాను కొడుకు పుడతాడని నా అనుగ్రహంతోనే వీడు పుట్టాడు. 'వీడిని చూడండి! నన్నే చూస్తున్నాడు' అని అన్నారు. వెంటనే లోపలికివెళ్ళి, ఒక పట్టుశాలువాను తీసుకొని వచ్చి బాబుకు కప్పారు ఒక తీపి కలకండను సృష్టించి బాబు నోటిలో పెట్టారు. 'వీడు Good B y, వీడు నన్ను తప్ప ఎవరినీ చూడటంలేదు' అంటూ స్వామి దివ్యరూపం ఉన్న బంగారు చైన్ డాలరును సృష్టించి బాబు మెడలో వేశారు ఇవన్నీ చూస్తుంటే మా ఆనందానికి అవధులులేవు మా నోటి వెంబడి మాటరాలేదు, కృతజ్ఞతలు చెప్పుకుందామంటే నోరు పెగలలేదు కళ్ల వెంబడి ఆనందబాష్పాలు ప్రవహిస్తున్నాయి 'ఏం పేరు పెట్టారు ?' అని అడిగారు స్వామి 'పేరు కాదు గదా! పుట్టినప్పటినుంచి ఒక్క ఫోటో కూడా తీయలేదు ఏది జరిగినా.... అంతా బాబాతోనే జరగాలి స్వామి' అన్నాను 'వీడు ఎప్పుడు పుట్టాడు ?' అని అడిగారు స్వామి 'జూన్ '28 (1991 సం)' అన్నది నా శ్రీమతి పుట్టిన తిధి ఏమిటని అడిగారు. నేను మరచిపోయి 'సప్తమి' అన్నాను కాదు... కాదు.... విదియ తదియలలో పుట్టాడని చెప్పి ఏవో లెఖ్ఖలు వేళ్ళతో వేసి 'స్వభాను.

అని "సాయి స్వభాను" అని నామకరణ చేశారు. "'స్వ' అంటే స్వయంప్రకాశం 'భాను' అంటే సూర్యుడు ఇది చాలా మంచి పేరు. నేనింతవరకు ఎవరికీ పెట్టలేదు, వీడికి చాలా బాగుంటుంది" అని వెంటనే నా భార్య చేతిలోనున్న బాబును తీసుకొని, మమ్మలనిద్దర్ని వారికి ఇరుప్రక్కలానుంచోమని ఫోటో తీయించారు తరువాత బాబును నా భార్యకిచ్చి "వాడు చూడు! నన్నే చూస్తున్నాడు, నన్నే చూస్తున్నాడు" అంటూ ఫోటో గ్రాఫర్‌ను పిలిచి నేను వాడిని చూస్తున్నట్లు,నన్ను వాడు చూస్తున్నట్లుగా అనగా ఒకరినొకరు చూచుకుంటున్నట్లుగా ఫోటో తీయమన్నారు (ఆ ఫోటో ఈ వ్యాసం మధ్యలో పొందపరచబడింది. గమనించ ప్రార్థన) తరువాత లోపలి గదిలోనికి రమ్మనమన్నారు. అక్కడ బాబుకు అన్నప్రాశన చేశారు తలనీలాలు కూడా (పట్టు వెంట్రుకలు) వారే కట్ చేసారు. తరువాత బాబును నా వళ్ళో కూర్చొపెట్టుకొనగా శాస్త్రోక్తంగా ఆశీర్వచనంచేసి అక్షింతలు చల్లి మమ్మ దీవించారు. మా జన్మ తరించింది.

అక్షరాభ్యాస ముహూర్తం 1994 సం॥ జూన్ 30 వ తేదీగా బ్రహ్మశ్రీ పమిడిమర్రి వెంకటేశ్వర్లుగారు రెండు నెలలు ముందుగానే నిర్ణయించారు రెండు రోజులు ముందుగా బృందావనం చేరుకున్నాం. జూన్ 28 బాబు పుట్టినరోజు కాబట్టి స్వామి వచ్చి దీవించి వెళ్లారు మరల 30వ తేదిన స్వామి చేత అక్షరాభ్యాసం చేయించాలని ఒక బ్లాకులో కూర్చున్నాం అది సప్తమి గురువారం స్వామి వచ్చారు, భక్తుల మధ్య తిరుగాడి కొంతమంది భక్తులను పరామర్శించి, తిరిగి వెళ్ళటానికి వేదిక మెట్లు ఎక్కుతున్నారు, మా వైపు రానేరాలేదు. నేను బాధపడుతూ, స్వామిని వేడుకుంటూ, కన్నీరు కారుస్తున్నాం, ముహూర్తం తప్పిందేమిటా? అని బాధ పడుతున్నాము వెళ్ళుతూ, వెళ్ళుతూ స్వామి గిర్రున వెనక్కు తిరిగి మేము కూర్చున్న బ్లాకుకు వచ్చి నన్ను పలకరించి, నా చేతిలోనున్న పలకను తీసుకొని ఒక వైపున దేవనాగర లిపిలో 'ఓం' వ్రాసారు రెండవ వైపు తెలుగులో 'ఓం' వ్రాసారు. నాకు పాదనమస్కారం ఇచ్చారు అందరూ ఆశ్చర్యంతో చూస్తున్నారు. స్వామి సహజంగా పలక మీద ఒక వైపునే 'ఓం' వ్రాస్తుంటారు కాని మా పలక మీద రెండు వైపులా వ్రాయటంలో ఏదో విశేషం ఉండి ఉండాలి దానిని కాలమే తెలియజేస్తుందేమో!

ఒక పర్యాయం నామిత్రుడు లంకా వెంకట సుబ్బయ్య శ్రీ కామరాజు అనిల్ కుమార్‌గారితో ఈవిధంగా చమత్కరించినారు అప్పుడు అనిల్ కుమార్‌గారు ఆనందాన్ని వ్యక్తపరుస్తూ మన మిత్రుడు లంకా చెప్పినది నీకు శక్తి ఉంటే సువర్ణాక్షరాలతో చెక్కించుకో నీ జీవిత గాథ, నీ వ్యక్తిత్వము పరిపూర్ణముగా వచ్చినది, మా లంకా చెప్పినది.

"ఆశీర్వదించువాడు ఆదిదేవుడు
తలవంచినవాడు మంచితలవాడు
తలమంచివాడు
తనువు నర్పించినాడు, తనయుని పొందినాడు,
భార్యకన్న, బిడ్డకన్న, భాగ్యముకన్న
బాబా మిన్న అన్నాడు జోన్నా,
నీ జన్మ ధన్యము కదరా ఓ అన్నా."

స్వామి నాకు ఎన్నోసార్లు ఇంటర్‌వ్యూలను ప్రసాదించారు. అమూల్యమైనవాటిని అనుగ్రహించారు అన్నిటికన్నా మించిన వంశోద్ధారకుని ప్రసాదించారు గత 9సం॥లలో స్వామి సన్నిధిలో 18 భక్తి సినిమాలను ప్రదర్శించే మహద్భాగ్యం నాకు కల్గింది. అంతేకాదు నాలుగైదు సార్లు భగవానునికి హారతి ఇచ్చే భాగ్యం కూడా కలిగింది సత్య హరిశ్చంద్ర నాటకములను కూడా స్వామి సన్నిధిలో ప్రదర్శించే అవకాశం కూడా లభించింది. ఇంకా ఇంతకన్నా ఈ జన్మకు కావల్సింది ఏమున్నది? మహామహులకు కూడా దక్కని మహాభాగ్యం నాకు దక్కింది. ఇది నిజంగా నా పూర్వ జన్మ సుకృతమే ఏ జన్మలో ఏమి చేశానో నాకు తెలియదు గాని ఈనాడు భగవాన్ సాయి అనుగ్రహమును అందుకోగలుగుతున్నాను వారి ప్రేమామృతమును ఆస్వాదిస్తున్నాను ఇదేవిధంగా నాలుగు కాలాలపాటు వారి దివ్యానుగ్రహము నా యెడల, నా కుటుంబం యెడల సర్వదా వుండాలని ప్రార్థిస్తూ, అర్థిస్తూ, వేడుకుంటున్నాను ○

నరక చతుర్దశి సందేశం

# సత్యమార్గంలో ప్రవేశించి దుర్గుణములను దూరం గావించిన

# దినమే 'నరక చతుర్దశి'

-భగవాన్ సాయి దివ్య సందేశం

"అస్థిరం జీవనం లోకే
అస్థిరం యౌవనం ధనం
అస్థిరం దారాపుత్రాది
ధర్మః కీర్తిర్ద్వయం స్థిరం"

**ప్రేమస్వరూపులారా!**

ఈ ప్రకృతి యందు జీవితం కేవలం ఒక నీటి బుడగ వంటిది. ఇది ఎప్పుడు? ఎక్కడ ఏ విధమైనటువంటిస్థితిలో ఈ బుడగ పగిలిపోవునో చెప్పలేం. యౌవనం, ధనం కేవలం మధ్యలో వచ్చి మధ్యలో పోయేవే. దీనికి ఆది, అంత్యము నేటటువంటిదిలేదు. ఎప్పుడు వచ్చునో, ఎప్పుడు పోవునో ఎవరూ నూ చెప్పలేరు. మధ్యలో వచ్చి, మధ్యలో పోయేటటువంటి ఈ యౌవనమును గురించి గర్వించనవసరం లేదు. దారాపుత్రాదులు కూడనూ స్థిరమైనటువంటి వారు కాదు. కదిలిపోయే మేఘములవంటివారు. కనుక ఇవి ఏవి కూడనూ నిత్యసత్యమైనటు వంటివి కావు. చేసిన ధర్మం, సంపాదించిన కీర్తి— ఇవి రెండూ కూడనూ సూర్యచంద్రాదులుండినంతవరకునూ శాశ్వతంగా ప్రకాశిస్తూ ఉంటాయి.

నిత్యసత్యమైన దివ్యత్వాన్ని గుర్తింపజేసుకొని, మానవత్వాన్ని సార్థకం గావించుకోవటమే, ఈ జీవికి పరమావధి. క్షీర సాగరమువంటి మానవ హృదయము ఈనాడు దోషాల సాగరంగా మాలిన్యమైపోయింది. పాల సముద్రమనగా భగవంతుడు పవ్వళించేటటువంటి ప్రదేశము. అదియే మానవుని హృదయము. ఈ హృదయం పాలవలె, పవిత్రంగా, పరిశుద్ధంగా తెల్లగా ఉంటుంది. ఈ పాల సముద్రంలో తిమింగలములు గాని, మకరములు గాని ప్రవేశించుటకు వీలుకాదు. కాని ఈనాడు రాగద్వేషములనే మకర తిమింగలములు, ఈ హృదయములో ప్రవేశించి, ఈ 'క్షీర సాగరమును క్షార సాగరముగా మార్చివేస్తున్నాయి' ఇది కాదు. లోపల ఉన్న మాలిన్యమును వెలుపలికి పంపాలి. పవిత్రమైన పదార్థములను లోనకు చేర్చుకోవాలి. ఇట్టి స్థితిని ఈనాడు మనం మరచిపోయినాం. మలిన పదార్థములు మన కడుపులో వుండినంతవరకు, రుచికరమైన, పవిత్రమైన పదార్థములు ఇందులో ప్రవేశించుటకు వీలుండదు. అదేవిధంగా మనలో వుండినటువంటి దుర్గుణములను, దురాలోచనలను, దుర్బుద్ధులను దూరం గావించి, సదాలోచన, సత్ప్రవర్తన, సచ్చింతన అనేటువంటి మంచి పదార్థములను ఇందులో ప్రవేశపెట్టాలి. భారతీయుల పవిత్రమైన పర్వదినములన్నియూ, ఇట్టి పరిశుద్ధమైన పారమార్థిక తత్వమును ప్రబోధించే నిమిత్తమై ఏర్పడినవే గాని, కేవలం ఆహారవిహారములతో మాత్రమే తృప్తి పొందేటటువంటివి కావు. ఈ పర్వదినములు

అనాది కాలము నుండి "లోకా స్సమస్తా సుఖినో భవంతు" అనేటటువంటి ఆధ్యాత్మిక తత్వమును ప్రజలకందించి సర్వుల సుక్షేమాన్ని ఆశించినది భారతదేశం.

ఆనాటి మహనీయులు ఈ పవిత్రమైనటువంటి, దివ్యమైనటువంటి తత్త్వమును అనుభవించే నిమిత్తమై జీవితమును గడుపుతూ వచ్చారు. కాని ఈనాటి ఆధునిక యుగమునందు ఇట్టి పవిత్రతే కంటికి దూరమైపోయింది. నిరంతరం తాపత్రయములతో, అంతులేని ఆశలతో, అర్థంకాని ఆవేదనలతో అప్రాప్తరూప ప్రాప్తికై ప్రాకులాడేటటువంటి ఈనాటి మానవత్వం లోపల దివ్యత్వమనేటటువంటిది దూరమైపోయింది. ఏ కార్యమునందు చూచినా, అతి తేలికయైన మార్గమును కావాలని ఆశిస్తున్నాడు ఈనాటి మానవుడు. సూక్ష్మమైన మార్గమును అనుభవించాలని ఆశిస్తున్నాడు మానవుడు. ఇది అసాధ్యం.

"అనిత్యం అసుఖం లోకం" ఈ లోకమే అనిత్యం, అసుఖం. ఇట్టి అసత్యమూ, అసుఖమైనటువంటి ఈ జగత్తునందు పుట్టి; నిత్యమూ, సత్యమూ, ఆనందము కావాలని ఆశిస్తున్నాము. తాము ఆశించినది నెరవేరకుండిన దైవమును విమర్శిస్తూ వుంటారు. ఎట్టి విత్తనము నాటుతామో, అట్టి మొక్కే వస్తుంది, ఎట్టి తిండి తింటామో అట్టి త్రేనుపే వస్తుంది. కనుక మనం నాటుకొనినటువంటి విత్తనం మంచిదై వుండాలి. మనం విషపు విత్తనములు నాటి తీయని ఫలములు ఆశిస్తే లభించవు. మంచి ఫలితములు కావాలని ఆశించినప్పుడు మంచి కార్యములలో ప్రవేశించాలి. అయితే ఈనాటి మానవునియందు పవిత్రమైనభావములు ఆవిర్భవించడం లేదు. ఎవరియందు చూచినా స్వార్థం స్వప్రయోజనమే కనిపిస్తున్నది. ఈనాడు స్వార్థమునకు, స్వప్రయోజనమునకు అదుపు లేకుండా పోయింది. పరిమితము లేనటువంటి ఈ స్వార్థ ప్రయోజనములచేతనే ఈనాటి మానవుడు అశాంతికి గురియైపోతున్నాడు. కనుక జీవితానికి ఒక పరిమితం (Limit) కావాలి. ఆదర్శవంతమైన కర్మలతో ప్రవేశించాలి.

"పుణ్యస్యఫల మిచ్ఛంతి, పుణ్యం నేచ్ఛంతి మానవాః, న పాప ఫల మిచ్ఛంతి, పాపం కుర్వంతి సర్వదా". అనగా పాప ఫలమును నాకక్కరలేదని ఆశిస్తున్నాడు మానవుడు. కానీ పాప కర్మలు చేయడానికి మాత్రం ముందంజ వేస్తున్నాడు. పుణ్య ఫలము కావాలని ఆశిస్తున్నాడు. కానీ పుణ్య కార్యములకు ముందంజ వేయటంలేదు. ఎట్లా మనకు పుణ్య ఫలము ప్రాప్తిస్తుంది? పుణ్యమనగా ఏమిటి? అనేకత్వములోని ఏకత్వమును గుర్తించటమే పుణ్యము. దానినే వ్యాసులవారు 18 పురాణములసారమును ఒక్క వాక్యంలో చెప్పారు. "అష్టాదశ పురాణేషు వ్యాసస్య వచనద్వయం, పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్." ఏమిటి ఇందులో వున్నటువంటి పుణ్యం? దానములు, ధర్మములు, సత్కార్యములు చేయటం, సహాయము చేయటం భౌతికమైన, ప్రాకృతమైన ఈ జగత్తునందు ఇది పుణ్యముగా మనం భావిస్తున్నాము. ఇది కాదు మన పుణ్యం. తన తత్త్వమును, తన స్వస్వరూపాన్ని తాను గుర్తించడానికి ప్రయత్నం చేసేటటువంటిదే పుణ్యం. తానే సత్, చిత్ ఆనందస్వరూపుడై వుండి కూడనూ అట్టి సత్, చిత్, ఆనందమైనటువంటి దానిని బయట ప్రపంచంలో వెతకటానికి ప్రయత్నిస్తున్నాడు. ఈ దృశ్య కల్పితమైన ఈ జగత్తునందు వెతికేటటువంటి ఆనందము తనయందే వున్నదనేటటువంటి సత్యమును గుర్తించటమే మన పుణ్యము. ఏ ఆనందము, తనయందే ఉన్నది గాని బయట ప్రపంచములో లేదు. ఒకవేళ బయట ప్రపంచములో చిక్కినను, అది తాత్కాలికమైన ఆనందమే గాని, సుస్థిరమైనది కాదు. అందరియందూ ఉండినటువంటి ఆత్మతత్త్వమే నాయందూ ఉన్నది, నాయందు ఉన్నటువంటి ఆత్మ తత్త్వమే సర్వ జీవులయందూ కూడా ఉంటున్నదనే ఏకాత్మభావమే నిజమైనటువంటిపుణ్యము. అలాంటి పుణ్యమును ఈనాడు అనేకత్వముగా భావించు కొని, ఒక్కొక్క జీవియందు ఒక్కొక్క ఆత్మ ఉంటున్నదని విభజించడమే పాపము. అతను వేరు, నేను వేరు; అది వేరు ఇది వేరు–ఇదియే పాపం, ఏకాత్మ తత్త్వమును

మనం భిన్నత్వంగా విభజించటమే పాపం. పరులను కొట్టడం, పరులను హింసించడం – ఇది కాదు పాపం. ఇది కేవలం మృగ లక్షణాలు.

"ఈశ్వరః సర్వ భూతానాం". మానవుడు దివ్యమైనటువంటి ఆత్మ స్వరూపుడు. ఆ సత్యమును మనం గుర్తించాలి. ఇక్కడ ఎన్నో రంగుల బల్బులు వెలుగుతున్నాయి. ఒక్కొక్క బల్బులో ఒక్కొక్క రంగులో కరెంటు ఉన్నట్లుగా మనకు గోచరిస్తున్నది. బల్బులు వేరైనా కరెంటు మాత్రం ఒక్కటే. మన దేహములు బల్బులవంటివి. ఈ బల్బు అనే దేహము లోపల, దివ్యమైనటువంటి ఆత్మ తత్వమనేటటువంటి కరెంటు సర్వత్రా వ్యాపించి ఉన్నది. నీ కంటికి కనిపించక పోవచ్చు. కనిపించనంత మాత్రమున లేదని భావించరాదు. ప్రతిదానియందును ఒక అంతర్భూతమైన శక్తి ఉంటుంది. కనుక భగవంతుడు లేని స్థానం లేదు. "సర్వతః పాణిపాదం, తత్సర్వతోక్షి శిరోముఖం; సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి". తానులేని స్థానము కాని, తను కాని పేరు లేని జగత్తుగో కానరాదు. పేర్లు వేరువేరుగా పెట్టుకోవచ్చును. రూపములు వేరువేరుగా కనిపించవచ్చును. కాని అన్నిటియందూ వుండినటువంటి ఈ శక్తితత్వము (Energy) అనేటటువంటిది మాత్రం ఒక్కటే. ఈ జగత్తులో ఎక్కడ చూచినా దివ్యమైనటువంటి శక్తియే ప్రసరిస్తూ ఉండాలి. కాని దానిని గుర్తించడానికి తగిన ప్రయత్నం చేయటంలేదు. ప్రయత్నిస్తే తప్పక విజయాన్ని సాధించవచ్చును." 'సాధనమున పనులు సమకూరు ధరలోన'. ఏసాధనలూ చేయకుండా ఫలితం ఏవిధంగా దక్కుతుంది? సర్వత్రా ఉండినటువంటి దివ్యత్వాన్ని అనుభవించడానికి ఒక విధమైన 'అపేక్ష' మనయందు ఉండాలి.

మొట్టమొదట ఈ 'అపేక్ష' కు 'ఉపేక్ష' కు ఉండినటువంటి తత్వాన్ని మనం గుర్తించాలి. 'అపేక్ష' అనేది సార్థముతో కూడినటువంటిది. 'ఉపేక్ష' అనేది త్యాగముతో చేరినటువంటిది. త్యాగముతో ఉండినటువంటి ఆనందం మనకు దేనియందూ లభ్యంకాదు. కనుక మనం అట్టి త్యాగంలో ప్రవేశించాలి. ఏమిటి ఈ త్యాగం? ఆస్తిని వదలటమా? ఆలు బిడ్డలను త్యజించటమా? ఇది కాదు త్యాగం. మనయందున్న దుర్గుణములను త్యాగం చేయాలి. మృగ లక్షణాలను దూరం చేయాలి, పశుత్వాన్ని దూరం గావించాలి. అదియే 'భక్తి' అన్నారు. భక్తి అంటే కేవలం పూజలు, వ్రతములు, భజనలు చేయటం కాదు. మానవునియందున్న మృగ లక్షణాలను దూరం చేయాలి. పశుత్వాన్ని నిర్మూలనం గావించి, పశుపతి తత్వాన్ని అభివృద్ధి గావించాలి. అదియే మానవుని ప్రధానమైన విశిష్ఠత.

"జంతూనాం నరజన్మ దుర్లభమ్" నరజన్మమేమిటి? 'నర' అంటే ఏమిటి? 'రః' అనగా నాశనము. 'న' అనగా కానటువంటిది. 'నరః' అనగా నాశనము కానటువంటిఅమృతతత్వమే ఈమానవత్వము. దేహము కాలిపోవచ్చు, కూలిపోవచ్చు, రాలిపోవచ్చును. కాని దివ్యత్వమైనటువంటి తత్వము ఏనాటికీ మారునటువంటిది కాదు. అట్టి మారని తత్వాన్నిమనం పొందాలి. అయితే ఈనాడు పశువులకు వున్న బుద్ధి కూడా మానవులకు లేకుండా పోతున్నది. 'ఆకారము, మానవత్వము, ఆచారము కేవలం పశుత్వం'. ఈ పశుత్వమును దూరం చేసే నిమిత్తమే ఈ ఆధ్యాత్మికమార్గంలో ప్రవేశించడం జరిగింది. మనకు డిగ్రీల వలన గౌరవం రాదు. సంపాదన వలన మనకు గౌరవం రాదు. మన గౌరవం ఎక్కడ ఉన్నది? మనల్ని ఎవరు ఏ విధంగా గౌరవించాలని ఆశిస్తున్నామో, ఆ విధంగా మొట్టమొదట నీవు ఇతరులను గౌరవించాలి. ఇతరులు నిన్ను ఏవిధంగా ప్రేమించాలని నీవు అనుకుంటున్నావో, ఆ విధంగా నీవు మొట్టమొదట ఇతరులపైన ప్రేమను చూపాలి. కాని ఈ ఆధునిక యుగంలో ఇవన్నీ అక్కరలేదు. ఇతరుల సంగతి నాకవసరంలేదు, నాకు లభించేది నాకు లభించాలంటున్నారు. ఈ స్వార్థమే పశులక్షణమన్నారు. Give and Take ఇచ్చిపుచ్చు

కునే తత్వములో నీ జీవితాన్ని గడపాలి. అయితే ఈనాడు ఇచ్చుకోవటం లేదు, పుచ్చుకోవాలని ఆశిస్తున్నారు "మా యింటికి వస్తే ఏమి తెస్తావ్? మీ యింటికి వస్తే ఏమి ఇస్తావ్?" ఇది ఈనాడు మనం ఆశించేది ఇది కాదు, మనలో వుండినటువంటి పవిత్రతను, దివ్యత్వాన్ని పదిమందికి మనం పంచాలి వేల రూపాయలు సంపాదిస్తున్నాం ఎందుకు ఇవన్నీ అగ్నిలో పెట్టి కాల్చడానికా? ఈ రూపాయలు మనకేమైనా శాంతినిస్తున్నాయా? లేదు, కాగితాలను చూచి సంతోషించే జీవితం ఒక జీవితమా! పవిత్రతను చూచి నీవు ఆనందించాలి మానవుడై పుట్టినందులకు మానవుడుగా జీవించాలి ఇదే నిజమైనటువంటి మానవత్వం

ధనము వస్తుంది, పోతుంది. కానీ గుణం వస్తే మాత్రం అభివృద్ధి అవుతుంది (Money comes and goes, but morality comes and grows) ఇలాంటి అభివృద్ధి అయ్యేటటువంటి గుణమును ఈనాడు పెంచుకోవాలి తల్లిదండ్రులను గౌరవించాలి మొట్టమొదట విద్యార్థులు నేర్చుకోవలసింది అదే "విద్యా వినయ సంపన్నః" వినయం లేనటువంటి విద్య ఒక విద్యా? ఈనాటివారికి వినయమే లేదు వినయం లేనటువంటి వారు పశువుతో సమానం సాకిన కుక్కను దగ్గరకు పిలిస్తే, ఎంతో ప్రేమతో తోకఆడిస్తూ దగ్గరకువస్తుంది రక్తాన్నిచ్చి, ధనాన్నిచ్చి, చదువులు చెప్పించి, పెంచి పెద్దచేసినటువంటి తల్లిదండ్రులకే గౌరవం ఇవ్వకపోతే ఇక మన జీవితం ఎందుకు? మనం అనుభవించేటటువంటి ఆనందాన్ని పదిమందికి పంచి ఆనందించాలి అదియే నిజమైన మానవత్వం

ఈనాడు నరక చతుర్దశి దుఃఖముతో కూడినటువంటి దానిని నరకమంటారు న....ర...క 'క' ఇవి దుర్గుణములకు లక్షణము. 'నరక' అనగా దుర్గుణములతో కూడిన నరత్వము అని నరకమునకు. గొని పోయే మానవత్వము అని, అలాంటి దానిని ఏవిధంగా సాధించాడు కృష్ణుడు? అసలు కృష్ణుడనగా ఎవరు? దేవకీదేవుని కుమారుడని, యశోద కుమారుడని భావిస్తున్నాం ఇదికాదు, "కర్షతీతి కృష్ణః" అనగా ఆకర్షించేటటువంటి దివ్యత్వం అట్టి ఆకర్షించేటటువంటి దివ్యత్వం ఏమిటి? అదియే Magnet (అయస్కాంతం) మాగ్నెట్ అంటే ఏమిటి? అది పరిశుద్ధమైనటువంటి శక్తి, తేజస్సు అదియే శక్తి తరంగములు అట్టి శక్తి తరంగములు సర్వత్రా వ్యాపించి ఉంటున్నాయి కనుక అట్టి Vibration (కంపనము) యే నిజమైనటువంటి కృష్ణ తత్వము ఆ వైబ్రేషన్‌యే ప్రాణ సమానం ఆ ప్రాణ సమానమైనటువంటి వైబ్రేషన్ దివ్యత్వమునకు కళంకం కలగకుండా చూస్తుంది అదియే 'ప్రజ్ఞానం బ్రహ్మ' అదియే 'రేడియేషన్' (ప్రకాశం) ఆ రేడియేషన్, వైబ్రేషన్ రెండూ చేర్చి ఈ దేహమును కదిలింపజేసి, పోషింపజేసి, ఈ దేహమును జగత్తులో జీవసింప జేస్తుండాలి ఇదియే "ఓం భూర్భువః స్వః" ఇదియే గాయత్రీ మంత్రమునందు ఉండిన అంతరార్థము. కనుక మనయందు ఈ వైబ్రేషన్, ఈ రేడియేషన్ ఈ మెటీరియలైజేషన్—ఈ మూడూ ఏకమైనటువంటి జీవితమే మానవ జీవితము కనుక మనలో నున్నటువంటి దుర్గుణములు, దురాలోచనలు, దుశ్చింతనలు అనేటటువంటి ఈ నరకాసురుని చంపాలి. ఈ దుర్గుణాలను చంపడానికి కృష్ణుడు సత్యభామను సహాయం తీసుకున్నాడు 'సత్యభామ' అంటే ఏమిటి? 'భామ' అనగా భరించేటటువంటిది. సత్యముతో భరించేటటువంటిది. కనుక సత్యమును ఆధారం చేసుకొని ఈ దుర్గుణములను హతమార్చాడు శ్రీకృష్ణుడు సత్యమును ఆధారము చేసుకొని అసత్యము, అనిత్యమైనటువంటి దుర్గుణములను నిర్మూలనం చేశాడు. కనుక మనం ఈనాడు సత్యమును ఆధారం చేసుకోవాలి "సత్యం నాస్తి పరో ధర్మః". ఈ సత్యము కేవలం ఒక రాష్ట్రమునకు, ఒక దేశమునకు, ఒక వ్యక్తికి మాత్రమే సంబంధించినటువంటిది కాదు. సర్వులకూ సంబంధించినటువంటిది, కాలాతీతమైనటువంటిది సత్యం. సత్యము

పైవనే ఈ జగత్తు ఆధారపడి ఉన్నది. కనుక సత్యమే దైవము (Truth is God) కనుక సత్యమార్గమునే అనుసరించు సత్యమును పలుకు, అదియే నీ ప్రధాన మైన సాధన.

రాక్షసగుణములను ఈనాడు మనం నిర్మూలనం గావించాలి. దైవచింతనచేసి, మనలో నున్న దుర్గుణము లను దూరం గావించుకొని నేను మానవుడననే సత్యాన్ని నిలపాలి. అంతేగాని మానవజన్మ ఎత్తి, పశుపక్ష్య మృగాదులవలె జీవించటం కాదు. ఎంత సంపాదించినా, మనం ఏమి తీసుకొనివెళ్లుతున్నాం? 'కీర్తి' అనే ఒక దానినే మనం సంపాదించాలి. 'మంచివాడు' అనే పేరును సంపాదించాలి. ఆ ఒక్క పేరు మాత్రమే శాశ్వతంగా నిలిచిపోతుంది. కనుక ధర్మము, కీర్తి— ఈ రెండింటిని కాపాడుకునే నిమిత్తం మన జీవితంలో ప్రతిక్షణమునూ వినియోగించుకోవాలి. కనుక ఈ సత్యమార్గంలో ప్రవేశించి, దుర్గుణములను దూరం గావించిన దినమే ఈ 'నరక చతుర్దశి'.

ఈనాడు దీపావళి.... దీపావళి.... అని పటాసులు కొట్టి, శబ్దాలు వాయించి, మతాబులు కాల్చి ఆనందాన్ని అనుభవిస్తున్నాం. ఆనాటి దేవతలు ఏవిధంగా అనుభవించారంటే దుర్మార్గుడైన నరకాసురుని హతం చేయటం చేతనే, ఈనాడు చాలా ఆనందమని భావించి, మందు సామానులు కాల్చి ఆనందంతో ఉప్పొంగిపోయారు. ఇంతియేగాక ఈ పటాసులు కొట్టటంలో కూడా మరొక అర్థం ఉన్నది. ఇప్పుడు వర్షాకాలం. అనేక విష క్రిములు అభివృద్ధి అవుతుంటాయి. ఈ మతాబుల వాసన చేత విషక్రిములు నశించిపోతాయి, వ్యాపించే రోగములు నివారణ అయిపోతాయి. ఆనందాన్ని కూడా కలుగ జేస్తాయి. కేవలం మతాబులు కాల్చి ఆనందించడంకాదు, మనలోనున్న దుర్గుణాలు పోవాలి. అప్పుడు సహజంగా మనకు ఆనందం ప్రాప్తిస్తుంది. అటులకాకుండా దుర్గుణాలు లోపలపెట్టుకొని, ఎన్ని విధములైన సాధనలు చేసినా ప్రయోజనంలేదు. మొట్టమొదట ఆ దుర్గుణాలను దూరం చేయాలి. అది చేయటానికి దైవచింతన కావాలి. ఆ దైవచింతన చేయాలి, వినాలి, అనుభవించాలి. కనుక శ్రవణం చేయండి! భజనలు చేయండి! మననం చేయండి!

( ది 23-10-95 న ప్రశాంతినిలయంలో భగవాన్ సాయి చేసిన దివ్యసందేశము నుండి )

చర్మచక్షువులు కాదు.... ( 4 వ పేజీ తరువాయి )

ఇది భగవంతుడు అందించాడని మీరనుకుంటారు కాదు....కాదు....మనమే కొని తెచ్చుకున్నటువంటివి.

లక్షల మైళ్ళనున్న అంతరిక్షమును చూస్తున్నదిగాని ఈ నేత్రము; తనను తాను చూచుకోలేకపోతున్నది. అంతరిక్షం చూసి ప్రయోజనం ఏమిటి? ఎంతో మనం ప్రాపంచిక సంబంధమైన కీర్తులను సంపాదించుకుంటు న్నాం. కాని తన కీర్తిని తాను సంపాదించుకోలేక పోతున్నాడు. ఏమిటి తన కీర్తి? సత్, చిత్ ఆనందమే తన కీర్తి. దానిని సాధించినటువంటివాడే మనిషి. దానిని సాధించకుండా ఎన్నిసాధించి ఏమి ప్రయోజనం? తెల్లవారు మొదలు రాత్రి పరుండువరకునూ ఈ పొట్ట నిమిత్తమై అనేక శ్రమలు చేస్తున్నాం. దేనికోసం చేస్తున్నామని విచారణ చేస్తే, ఏమీ అర్థం కావటంలేదు. ఈనాడు సైంటిస్టులు అంతరిక్షయానం చేస్తున్నారు. చంద్రునిపై కూర్చుంటున్నారు కాని మనస్సు యొక్క తత్త్వమును మాత్రం గుర్తించడంలేదు. తనను తాను గుర్తించుకోలేనివారు ఎక్కడికిపోయినా ఒక్కటే. ఇవన్నీ అర్థంలేని విద్యలు, సారములేని విద్యలు. తనను తాను తెలుసుకోలేని వ్యక్తి ఎన్ని విద్యలు తెలుసుకొనినా ప్రయోజనం ఏమిటి? మనం మానవులం కాబట్టి మానవత్వమంటే ఏమిటో? దానిని అర్థం చేసు కోవాలి. మనం ఎన్నో జన్మలనుంచి వస్తున్నాం. మనం పాతవాళ్ళమే. పాతవాళ్ళమేగాని కొత్తవాళ్ళుగా పేరును

సంపాదించుకుంటున్నాం పాతవాడనగా ఏమిటి? ప్రాచీనుడు, పురాతనుడు, సనాతనుడు అతనే దైవ స్వరూపుడు. అట్టి సనాతనుడైన దైవస్వరూపుడుగా తానుండి, ఏదో క్రొత్తవానిగా భావించుకొని, ఏమీ తెలియనటువంటి అజ్ఞానిగా కాలమును వ్యర్థం గావించు కుంటున్నాడు.

"ప్రదోషే దీపకశ్చంద్రః" చీకటి అంటే ఏమిటి? అజ్ఞానమే, ఒక విధమైన అమాయకత్వమే. ఈ అమాయకత్వము, అజ్ఞానముతో కూడినటువంటి ఈ మానవత్వానికి చంద్రః చంద్రుడనగా మనసుయొక్క ప్రకాశమే. మనసుయొక్క ప్రకాశము ఏవిధంగా ఉంటుంది? సూర్యునియొక్క కిరణములు చంద్రునిపై పడినప్పుడు, చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. చంద్రుడు స్వయంప్రకాశకుడు కాడు. అయితే చంద్రుని ప్రకాశం చల్లగాను, సూర్యుని ప్రకాశం తీక్షణంగా ఉంటుంది. ఒకే ప్రకాశమైనప్పటికీ ఈ బాహ్య భేదములకు కారణ మేమిటి? అదేవిధముగా దివ్యమైనటువంటి ఆత్మ ఒక్కటే. దాని ప్రకాశం మనస్సు అనే చంద్రునిపై పడి చల్లగా ఉంటుందాలి. అదే బుద్ధిపై పడినప్పుడు తీక్షణంగా ఉంటుంది. అయితే ఈనాడు మానవుడు బుద్ధిని అభివృద్ధి గావించుకుంటున్నాడేగాని, మనసును పరిపూర్ణం గావించు కోవటం లేదు. మానవుడు పరిపూర్ణ మానవుడు కావాలి. పరిపూర్ణుడైన భగవంతుని అనుగ్రహం పొందాలంటే ఏ పనినైనా పరిపూర్ణమైన మనసుతో చేయాలి. అప్పుడే పరిపూర్ణుడైన భగవంతునికి సంతృప్తి కలుగుతుంది. భగవంతుని సంతృప్తిపరచడమే మన కర్తవ్యం.

గోపికలు ఏమీ కోరేటటువంటివారు కాదు. వేణువును మాత్రం ఊదమని కోరేవారు. కృష్ణుని కారణం? ఒక్క వేణువునందే సర్వ వేద సారమూ ఇమిడి వుంది. ఆ వేణువు ఏది? అదియే మన దేహము. వేణువుకు తొమ్మిది రంధ్రములున్నాయి, మన దేహమునకూ నవద్వారము లున్నాయి. కనుక మన దేహమును భగవంతుని మురళీ గానంగా భావించాలి. ఎప్పుడు అది మురళీగానంగా మారుతుంది? ఇది కేవలం కర్ర మాదిరిగా వుంటే ఆ నాదం రాదు. వేణువులో ఏ పదార్థమూ అడ్డురాదు. అంతా బోలుగా ఉంటుంది. అప్పుడే ఈ స్వరం అందులో ప్రవేశిస్తుంది. కాని మన దేహమనేటటు వంటి వేణువు లోపల అనేకరకములైన కోరిక లనేటటువంటి పదార్థములను ఇముడ్చుకుంటున్నాం. వీటన్నింటిని తీసివేసినప్పుడే ఈ దేహమనే వేణువు పరి పూర్ణమైన స్వరాన్ని వినిపింపజేస్తుంది. దానినే భగవ దర్పితమంటారు. అప్పుడే ఈ వేణువు భగవంతుని పెదవులపై తిరిగి, కరస్పర్శచేత తనయొక్క ఉచ్ఛ్వాస నిశ్వాసమే మధురమైన గానంగా అందరినీ తన్మయత్తు లను గావిస్తుంది, ఉన్మత్తులను గావిస్తుంది. అది లేక పోవటంచేతనే మదోన్మత్తులుగా మారిపోతున్నారు. మదోన్మత్తులుగా మారిపోవటానికి విషయవాంఛలే మూల కారణం. అహంకార ఆడంబరములే దీనికి మూలం. సమస్త దుఃఖములకు మూల కారణము అభిమాన మమ కారములే. అభిమాన మమకారములు ఉండవచ్చును కానీ, అవి పరిమితంగా ఉండాలి, అన్నీ భగవదర్పిత మైనటువంటివిగా ఉండాలి.

అనేకమంది ధ్యానం చేస్తున్నామంటారు. ఎందుకు ఈ కాలమును వ్యర్థం చేస్తున్నారో, నాకర్థం కావటం లేదు. నిజంగా ధ్యానం చేస్తున్నారా? లేదు. సంసారాన్ని గురించి ధ్యానం చేస్తున్నారు. ఉద్యోగాలను గురించి ధ్యానం చేస్తున్నారు. విద్యను గురించి ధ్యానం చేస్తు న్నారు. దైవాన్ని గురించి ధ్యానం ఎవరు చేస్తున్నారు? దైవాన్ని గురించి చేస్తున్నామంటారు. ఇది సరియైనటు వంటిది కాదు. దైవమును ధ్యానం చేయనవసరం లేదు. దైవము తనయందే ఉన్నాడు. తానే దైవమై ఉన్నాడు. తానే దైవమని గుర్తించుకోవటమే ధ్యానం. ఈ సత్య మును గుర్తించుకొనక ఎన్ని సాధనలు చేసినప్పటికినీ ప్రయోజనం లేదు.

భక్తులకు ఉన్న ధైర్యం మరొకరికి ఉండదు. అయితే ఎటి భక్తులకు? పరిపూర్ణార్పితమైన భక్తులకు

పరిపూర్ణ హక్కు కూడా ఉంటుంది. కాని ఈనాడు పరిపూర్ణ శరణాగతి లేదు. ఈనాడు ఉన్నది Part time devotion మాత్రమే Part time పనిచేసే వారికి Part time payment మాత్రమే వస్తుంది ఈనాడు చాలామంది Part time Devotees గా తయారవుతున్నారు. Full time Devotees గా తయారు కావాలి, అంటే సర్వమూ భగవంతునికి అర్పితం చేయాలి అదే సులభమైన మార్గం ఏ పని చేస్తున్నా అంతా భగవంతుని పనే చేస్తున్నాననే భావనతో చేయాలి. ఆ విధంగా చేయటం ఎంత సులభం? చెడ్డ పని చేసాం—అది కూడా భగవంతునిదేనా? అని ఎవరైనా ప్రశ్నించవచ్చు "భగవంతుడు ఎప్పుడూ చెడ్డ పని చేయడు, భగవంతుడు చేసేదంతా మంచి పనే" అనే విశ్వాసంతో నీవు చేయాలి అప్పుడు చెడ్డ పనే రాదు భగవంతుని హృదయంలో పెట్టుకొని ఏ కార్యం చేసినప్పటికినీ "సర్వ కర్మ భగవత్ ప్రీత్యర్థమ్", అని చేయాలి. ఆ ప్రేమ తత్వాన్ని మనం పెంచుకోవాలి. ప్రేమకు మించినటువంటిది జగత్తులో లేనేలేదు

ఎల్లుండి సూర్యగ్రహణమని అనేకమంది అనేక విధముల భయభ్రాంతులు చెందుతున్నారు. భయపడవలసిన పనిలేదు అప్పుడప్పుడు ఇలాంటివి సంభవిస్తూనే ఉంటాయి. భూమికి, సూర్యునికి మధ్యలో చంద్రుడు వస్తాడు, అప్పుడు సూర్యుడు కనిపించడు. ఇదే గ్రహణమన్నారు దీనివల్ల జగత్తుకు ఏదో ప్రమాదమనుకుంటున్నారు ఎట్టి ప్రమాదమూలేదు. సృష్టిరహస్యంలో సహజంగా ఇవి జరుగుతునే ఉంటాయి సైంటిస్టులు దీనిని Experiment (పరిశోధన) చేయాలని భావిస్తున్నారు వారు నిరంతరం Experiment (పరిశోధన) లోనే కాలం గడుపుతూపోతే, ఎప్పుడు Experience (అనుభవం) పొందుతారు? చచ్చేంతవరకు పరిశోధనలు.... పరిశోధనలు.... అంటూ పోతే దానిని పరిశీలన చేసేది ఎప్పుడు? ఎల్లప్పుడు తెల్సుకోవటం.... తెల్సుకోవటం.... లోనే కాలం గడుపుతూపోతే, తెలుసుకున్న దానిని ఎప్పుడు ఆచరణలో పెట్టేది? ఆచరణలో ఆనందం ఉన్నదిగాని, తెలుసుకోవటంలో ఆనందంలేదు. తట్టలో నున్న పదార్థములను చెప్పినంత మాత్రమున పొట్ట నిండదు. తింటే పొట్ట నిండుతుంది కనుక ఆచరించి చూడండి. ఆచరణలోనే ఉన్నది ఆనందం తెలుసుకున్నది కొంచమయిన, దానిని ఆచరణలో పెట్టు భగవత్ ప్రేమ నిమిత్తమై నీ జీవితాన్ని పరిపూర్ణంగా అర్పితంచేయాలి. అదే Love is God, Live in Love.

(ది 22-10-95 న ప్రశాంతినిలయంలో భగవాన్ బాబావారు చేసిన దివ్యప్రసంగం నుండి)

## ఏడు పాశాలు

ఈనాటి మానవుడు ఏడు రకాల పగ్గాలతో, త్రాళ్ళతో కట్టబడి ఉన్నాడు: 1. శరీరం 2. కర్మ 3. రాగం 4. ద్వేషం 5. అహంకారం 6. అవివేకం 7. అజ్ఞానం

అజ్ఞానం, అవివేకం నుండి పుట్టినది. అవివేకం, అహంకారం నుండి పుట్టినది. అహంకారం, ద్వేషం నుండి పుట్టింది. ద్వేషం, రాగం నుండి పుట్టింది. రాగం, కర్మ నుండి పుట్టింది. కర్మ నుండి పుట్టినదే దేహం కాబట్టి దేహానికి కర్మయే ఆధారం. కర్మకు రాగం కారణం. రాగానికి ద్వేషం ఆధారం. ద్వేషానికి అహంకారం మూలం. అహంకారానికి అవివేకం మూలం. అవివేకానికి అజ్ఞానం ఆధారం. కనుక మొదట అజ్ఞానం నాశనం కావాలి. అనగా చీకటి పోవాలి. ఎంత పోరాడినా చీకటి పోదు. చిన్న దీపం ముట్టిస్తే చీకటి పోతుంది. ఆ దీపమే దైవనామం. తమస్సు పోవాలంటే జ్ఞానజ్యోతి వెలిగించుకోవాలి. జ్ఞానాన్ని అభివృద్ధిపరచుకోవటానికి నామమనే నావను ఆశ్రయించాలి. అత్యంత ప్రధానమైనవి రెండే రెండు. 1. అన్నదానం 2. హరినామం ఈ రెండు రెక్కలతో మనం స్వర్గానికి ఎగరగలము.

- బాబా

# SRI SAI HARI REAL ESTATES

**PUTTAPARTHI – 515 134**

ANANTHAPUR Dt. ANDHRA PRADESH

పుట్టపర్తియందు ప్లాట్లు, ఇండ్లస్థలములు కావలసినవారు, అమ్మ దలచినవారు ఈ క్రింది చిరునామావారిని సంప్రదించవలెనని కోరడమైనది.

1. సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్ ఎదురుగా ప్లాట్లు
2. గోకులం పోస్టాఫీసు ఎదురుగా ప్లాట్లు
3. M. R. O. ఆఫీసు ఎదురుగా ప్లాట్లు
4. బీడుపల్లికి పోవు బస్సు రోడ్డు వద్ద ప్లాట్లు
5. ప్రశాంతి నిలయం దగ్గరలో గల ప్లాట్లు
6. అపార్టుమెంట్స్ కావలసినవారు కూడా సంప్రదించండి.

నెలకు రు. 600/- ల స్కీములో చేరండి.

క్రొత్తగా ప్రవేశపెట్టిన స్కీములో చేరండి, 20 × 40 రెండు సెంట్లకు నెలకు రు. 600/- 16 నెలలు, "మారుతీ కారు" బంపర్ డ్రా.

---

☞ గమనిక : భగవాన్ శ్రీ సత్యసాయిబాబా డెబ్బై (70) వ జన్మదిన శుభ సందర్భంగా 23-11-95న శ్రీసాయి భక్తులకు మా చిరుకానుకగా అపార్ట్‌మెంట్స్ కావలసిన వారికి డెబ్బై వేల (70 వేలు) రూపాయలకు రిజిస్ట్రేషన్‌తో సహా ఇవ్వగలము.

ఇట్లు

శ్రీ సాయిహరి రియల్ ఎస్టేట్స్

ప్రొ॥ పి. సిద్ధయ్యశెట్టి

ఆర్యవైశ్య సత్రం ఎదురుగా

పుట్టపర్తి - 515 134

Phone : 87413

S T D 08555